# నవాన్న

(నాటకం)

రచన:

బిజన భట్టాచార్య

అనువాదం:

వేదుల సత్యనారాయణ శాస్త్రి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, కొత్త ఢిల్లీ

1977



రూ : 5-75

Original Title : NABANNA (*Bengali*)

Telugu Title : NAVANNA

డిస్ట్రిబ్యూటర్లు :

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్లు

రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST INDIA, A-5 GREEN PARK, NEW DELHI-110 016, PRINTED AT THE WELDUN PRESS 7/1, MANNAPPA MUDALI ST., MADRAS 600021.

# భూమిక

సమకాలపు ప్రజాజీవితములో పడుగు పేకగా కలిసి ఇమిడి ఉన్నప్పుడే నాటక పరిచయము జనుల మనసులోని చైతన్యానికి ధారాళమైన ఒక పరిణామాన్ని కలిగిస్తుంది. ఆ పరిణామ చరిత్రనుబట్టే నాట్య సాహిత్యముతో చక్కని పరిచయము ఏర్పడుతుంది. పంధొమ్మిదవ శతాబ్ది నడుమ వంగదేశములో అప్పటి దేశీయ సామాజిక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని మొట్టమొదటి నాట్యాందోళనకు పునాది పడింది. ముఖ్యముగా అప్పటి సామంత రాజుల రంగుల రాట్నమువంటి భావ విప్లవమును బట్టే ఆ ఆందోళన వికాసమూ ప్రసారమూ సాగింది. గాఢనిద్ర తర్వాత జాతికి జాతీయతామోహము భగ్నమైన కాలము అదే అని చెప్పవచ్చును.

ఆ సమయమందే మహాకవి మైకేల్ మధుసూదనదత్తు ఆధ్యాత్మిక ముక్తి వాదానికి సంపూర్ణశక్తిని చేకూర్చాలని కావ్య నాట్య సాహిత్య క్షేత్రమున భావ విప్లవమనే బాణాన్ని సంధించి నిరంకుశమైన భావ వాద లక్ష్యాన్ని అమోఘముగా భేదించివేశాడు. అయినా ఆ భావ విప్లవము అప్పటి జనుల మానసచైతన్యానికి ఆధ్యాత్మికముక్తి అనే మంత్రాన్ని ఉపదేశించగలిగిందేకాని, వ్యక్తి స్వాతంత్ర్యము కేంద్రముగా చేసి భారత జాతిని సామాజికముగా, వ్యవహారికముగా అదుపాజ్ఞలలో పెట్టలేకపోయింది. నిజానికి ఈ ముక్తి మంత్రానికి మొట్టమొదటి ఉద్గాత బంకించంద్రబాబే అని చెప్పవచ్చు. ఆ దృష్టితోనే భగవద్గీతకూ భాగవత శ్రీకృష్ణ చరిత్రకూ భాష్యము వ్రాసి సార్థకమైన భాష్యకారుడైనాడాయన. ఆధ్యాత్మిక చింతనవల్ల భావ విప్లవము అతి విశాలమై భరతవర్ష సమాజానికి ఏ విధమునను మేలు చేయలేదు కాని బాంగ్లాదేశమందు మాత్రము సాహిత్య క్షేత్రమున రవీంద్రుడూ, ఆధ్యాత్మిక క్షేత్రమున వివేకానందుడూ మొదలైనవారిలో ఆ బంకిం బాబు భాష్యము ఎంతో ప్రతిబింబించడము సత్యమూరముకాదు. వైష్ణవ భావ వాదుల ఆదర్శానికి ఉత్తరాధికారీ, నటగురువూ అయిన గిరీశ్‌చంద్రులోనూ, ఆ తర్వాత నాట్యాచార్య శిశిరకుమారులోనూ శ్రీ కామకృష్ణ దేవుని గౌడేయ శ్రద్ధాభక్తి కాబోలు బంకింబాబు భాష్యానికి ప్రతిరూపముగా భాసించింది. పెరిగిన చక్కని తోట ఎండిపోయిందన్న మనోవ్యథలోనే గిరీశ్. నాట్యయుగానికి తెర

వాలింది. కాని దాదాపు ఆ యుగములోనే మరల స్వజాత్యభిమానము గల 'ఆలంఘీర్' రంగస్థలమున ప్రత్యక్షమయింది.

గిరీశుడూ, శిశిరకుమారుడూ ఇద్దరూ నాట్యరంగమున యుగోత్తరులైన ప్రతిభావంతులు. యుగంధరులైన వీరిద్దరి ప్రతిభలోనూ మూలగతమైన ఐక్యమున్నప్పటికీ అనేకాంశాలలో గుణగతమైన భేదము లేకపోలేదు. ఒకరికి భావమూ, మరొకరికి భావనా, ఒకరికి ప్రేరణా, మరొకరికి ద్యోతనా ప్రధానము.

నాట్యమందు అవసరాన్నిబట్టి అభినయములో ఆవేశతరంగాలను సృష్టించడము గిరీశు ప్రతిభలోని విశేషము. నాటకమందలి విషయ వస్తువును సంపూర్ణముగా అవగాహన చేసుకొని ఆ పాత్ర చరిత్రను అభినయములో బుద్ధిదీప్తముగా వెదజల్లడము శిశిరకుమారు విశిష్టత. నాటకము పౌరాణికముకానీ, చారిత్రకముకానీ, సాంఘికముగానీ ఆయన అభినయ ప్రత్యేకతకు, దైవీ శక్తికి బదులు మానుషీశక్తి బలిష్ఠమైనదని స్పష్టపడుతుంది.

నాట్యాభినయముగాక తక్కిన వేరు వేరు శిల్పముల సృష్టిలో చిన్నవీ పెద్దవీ కొన్ని పద్ధతులు రూపొంది ఉన్నవి. కాని అభినయ శిల్పాన్ని గూర్చి దసప్రచారము చేయడములో అటువంటి విశిష్టమైన మధ్యాంతికము విలువ ఏదీ లేదు. సూక్ష్మాతి సూక్ష్మమైన స్వరసరళి శ్రోతల అంతఃకరణానికి బాగా తగిలి ఒకప్పుడు అశరీరమైన పుష్పచందన సువాసన వంటి ఆనందలీలా విలాసమునూ, ఒకప్పుడు చెదరిపోయిన చిత్తమును ముందుకు తోసే ఏదో ఒక విధమైన అనుభవమునూ కలిగిస్తుంది. అభినయములోని విచిత్రమైన ఆ స్వర గ్రామము ఇప్పటికీ ప్రత్యక్షముగా ఇంద్రియ గ్రాహ్యము కాదు. అయినా శిశిరకుమారబాబు పరోక్షముగా ఆ స్వర, లయ, న్యాసమును ఏదో ఒక విధముగా ప్రదర్శించేవాడనడము సత్యము. ఈ నడుమ ప్రజాజీవనము మారింది. సామాజికముగా రాజకీయముగా నైతికముగా ఆలోచించే పద్ధతులు మారిపోయినవి. అందువల్ల ఒకప్పుడు రంగస్థలాన సూర్యుడుగా ప్రకాశించిన 'రొమాంటిక్ హీరో' క్రమేపీ వెలవెలపోయి, వెన్నెలలాగున క్షీణించిపోయి గిరీశకుమారుతోనే అంతరించిపోయాడు.

శ్రీరంగమ రంగస్థలాన నవాన్న నాటకము ప్రదర్శించినప్పుడు జరిగిన సంగతి

ఒకటి సందర్భాన్నిబట్టి ఇక్కడ ఉదాహరించడము మంచిది. శిశిరబాబు విశ్వనాద బాబు బుజాన చేయివేసి, నవాన్న నాటకములోని ప్రధాన సముద్దారుకేసి వేలెత్తి చూపుతూ పరధ్యానగా "విన్నూ? చూడు. వాడే మన చాకలి. జ్ఞప్తికి రాలేదా నీకు?" అని అన్న మాటలు నా చెవిని పడ్డవి. నవాన్ననాటకములోని ప్రధాన సముద్దారు పాత్ర అతనికి ఏ చాకలిని జ్ఞప్తికి తెచ్చాడో అది అతనికే తెలియాలి. కాని ఆక్షణిక విభ్రాంతిలోనే పరోక్షముగా శ్రీరామచంద్రుడు ఒక గుహక చండాల రూపములో ఉన్న ఒక రజకుని పాత్రలో ధన్యుడు కాగోరుతున్నాడని నాకు ప్రత్యక్షముగా అనుభవము అయింది. శిల్పిని అంచనావేయడములోనూ, అతడు ఒక సమన్వయము చూపించాడు. శ్రీరంగమ రంగస్థలాన నవాన్న నాటకము ప్రదర్శించిన కొన్నేండ్ల తర్వాత శిశిరబాబు తులసీ లాహిడీ రచించిన 'దుఃఖీర్ ఇమాక్' అనే నాటకాన్ని ప్రదర్శించాడు. ఆ నాటకములో అతడు అంతగా దిగజారిపోలేదు. ప్రజానురంజనకు అలవాటుపడిన అయోధ్యాధిపతి శ్రీరాముడూ ఢిల్లీశ్వరుడైన ఆలంగేరు పక్షమూ ప్రజాసమూహముతో కలిసి ఆ రోజున ఏక పంక్తి భోజనానికి వేయపడిపోవడమే శోచనీయము. ఆ తర్వాత సూర్యుడు పడమటి కొండకు చేరాడు. రాగరంజితమైన పశ్చిమాకాశం మా వారసత్వము లోకి వచ్చింది. అక్కడనే కొత్తగా నవనాట్య రంగము వెలసింది. ఢిల్లీమయూర సింహాసనము వదిలిపెట్టి విశాలమైవాసముతో సమాజానికి .. మత్తెక్కిన ఒక సైనికుని అంగీకారానికీ నడుమ నవనాట్యరంగము కొత్తగా విలసిల్లింది. వ్యక్తి స్వాతంత్ర్యము నుండి సమష్టి చైతన్యానికి చేరడానికి అదే తరుణము అని ద్వితీయ మహాసంగ్రామ నాటకములోని గర్భాంకమందే సూచన ఏర్పడింది. అది ఒక యుగసంధితరుణము.

సామ్రాజ్యవాదశక్తికి విరుద్ధముగా ఆసియాఖండమంతటా ప్రబలిన ప్రజాస్వామ్యముమీదకూడా భారతీయులకు మోజు తగ్గింది. సంపూర్ణ స్వాతంత్ర్యము తప్ప ఏ షరతులున్న ప్రభుత్వమూ పనికిరాదని స్థిరపడ్డది. ఉభయపక్షాల పెద్దపెద్ద నాయకులూ ఎదతెగకుండా జరిపిన రాజీ సంభాషణలు చురకత్తి పలిగోరైనట్లు ముగిసినవి. సామ్రాజ్యవాది అయిన ఆంగ్లప్రభుత్వముతో సంపర్కము పనికిరాదని కోటానుకోట్ల భారతీయులనోట 'క్విట్ఇండియా' అనే నినాదము దశదిశలా మారు

మోగింది. చిట్టచివరకు గాంధీమహాత్ము డుపదేశించిన 'చావో బదుకో' అనే మంత్రమే భారతీయులకు యావన్మందికి గాయత్రీమంత్రమయింది.

1942 ఆగస్టులో భారతదేశమంతటా ప్రజాస్వామ్యము ప్రారంభమయింది. అయినా సామ్రాజ్యవాది అయిన బ్రిటిషు ప్రభుత్వము ప్రాణాంతక ప్రయత్నముగా భారతదేశమును వలస రాజ్యముగా తమ అధీనములో ఉంచుకోవాలనే స్వార్థముతో భారతదేశముపై సమస్త హింసా దౌర్జన్యాలతో విరుచుకపడ్డది. రాజ్యాంగ సమ్మత ముగా దేశవిభజన జరిగి స్వాతంత్ర్యము వచ్చింది. కాలనేమి అభిశాపములాగు వచ్చిన ఈ స్వాతంత్ర్యముతో దేశములో అల్లరులు చెలరేగినవి. మత దురభిమాన ముతో ప్రజలు మహాఘోరముగా ఒకరినొకరు చంపుకొని, రక్తపాతము లేకుండా వచ్చిన ఈ స్వాతంత్ర్యానికి పాపపరిహారము చెల్లించారు. రక్తక్షయానికి కారక మైన ఈ చరిత్రారంభకాలమే నవాన్న నాటకరచనా కాలము.)

(ఒకవైపు పవిత్రమైన స్వాతంత్ర్య సంగ్రామమున ఆత్మబలిదానము చేయ డానికి లక్షోపలక్షలు భారతీయులు బారులు దీరి నిలబడినట్టే మరొకవంక సామ్రాజ్య వాదుల రెక్కల నీడలో హాయిగా పోషణ పొందుతూ, స్వార్థపరులైన గుత్త వ్యాపారులూ, చీకటి బజారులో నిత్యావసరమైన సరుకులు దాచి ఖరీదులు పెంచి డబ్బు నిల్వచేసుకొనే వర్తకులూ, అభివృద్ధి నిరోధక శక్తులతో చేయిగలిపి దేశ ప్రజల రక్తాన్ని పీల్చి పిప్పిచేశారు. దీన్నిగూర్చే శరత్చంద్రబాబు తన భాషలో "గోవుల మాంసమెత్తిన బండిని లాక్కొనిపోయే ఎద్దులు ఆ గోవులజాతివే" అని చెప్పాడు.

స్వధర్మ రక్షణకై ఆత్మబలి సాగిన వేదిక మీదుగానే సంప్రదాయహంతలైన ఈ నరపిశాచాల శ్మశానోల్లాసమే బాంగ్లాదేశానికి సర్వనాశము తెచ్చిపెట్టింది. భూస్వాములు రైతులను భూమీ తిండీ లేని భిక్షకులుగా మార్చివేశారు. సహింప శక్యముగాని నిరంకుశ శాసనాల శోషణవల్ల బాంగ్లాదేశములోని గ్రామీణుల జీవ నము ఆమూలాగ్రము తలక్రిందులై పోయింది. కాలాంధకారములాగున మహా క్షామము దేశమంతటా వ్యాపించింది. చేదుల గాలితో ముందుకు సాగిన ఆధూమ కేతువూ, దానివెనక తిండిలేని నిరుపేదల ఆకలి యాత్రలూ, ఆ వెనుక శ్మశాన

రోదన ధ్వనులూ పట్టణాల రాజవీధులలో సందులలో గొందులలో ప్రదక్షిణాలు చేస్తూ తిరగసాగినవి. ఎన్ని లక్షల ప్రాణాలనో పొట్టబెట్టుకొన్న ఘోరమైన ఈ మహా క్షామేతిహాసము భారత చరిత్రలో మాసిపోని కళంకాధ్యాయము. (దారీ తెన్నూ లేక ఆ మహాక్షామములో ఆకలిగొన్న ప్రజలు నిస్సహాయులై బాటలలో బయళ్ళలో గుంపులు గుంపులుగా మృత్యువుపాలైనారు. కాని నిప్పు మంటలు కురిసిన ఆగస్టు ఉద్యమములో భారతీయులు సిరుకై మృత్యువును ప్రతిఘటించి విలవగలిగినారు.)

జాతీయ జీవనానికి వెలుగు నీడల సంధిక్షణమది. ఆ సమయమందే అభ్యుదయ రచయితలూ, శిల్పులూ, నటులూ సమావేశమై సాంస్కృతికోద్యమము తల పెట్టారు. పఠన పాఠన రచనాదులలో జాతీయ సంగీతములో సంస్కృతిని ప్రవేశ పెట్టడమేకాక, జాతీయ జీవనానికి ప్రతిరూపములైన నాటకాలు రచించి, ప్రదర్శించి జనసామాన్యములో దేశమునూ జాతిచరిత్రనూ ప్రచారము చేయడానికి ముఖ్యముగా పూనుకోవాలని ఉత్సాహవంతులైన సభ్యులకు గట్టిగా తట్టింది. నేనూ ఆ సంఘములో సభ్యుడనని చెప్పనక్కరలేదు. అది మనసులో పెట్టుకొనే నా కర్తవ్యాన్ని నెరవేర్చుకోవడము కోసము మొట్టమొదట "ఆగున్" అనే నాటకాన్నీ, దాని తర్వాత 'బాస్ బంద్' అనే నాటకాన్నీ ఆ తర్వాత ఈనవాన్న నాటకాన్ని రచించాను.

అప్పటి సమాజాన్నిబట్టి చూస్తే "ఆగున్" అనేది పరీక్షార్థము వ్రాసిన చిన్న నాటిక. కొద్దిమంది శిల్పుల సహకారముతో తేలికగా కొన్నిసార్లు ఆ నాటకాన్ని ప్రదర్శించడము జరిగింది. కాని పాత్ర నిర్ణయము చేసేటప్పుడు వాడుక తెలిసిన వారూ, వేషధారణ దక్షులూ అయిన కొందరు శిల్పులు అవసరమని అనుభవము వల్ల తెలిసికొన్నాను. నిస్సందేహముగా శిల్పి కుశలుడే కావచ్చు. కాని రంగస్థలాన అభినయించేటప్పుడు మామూలుగా ఆ కౌశలము చూపలేకపోవచ్చు.

రెండవ ప్రపంచ సంగ్రామాన్నిబట్టి, మహాక్షామమూ, మహమ్మారివంటి అధి దైవికములైన దుర్ఘటనలను బట్టి స్వాతంత్ర్యోద్యమ స్వభావము గతి పూర్తిగా మారిపోయి ఒక ముగింపు ఘట్టాన్ని చేరడానికి ముందుకు సాగింది. అసలు సమస్య ఎటువంటి వికారరూపముగా కనబడినా, సంఘటిల్లిన కొన్ని అనర్థాలలో మానవ హస్తము ఏదీ లేదని తోచింది. చైతన్యమూ, వివేచనా కల మనస్సులుకూడా కళ్ల

మిరుమిట్లుగొల్పే వైకుంఠభ్రమలో పడి గిర్రున తిరగసాగినవి. చిట్టచివరకు అటు వంటి దుస్సమయములోనే "జవాన్ బంక్" నాటకంవల్ల కలిగిన సూచనలనుబట్టి, దేశము కోసము ప్రాణాలర్పించిన వేలకొలది ప్రత్యక్ష దుర్గలకు జన్మభూమి అయిన మేదినీపూరు జిల్లా "బ్యాక్ గ్రౌండు" గా సముద్దారు వాగ్మూలముతో నవాన్న నాటకము వ్రాయడానికి కూర్చున్నాను. మోక్షముకోరిన పరాన్నందలు కళ్ళకు దుస్స్వప్నముగా తోచిన బంగారు ధాన్యము (సోనార్ధాన్) ప్రధాన సముద్దారు కళ్ళల్లో మందారపుష్పాకృతితో ప్రకాశించింది. భావాలనే దుర్దమ సంకల్పాన్ని దాటుతూనే అతడు చావడానికి అంగీకరించలేదు. (ఎన్నో పాత్రలతో కూడుకొన్న ఈ నాటకము నాలుగు మాసాలు విడకుండా అభ్యాసముచేసిన తర్వాత మొత్తము మీద ప్రదర్శించవచ్చునని తోచింది.)

(కిరాయి రంగస్థలాల తోడ్పాటు ఏమీ ఉండదనే సంగతి చెప్పి లాభము లేదు. ఆ ప్రస్తావన వచ్చింది కనుక ఒక విషయము చెప్పక తప్పదు. శ్రీరంగమము లోని విశ్వనాధ బాహుదే చూపిన బంధువాత్సల్యము మరిచిపోలేనిది. 'పీపిల్సు రిలీఫు కమిటీ' ప్రారంభోత్సవ సమయాన శ్రీ రంగమ నాటకశాలలో మేము మా నవాన్న నాటకాన్ని విజయవంతముగా ఏడురాత్రులు ప్రదర్శించాము. భారతీయ గణ నాట్య సంఘము పని వారి విసుగులేని ప్రయత్నముతో కలకత్తాలోని వేరువేరు నాటకశాలల్లో, పార్కుల్లో అల్లే అవిభక్త వంగదేశములోని వేరువేరు జిల్లాల్లోనూ నవాన్ననాటకము ప్రదర్శించడము జరిగింది. ఆ ప్రదర్శనాలన్నీ సఫలము కావడము వల్ల నాకూ ఏ కొంచెమో ప్రశస్తి లభించింది. (ఇప్పుడు సుప్రభాతము. నిశాంత వేళ కోరిన కోరిక తీరకపోలేదు. కాని గొప్పదైన మన సాంఘిక జీవనాన్ని ఆ నాశన పిశాచము నల్లని నీడ మన సాంస్కృతిక జీవనము మీద అడ్డుపడి ఉన్నది. శిల్పమూ శిల్పులూ కూడా దిగ్భ్రమలో పడిఉన్నారు. సాంస్కృతికముగా సమన్వయమూ అన్వేషణమూ ఎంతో అవసరమైనా మన మింతవరకూ సరియైన దృక్పథము కనుక్కోలేము) తన పీపు తనే వాయించుకొనేవాడు పిచ్చివాడు కాని గుడ్డివాడు మాత్రము కాడు. గురువును నమ్మే ఈ దేశములో అస్తమించినప్పుడు జ్ఞానాంజనము పెట్టే పుడక నిదానమూ, తత్వసమాచారమూ రోజుకు ఒక మారైనా వల్లెవేస్తాము. ఎందుకు వల్లెవేస్తాము? మంత్రోచ్చారణ చేసేటప్పుడు కూడా మనము గుడ్డివాళ్లము.

మనకు రాత్రి పగలూ లేదు. కాని ఈ మాట గుడ్డివానికి చెల్లుతుంది కాని మనోజ్ఞ మున్న మనుష్యుడు కళ్లు ఉండికూడా ఆ విషయములో సంశయ పడడానికి కారణము లేదు. క్రొత్త విలువల మదింపు వేసేటప్పుడు సహజ వివేకాన్ని దుర్వినియోగము చేసిన నేరానికి శిక్షగా ప్రపంచ దృష్టిలో మన ప్రాణవస్తువనే బంగారానికి చిర కాలము విలువ తక్కువగానే ఉంటుంది. శిల్ప సంస్కృతిలో, విశేషించి నాట్యరంగాన నిజమైన సాఫల్యము ఎప్పుడూ వెనకబడే ఉంటుంది. వందలాది రాత్రుల్ల గౌరవముతో చేసిన ఘోషణ అంతా ఎడతెగని అమావాస్య కారుచీకటిలో కలిసిపోతుంది. అందువల్ల బొత్తిగా తరుణము మించిపోయినా జాగ్రత్త పడదము మనకు అవసరము. అందుకు జ్ఞానముగలవారు తెలియనట్లుండే వక్రబుద్ధిమాని కర్మమార్గాన ముందు నడవాలి. అజ్ఞానులు జ్ఞానవంతులు కావాలి. జ్ఞానులు ప్రబుద్ధులు కావాలి.

ఎంతో గొప్పదైన సామాజిక జీవనరంగమున సాంస్కృతిక జీవనమువల్ల వాస్తవముగా ఎన్నో క్రొత్త క్రొత్త సమస్యలు తరుచు రేకెత్తవచ్చును. ఆ వాస్తవ సత్యాలు సర్వ సమ్మతమగునట్లు మార్చడానికి భావవిప్లవముతో మంచి సాధన చేయాలి. ఆ సాధన శుద్ధితో ఉద్దేశించిన శిల్పానికి ఆలోచనా తూనికతో ఆకర్షణీ యముగా చక్కని రూపురేఖలు తీర్చిదిద్దాలి. మనస్సుకూ ప్రాణానికీ సమన్వయము సాధింపలేకుంటే ఆ రూపానికి కళ్లు ఏర్పరచడము ఏచిత్రకారుని హస్తానికీ సాధ్యము కాదు.

ఈ కాలమున శిల్పి కళ్ళలోని ప్రేమాప్రేమల అనుభవము సత్యముగాక కొంత వాస్తవమూ కొంత నటనా అయితే స్వప్నములోని జ్ఞాన విజ్ఞాన సంక్రమణ రేఖగా నిరూపితమైతే శిల్ప క్షేత్రమున సరియైన దృక్పథము లభింపదు. వార్తా సాహిత్యములో ఒక చిత్రమున్నది. కుక్క మనిషిని కరచిందనే కబురు వార్త కాదు. మనిషి కుక్కను కరచాడనేదే చమత్కార గుణమువల్ల వార్త అవుతున్న దిప్పుడు. వార్తా సాహిత్యమందు రసవిచారణకున్న ఈ విలువే, అభినయములో ఆంగికమునకూ, నాటకములోని వస్తువునకూ, ప్రయోగములోని శిల్ప కళాకౌశ లానికి నిర్దేశించినట్లయితే, నాటక భవిష్యత్తును గూర్చి బాగా సంశయపడవలసి

వస్తుంది. కన్ను చెదిరే రంగు, కన్ను పొడిచేకాంతి, అంతస్సారములేని చూడ రాని ప్రదర్శనమూ, క్షీణించిపోయిన జాతి చైతన్యానికి ప్రతిబింబములని నా విశ్వయము.

గతించినదానికై విచారపడడము అసంగతము. అంగణాల్లో ప్రాంగణాల్లో చక్కని కొత్తకొత్త నాటకాలు ప్రదర్శించడమే ఇప్పుడావశ్యకము. ఇప్పుడు బాంగ్లా దేశములో మూడు వేలకుపైగా ఉన్న నాట్యసంస్థలన్నీ సమిష్టిగా చూపుతున్న ఆవేశో త్సాహాలు నాటక భవిష్యత్తుకు శుభసూచన మాత్రమే. ఎన్నో బాధలూ విపత్తులూ ఉన్న వలభై రెండేండ్లకాలములోనూ, నాటక ప్రయోగానికి వెళ్లినపుడు నాకు స్వచ్ఛంద మైన విశాల ప్రదేశము లభించింది. కాని ఇప్పటి వంగదేశములో మంచి అవ కాశమూ, అవసరమూ ఉన్నప్పుడు ఉత్సవాంగణము వెదికినా కనబడదము లేదు. నేను అంగణమును గుర్తించలేను. అంగణము నన్ను గుర్తించలేదు ఎమో ఎవ రెరుగుదురు?

పీఠిక పెంచడమువల్ల లాభంలేదు.... అవసరమూ, బాధ్యతా గుర్తించే మొత్తంమీద నా మనస్సుకు మంచిదని తోచిన దానిని విష్కృపటముగా మీ ముందుంచాను. విస్తరము కొంచెము ఏదైనా ఉంటే క్షమించండి అని సామాన్య పాఠకులను వేడుకొంటున్నాను. (సుసీలదత్తు ప్రయత్నము లేకుంటే నవాన్న నాటకానికి ఈ నాలుగో ముద్రణము అయ్యేదే కాదు. కాబట్టి ఆయనకు ధన్యవాదము లర్పిస్తూ ఈ భూమికను ముగిస్తున్నాను.

బిజన భట్టాచార్య

# పాత్రలు

| | |
|---|---|
| ప్రధాన సమాద్దార్ | అమీన్‌పూర్‌లోని ముసలి రైతు |
| కుంజ సమాద్దార్ | ప్రధాను తమ్ముడి కొడుకు |
| నిరంజన సమాద్దార్ | కుంజ తమ్ముడు |
| మాఖన్ | కుంజ కొడుకు |
| దయాల్ మండల్ | పొరుగు రైతు |
| హారూదత్త | వడ్డీ వ్యాపారి |
| కాళీధన్ ధాడా | బియ్యపు వర్తకుడు |
| రాజీవ్ | కాళీధను గుమస్తా |
| చందర | ఒకరైతు |
| యుధిష్ఠర్ | విప్లవకారుడు |
| ఇద్దరు ఫోటోగ్రాఫరులు | వార్తాపత్రికా ప్రతినిధులు |
| మొదటి పెద్ద మనిషి | బియ్యము కొనవచ్చినవారు |
| బిరకర్తా | ఇంటి పెద్ద |
| ముసలి బికారి | — |
| చౌకీవాడు | — |
| పోలీసు యినస్పెక్టర్ | — |
| డాక్టరు | — |
| దిగంబరు | — |
| ఫకీర్ | — |
| పంచానని | ప్రధాను భార్య |
| రాధిక | కుంజ భార్య |
| వినోదిని | నిరంజను భార్య |
| ఖుకీర్మా | — |
| బిచ్చగత్తె | — |
| బాంగ్లా మెడోనా | — |

పెద్దమనిషి, నిర్మలబాబు, టౌట్, బికారి, హారూదత్తు బావమరిది, కానిస్టేబిల్స్, రోగులు, భృత్యులు, చందర్ కూతుళ్లు, బిరకతు, రైతులు, తిండిలేని జనం మొదలైన వారు.

# ప్రథమాంకము — మొదటి రంగం

[పగలు వెళ్ళిపోయింది. చరాచరాలను కప్పివేసి దౌర్భాగ్యపు పల్లెమీదికి దిగి వచ్చింది రాత్రి. రంగస్థల మంతటా దట్టమైన చీకటి మూరాన ఎత్తైన ఎర్రని భూమి. మసక వెలుగులో తాబేలు డిప్పలాటి పీఠభూమిమీద ముగ్గురు నలుగురు మనుష్యులు రాకపోకలు చేస్తూ కనబడుతుంటారు. ఇద్దరు వ్యక్తులు భయపడుతూ జాగ్రత్తగా రంగస్థలంమీదికి వచ్చి తమలో తాము ఏవో గుసగుసలాడి వెళ్ళిపోతారు. తర్వాత కొంచెం సేపటికి మళ్లా ఎవరో మరికొందరు వచ్చి గుసగుసలాడి వెళ్ళి పోతారు. మనుష్యుల నీడలు చేతులూ కాళ్ళూ ఆడించడాన్నిబట్టి గట్టిగా మాట్లాడకపోవడాన్నిబట్టి ఏదో భయంకరమైన కుట్ర వాళ్ళ నడుమ జరుగుతున్నట్లు తోస్తుంది. హఠాత్తుగా ఏదో తగలబడి ఎత్తైన చోటు మరింత ఎర్రబడిపోతుంది. పైకి పోతున్న పొగలతో బూడిదా, నిప్పు రవ్వలూ ఎగిసిపోతాయి. మంటల వెలుగులో పీఠభూమిమీద ఉన్న మనుష్యులు ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తారు. నల్లగా, బలంగావున్న ఇద్దరు వ్యక్తులు-ఒకడు బాగా వయసు మీరిన వాడు. ఇంకొకడు ముప్పై, ముప్పైరెండేండ్ల వయసువాడు. వాళ్ళ ఒంటిమీద బట్టలేవీ లేవు. మోకాళ్ళ దాకా ఒక బట్టను చుట్టబెట్టుకొని చేత్తో లాఠీలు పట్టుకొని ఆవేశముతో బుజాల కండరాలు పొంగిస్తూ కనబడతారు.]

ప్రధాను : (చేయెత్తి ఎర్రని పీఠభూమికేసి చూపిస్తూ) ఇదంతా కొంతసేపు ఆపగానే....కొంతసేపైన తర్వాత పగలు వస్తుంది దాని ఎన్నిక జరుగుతుంది. ఆ మాట మన శ్రీపతీ, భూపతీ చెప్పి వెళ్ళారురా కుంజా! ఒరే కుంజా, అటుకేసి కళ్లు విప్పి చూడు—అటువంటి సౌందర్యము, ఆ భయంకర సౌందర్యము కళ్లెత్తి చూడరా! (జాలిగా, నిర్లక్ష్యంగా నవ్వి) ఈ మూడు పొణకల ధాన్యం నా కంటావా

నువ్వు! జీవితం అర్పించకుంటే శాంతి లేదు. ఆ శాంతి సంగతి నీకు పట్టదూ తట్టదూ. ఒరే కుంజా! నేను ప్రాణం అర్పిస్తాను. రా! శత్రువుల నోట్లో దుమ్ము కొట్టి ప్రాణాలు ధారపోస్తాను రా కుంజా! మన శ్రీపతీ భూపతీ....................

[నేపథ్యంలో వెదురు కర్రలతో కొట్టుకొంటున్న చప్పుడు]

కుంజ: (నోటిమీద చూపుడు వేలు మోపి) మాట్లాడకు!

అలికిడి మరి లేదు. అది - అదీ........

ప్రధాను: పద పద కుంజా మనం ముందుకు వెళ్దాం పద.

కుంజ: ముందుకు వెళ్దామా! వెర్రివాడా! నీ బుర్ర పాడైనట్లుంది.

ప్రధాను: నా బుర్ర పాడయిందా!

కుంజ: కాక మరేమిటి! (నేపథ్యంలో కర్రలతో కొట్టుకొంటున్న చప్పుడు) అదుగో, ఆటుకేసి విను. అవును. అదుగో మళ్ళా కొట్టుకొంటున్న చప్పుడు.

ప్రధాను: మళ్ళా! మళ్ళా! వాళ్లు ఎంతమంది ఉంటారంటావు?

కుంజ: ఎంత మంది ఉన్నారో ఎట్లా చెప్పగలం! ఎంతమందో?

ప్రధాను: అయితే పద! ఎకాయికిని వెళ్ళి వాళ్ళను చుట్టుముట్టేద్దాం! పద. ఆ కేకలన్నీ వాళ్ళవే.

కుంజ: కాదు. అట్లా కాదు. అదుగో మళ్ళా అదే. పద: పారిపోదాం.

ప్రధాను: పారిపోవడమా! పారిపోదామంటావా! నువ్వు....నువ్వు........

కుంజ: వట్టినే తెలిపికొన్నందువల్ల లాభమేమిటి? పద. ఆ అడవిలోకి పరుగెత్తిపోదాం పద.

ప్రధాను: (ఏడ్పు గొంతుతో) అబ్బా! నా గుండె మండిపోతున్నది. ఒరే కుంజా! నా గుండె ..........

కుంజ: నీ గురించే నా గుండెలో మహాజ్వాల. నీ గురించే తెలిపిందా? మహాజ్వాల.

(అని ప్రధానుని చేతితో పట్టుకుని లాగుతూ యిద్దరూ వెళ్ళిపోతారు. తడబడుతున్న కాళ్ళతో వినోదిని ప్రవేశిస్తుంది.)

వినో : (తెలియని దానిలాగు) అమ్మో! ఇదేదో ఆపద వచ్చి పడింది. ఇప్పు డెక్కడికి వెళ్ళాలి? (గబగబా వెళ్ళిపోతుంది. తడబాటుగా నిరంజన్ ప్రవేశిస్తాడు).

నిరంజన్ : (పైన బట్టేది లేకుండా రొజుతూ) అందువల్లనే ఇదేదో మహా ప్రమాదం (గబ గబా వెళ్ళిపోతాడు.)

పంచానని : (లాఠీ మోపి తొందరగా నడుస్తూ) లేదు. సిగ్గూ, గౌరవమూ మరి ఉండదు. సిగ్గూలేదు, గౌరవమూ లేదు. ఔను. ఉండదిక. (తొందరగా వెళ్ళిపోతుంది.)

[తల విరబోసుకొని పరుగుస్తూ రంగస్థలంమీద నుంచి రాధిక దగ్గరకు గబగబ వెళ్ళిపోతుంది. సంజవేళ గోధూళి వెలుతురులాగు పీఠభూమి ఎరుపు క్రమేపి విషణ్ణమైపోతూంటుంది. దూరాన్నుంచి శంఖధ్వని వినవస్తుంది. చీకటిగా ఉన్న రంగస్థలంమీదనుంచి కొన్ని క్షణాలపాటు చాలామంది నడుస్తున్న చప్పుడు వినబడి క్రమంగా దూరమైపోతుంది. కుంజ ప్రవేశిస్తాడు.]

కుంజ : (కాలితో నేలను తట్టుతూ) పోనీ.........వెళ్ళిపోయారు. రండి. మీరందరూ ఇటు రండి.

ప్రధాను : (ప్రవేశించి మణికట్టుమీద తగిలిన గాయాన్ని చేతితో కప్పి పట్టుకొని) వెళ్ళిపొయ్యారా? ఊఁ. వెళ్ళినా మళ్ళీ రావడం ఎంతసేపు?

కుంజ : (ప్రధానుకేసి చూపి) అదేమిటి ఆ నెత్తురు? విన్నెందుకు గాయ పరిచారు?

ప్రధాను : (నిర్లక్ష్యంగా తగ్గు గొంతుతో) ఓహ్! ఈ రక్తాని కింక విలువ. జంతువుల్లాగు, క్రూరమృగాల్లాగు అడవుల్లో, కొనల్లో పారిపోయి బతికే వాళ్ళం ఈ రక్తంమీద ఇంకా భ్రమ! బాగా అయింది. కుంజా! ఒరే కుంజా! నన్ను ఒదిలి పెట్టెయ్యి. నా గుండె మండిపోతున్నది. అబ్బా! నా గుండె.........

కుంజ : ఎవరికి గుండె మండదు? నా గుండె మండడంలేదా?

ప్రధాన్: (క్షోభతో) మీకూ మండితే నేను చెప్పినప్పుడు ముందుకు ఎందుకు పోలేదు? ఎందుకు పోలేదురా ముందుకు నువ్వు? నీ గుండె మండితే మన శ్రీపతి, భూపతి ... ....

కుంజ: ఇంక ఈ 'పతి'ల' బాధ నా గుండెల్లోనూ ఎంతో చుర్రుమంటున్నది తెలుసా పెద్దనాన్నా! అయినా నీవు ఆ రెండు పేర్లూ మాటి మాటికి నోట తలచు కొంటూ కల్ల శాంతి పొందాలనుకొంటున్నావు. మరి నేనో లోపల్లోపల కాలి చస్తున్నా. ఇదే మీకూ నాకూ తేడా. అయ్యో కల్లి! కల్లి! అగ్నిజ్వాల........

[లాఠీమోపి గబగబ నడుస్తూ పంచానని ప్రవేశిస్తుంది.]

పంచా: (ఆవేశంతో) దీని కేదో గట్టి ఏర్పాటు చేయాలి. తెలిసిందా కుంజా? గట్టి ఏర్పాటు చేయాలంటే! అరే ఎట్లాంటి సంగతి ఇది? సిగ్గూ, బిడి యమూ చంపుకొని ఆడవాళ్ళందరూ అడవుల్లోకి పోయి జాములకొద్దీ ఎందు కుండాలి? ఏమిటీ అసలు సంగతి? ఏమిటి చెప్పు? దేశంలో మగవాళ్లు లేరా మరి?

కుంజ: నీవా పెద్దమ్మా!

పంచా: అవును నేనే. ముందు నేను అడిగిందానికి జవాబు చెప్పు.

కుంజ: ఏమడుగుతావో అడుగు.

పంచా: మళ్ళా అడగాలా? కనబడటములేదా? తిని కూర్చోలేక ఎందుకి గుడ్డిపోకెళ్లు? మీ చేతగానితనానికి ఆడవాళ్లు ఎందుకు ఈ కష్టాలు సహించాలి? ఏమి పాపం చేశారో ఆడవాళ్లు చెప్పు?

కుంజ: ఏం చెప్పను నేను.

పంచా: ఏం చెపుతావో చెప్పు!

ప్రధా: సహించడానికి వచ్చావు నువ్వు. సహించు. నోరు మూసుకొని సహించు. ఏ మాటా చెప్పకు. ఏమైనా అన్నావో అధర్మం అవుతుంది. నోరు మూసుకొని ... ....

పంచా: అయితే చెప్పేదేవిటి! ఇప్పటికి మూడ్రోజులనుంచి నేను పల్లెత్తి మాట్లాడలేదు. ఏమీ అనలేదు తెలుసా? ఆడవాళ్ళం మేం కాయకష్టం ఎంతైనా

ఏదైనా సహించగలము. అదొక పెద్ద విశేషమేమీ కాదు. కాని సిగ్గూ! లజ్జా! ఈ దేశంలో మొగవాళ్లు మీరు ఆడవాళ్ళకేవి అలంకారమని చెప్పుకొని గర్వపడతారో ఆ సిగ్గూ, ఆ లజ్జా అన్నిటికంటే గొప్పది, ఆడవాళ్ళ గౌరవం! అయ్యో! రామ! అడగవద్దా మరి! చెప్పు జవాబు. మాట్లాడవేం? చెప్పు (అని కుంజకేసి క్షణం చూసి గబగబ వెళ్ళిపోతుంది.)

కుంజ: (క్షోభిస్తూ) మర్యాద! చూస్తున్నాంగదూ గౌరవం! బ్రతకడమే అమర్యాదైనచోట. ఆడవాళ్ళకు గౌరవం! కాని....కాని.... (అని పెద్ద నిట్టూర్పు విడుస్తారు.)

ప్రధాను: అదుగో! మళ్ళీ వచ్చి పడింది ఈ 'కాని'. అన్నిట్లోనూ ఈ 'కాని' ఒకటి! (హఠాత్తుగా ఆవేశంతో పరుగెత్తిపోయి కుంజ గొంతు పట్టుకొని. ఈ 'కాని' అనేదాన్ని గొంతు నులిమిపారేసి మరి లేకుండా చేసేస్తాను. ఒరే కుంజా! ఒరే, మరి మిగలకుండా....(అని కలియబడతారు.)

కుంజ: పెద్దనాన్నా! పెద్దనాన్నా! ఏమిటిది? నీకేమయింది? ఎందు కిట్లా అయిపోతున్నావు? (అని ప్రధానును ఒక తోపు తోస్తారు.)

ప్రధా: (క్రిందపడి హఠాత్తుగా మామూలు స్థితికి వచ్చి) అయ్యో! ఏం చేశాను నేను!!

కుంజ: పెద్దనాన్నా! పెద్దనాన్నా!

ప్రధా: ఒరే కుంజా! నా గుండె మండిపోతున్నదిరా! అయ్యో! నా గుండె భగ్గున....భగ్గున.... (అని వగరుస్తూ కుంజకేసి చూస్తుంటారు. యుధిష్ఠిరుడు ప్రవేశిస్తారు.)

యుధి: కుంజా!

కుంజ: (తలెత్తి చూసి) ఓ! తమరా! ఎప్పుడొచ్చారు?

యుధి: ఈ ప్రాంతానికి వచ్చి ఏడురోజు లయింది.

కుంజ: అరే! కొత్తగా తెలియనేలేదే మాకు!

యుధి: అవును. మీకు తెలియకపోవడం సహజమే. ఎందువల్లనంటే నేను ఈ మధ్యనే వచ్చి రెండు సార్లు తిరిగి వెళ్ళాను. మూణ్ణాళ్లక్రితం - అంటే పోయిన బుధవారంనాడు ఒక కాబూలువాలా తిరిగి వెళ్ళిపోయాడు ఇక్కడనుంచి.

కుంజ: (తల ఊపి) కాబూలువాలా! పొద్దుటపూటగదూ?

యుధి: అవును సుమారు తొమ్మిది గంటలప్పుడు (కొంచెం నవ్వి) ఆ కాబూలువాలాను నేనే.

కుంజ: మీరేనా! అల్లా చెప్పండి. (ఆశ్చర్యపోతాడు)

ప్రధా: తమరు............

యుధి: ఒక దుంగమీద కూర్చుని–నువ్వు పొగ తాగుతున్నా వప్పుడు.

కుంజ: అవును. సరిగ్గా చెప్పారు మీరు.

యుధి: చూడు. మళ్ళా ఒకరోజు రాత్రి రతన్‌గంజి నుంచి గుర్రంమీద వెనక్కు వెళ్ళిపోయాను నేను.

[కుంజ, ప్రధాను యుధిష్ఠిరుకేసి ఆశ్చర్యంగా చూస్తుంటారు]

సరే. అదట్లా ఉండనీయండి. ఆ విషయాలన్నీ మీకు తెలియవలసిన అవసరం లేదు. సమయం చాలా తక్కువ రెండు మూడు అత్యవసర విషయాలు మీతో మాట్లాడి నేను వెంటనే వెళ్లిపోవాలి. అసలు సంగతి ఏమిటంటే, మన కర్తవ్యానికి ఏవేవో అడ్డంకులు కల్పించాలని చూస్తున్నారు కొందరు. వాళ్ళకు బుద్ధి వచ్చేటట్లు చేయడానికి మనము ఏదో గట్టి ఏర్పాటు వెంటనే చేసి తీరాలి. అంతకన్నా మరో దారి ఏదీ లేదు. మన ఆదర్శం నెరవేరాలంటే ఏదో వ్యవస్థ - అది ఎంత కఠినమైనా ఎంత నిష్ఠురమయిందైనా అవలంబించి తీరాలి. అందుకు ఏ మాత్రం వెనకాడినా మనం ఇక ముందుకు పోలేము. విజయం మనదేనని నే నెరుగుదును. కాని ఆ విజయం అనాయాసంగా లభించదు. కుంజా! అదుగడుక్కూ నెత్తురు ధారపోసి అయినా ఆ విజయలక్ష్మిని జయించి మనం తీసుకొచ్చి తీరాలి.

ప్రధా: (ఉత్సాహంతో) అందుకే నేను "కుంజా! ముందుకు వెళ్లు. అమాంతం ఆవాళ్ళను చుట్టుముట్టి ప్డగొట్టు." అని ఎంతో చెప్పాను. కాని కుంజ

నా మాట వినిపించుకోలేదు. పారిపోయాడు. వట్టినే పారిపోయాడు. ఇప్పుడే గనక మా శ్రీపతి, భూపతి ఉంటేనా (అని దుఃఖంతో పడిపోతాడు.)

కుంజ : (యుధిష్టరుతో చాటుగా మెల్లిగా) చివరకు మా పెదనాన్న ఆ ఇద్దరు కొడుకుల దుఃఖముతో పిచ్చివాడై పోయాడు.

యుధి : కాదు. పిచ్చివాడు కాదు. కరంజా ప్రధాను పిచ్చివాడు కాదు. ఇది నిశ్చయం. మిధ్యకాదు. ఇప్పుడు మనకు ఇట్టి ఉన్మాదమే అవసరం. ఇది వట్టిపిచ్చి కాదు కుంజా!

ప్రధా : నేను పిచ్చివాణ్ణి కానే కాను.

యుధి : నీవు ప్రధాను పిచ్చివాడంటున్నావు. కాని ఆ పిచ్చి దేనివల్ల వచ్చింది? ఎందుకు వచ్చింది? నీవు చెప్పగలవా? కుంజా! నీవు పొరపాటుపడుతున్నావు. ఇది పిచ్చికాదు. ప్రధాను పిచ్చివాడు కాదు.

కుంజ : మా పెదనాన్న పిచ్చివాడు కాదంటారా?

ప్రధా : (మెల్లిగా) పిచ్చివాణ్ణట నేను! కాను. ఎప్పుడూ పిచ్చివాణ్ణి కాను.

యుధి : మనలో ఉన్న దోషాలనూ, నైచ్యాన్నీ అన్నిటినీ కాల్చివేసి పవిత్రం చేసేది ప్రధాను గుండెలోని మంటే. ఆ మంట. ఆ పిచ్చి మనకందరికీ కావాలి ఇప్పుడు.

[నిర్ఘాంతపడిపోయి కుంజ ఏదో చెప్పాలనుకొంటూనే చెప్పలేకపోతాడు.]

యుధి : (కుంజ రొమ్ము తట్టి) సమయం దాటిపోవచ్చింది. ఇక నేను వెళ్ళిపోతాను. ప్రధానూ, వెళ్ళిపోతాను. మళ్ళీ ఒకమాటు వస్తాను. (అని మామూలు ప్రకారం కుడిచేయి గుండెపై పెట్టుకొని, చేతులు పైకెత్తి సెలవు పుచ్చుకొని బయలుదేరుతాడు. కుంజా, ప్రధానూ కొంచెం దూరం యుధిష్టరువెంట వెళుతుంటారు. ఇంతలో నేపధ్యంలో పెద్ద గందరగోళం వినిపిస్తుంది. క్రమంగా ఆ గందరగోళం పెరిగిపోతుంది. కుంజా నాలుగువైపుల తేరిపార చూస్తాడు. ప్రధానూ చెవొగ్గి వింటాడు. నేపధ్యంలో కర్రలతో కొట్టుకొంటున్న చప్పుడు ఎక్కువవుతుంది.)

కుంజ : పెద్దనాన్నా! పెదనాన్నా! అడుగో మళ్లా (అని తన వెంట రమ్మని చేత్తో సైగచేస్తూ వెళ్ళిపోతాడు.)

ప్రధా : (పెద్దగా నవ్వుతూ) అరుగో! మల్లా వచ్చారు. ఒరే కుంజ ఈసారి ప్రాణాలు అర్పించక తప్పదురా! అర్పిస్తాను. నా ప్రాణం ధారపోసేస్తాను. తప్పదు. ప్రాణం ఇచ్చేస్తాను. (వెళ్లను)

[నేపథ్యంలో గందరగోళం హెచ్చిపోతుంది. వెంటనే లాటీ పట్టుకొని జనసమూహాన్ని నడిపిస్తూ పంచానని రంగంలో ప్రవేశిస్తుంది.]

పంచాన : (బిగ్గరగా) పదండి. ముందుకు పదండి. మీరంతా ముందుకు పదండి.

[నేపథ్యంలో జనమంతా కలిపి 'వందేమాతరం' అని కేకలు పెడుతూ కొంత ముందుకు పోతుంది. వెదురులాటీలతో కొట్టుకుంటున్న చప్పుడు వినవస్తుంది. జనం వెనక్కు వస్తుంటారు.]

పంచా : ముందుకు వెళ్ళండి. జనంమీద దూకండి. పొండి. ముందుకు దూకండి.

[మల్లా కొట్టుకొంటున్న చప్పుడు. జనానికి జనం భయపడి వెనక్కు తిరుగుతారు.]

(దెబ్బతిన్న ఒక వ్యక్తి పరుగెత్తి వచ్చి) ఓయ్ బాబోయ్! అబ్బో! నెత్తురు నెత్తురు! ఓయి నాయనోయ్,అమ్మో! ఎంత ఘోరం! (అని అరుస్తూ వెళ్ళిపోతాడు.)

పంచా : ఓహో పిరికిపందల్లారా! వెన్నిచ్చి పారిపోతారేం! ఛీ ఛీ. మీరంతా భీరువులు. మగతనంలేదా మీకు! వెనక్కు వస్తారా! మన అమీను పురానికి కళంకం తెస్తారా? వెనక్కు రాకండి. ముందుకు దూకండి. అమీన్పురానికీ జయ్. దూకండి ముందుకు.

['వందేమాతరం' అంటూ జనం ముందుకుపోతారు.]

పంచా : శభాష! శభాష్! ఎప్పుడు పుట్టామో అప్పుడు చావు అనేది ఉన్నదే! భయపడకండి. పిరికిపందలై బతకడం కంటె వీరులై చావడం మంచిది. భయపడకండి. పదండి ముందుకు! నేనూ నామాటా (అని నేపథ్యంలోకి వెళ్లుతుంది. మల్లా కొట్టుకొంటున్న చప్పుడు. దెబ్బ తగిలి తల చేత్తో పట్టుకొని మల్లా ప్రవేశించి) ముందుకు, ముందుకు పదండి (అని అరుస్తూ కిందపడి మాట్లాడలేక ముందుకు

పదమని చేత్తో సైగ చేస్తూ తెలివి తప్పిపోతుంది. జనమంతా పీఠభూమి కేసి పరుగెత్తుతుంటారు. ఇద్దరు ముగ్గురు రంగస్థలం మీద పడి కాళ్లూ చేతులూ కదిలిస్తూ ఉంటారు. మండుతున్న కాగడాలు రెండు మూడు నేల మీద పడి ఉంటాయి. కత్తులూ, కర్రలూ మొదలైన ఆయుధాలు అక్కడా, ఇక్కడా చెల్లా చెదరుగా పడి వుంటాయి. తెరలో కొట్లాట గోల తగ్గిపోతుంటుంది. కొంచెం తెలివి వచ్చి పంచాననె మెల్లగా మౌనంగా చేయి ముందుకు పొమ్మంటు న్నట్లు ఊపుతుంటుంది. అప్పటికి కాగడాలు రెండు మూడు పొగలు కక్కుతూ అక్కడక్కడా పడి ఉంటాయి. తెరవాలుతుంది.)

# ప్రథమాంకం — రెండో రంగం

[ఒక పాడుబడుతున్న ఇల్లు. ఒకగది, రెండు వరండాలూ ఉన్న ఆ యింట్లో ప్రధానూ, అతని తమ్ముడి కొడుకులు, కుంజా, నిరంజనులూ, కుంజ భార్యా, నిరంజను కొడుకు మాఖనూ, భార్య రాధికా ఉంటున్నారు. ప్రధాను గది వరండామీద కూర్చొని ఉంటాడు. కుంజ భార్య నీళ్ళకడవ భుజానికెత్తుకొని వచ్చి ఇంట్లోకి వెళ్ళిపోతుంది. మళ్లా కొంచెంసేపటికి చంకన ఒక పాతకుండా, చేత్తో ఒక బస్తానంచి పట్టుకొనివచ్చి బయట బస్తాపరిచి కుండలోని ధాన్యం బస్తామీద పోసి కాళ్ళతో నలగతొక్కుతూ ఉంటుంది.]

రాధి : వంట కావచ్చింది. నీళ్ల పోసుకో. ఈ కాసిని ధాన్యమే ఉన్నాయి తిండికి ఆధారం. ఎంత జాగ్రత్తగా వాడుతున్నాగాని అయిపోయాయి.

కుంజ : అదేమిటే! అట్లా అంటావు? గడమంచెమీద నల్లజాడీలో పాత ధాన్యం ఇంకా ఉండాలి కదా?

రాధి : (మూతి తిప్పుతూ) ఆ ఇంకా నీ కోసం ఆధాన్యం కూర్చున్నాయి. రోజుకు ఎన్ని శేర్ల బియ్యం పడుతున్నాయో ఏ రోజైనా లెక్కవేసి చూశావా?

కుంజ : (కోపంగా) లేదు. లెక్కవెయ్యకుండానే నడుస్తున్నది.

**నిరంజ : (అడ్డువచ్చి) ఈ 'లేదు' అనే గోల సంసారంలో నెల ముప్పై రోజులూ ఉండనే ఉంది. మరి ఈవేళ పొద్దున్నే అకారణంగా బాధపడి లాభం ఏమిటి? నోరు మూసుకొని వెళ్ళిపో !**

కుంజ : ఆ దురుసుతనం చూడు ఒకమారు. మామూలు మాటతో "లేవు. ధాన్యం అయిపోయాయి" అని చెబితే సరిపోదూ! ఊహూ! ఆడవాళ్ళ ఈ సూటిపోటు మాటలు వింటుంటే నాకు అరికాలి మంట నెత్తికొస్తున్నది. బొత్తిగా సహించలేక పోతున్నాను. ఛీ! ఛీ! పనికి సుకవాపి, తిండికి రాకాసి. ఈ ఆడవాళ్లు.... ... ....

రాధి : (కోపంతో) అవును. తెగతిని శరీరం ఎంత అందంగా తయారయిందో కనబడడం లేదూ? (మూతి తిప్పుకు) మరి మాట్లాడకు. మీ మొగవారి పరువు ప్రతిష్ఠలు నాకు చెప్పకు. తెలిసిందా? మా ఆడవాళ్ళకున్నూడా సిగ్గుచేటు. ఎందుకూ వట్టిపోచికోలు కబుర్లు?

కుంజ : ఓహోహో! ఏమి సిగ్గులాడిరా ఇల్లాలు!! (తాంబూలము ఉమ్ముతాడు.)

రాధిక : (ఓరచూపు చూసి) రెండుకళ్లూపెట్టి చూడలేవు. వెళ్ళిపోతుంది.

ప్రధా : అయ్యో ధాన్యవా! ఊహూ! నాలుగు ధాన్యంగింజల కోసం.... ....

నిరంజ : (అడ్డం వచ్చి) చాలు. శాంతించు నువ్వు. నీ విచారించడమేమీ బాగాలేదు నాకు. నీ పరితాప వాక్యాలు వినలేక చెవులు గళ్లుపడున్నాయి.

కుంజ : అవును. అంతా నాశనమైపోయి ఇప్పుడిక ఈ పరితాపమే మిగిలింది నీకు. ఎన్నో ఘనకార్యాలు జరిగిపోయినయి నీవల్ల.

ప్రధా : మూడు నాలుగు ధాన్యంగింజలు కాదు. మూడు మూడు పౌణకల ధాన్యం.

కుంజ : చాలు! కట్టేయి నీ పురాణ్ని.

ప్రధా: (గట్టిగా నిట్టూర్పులు విడుస్తాడు.)

నిరంజ: (ప్రధానుతో) చేసిందంతా బాగా ఆలోచించే చేశాడు.

కుంజ: బాగా ఆలోచించడమంటే? తాను స్వయంగా చేశాడూ, బాధ్యత వహించి పదిమందికి చెప్పి ధాన్యం పాడు చేయించాడు.

ప్రధా: (గట్టిగా) ఎవరికీ ఏమీ చెప్పలేదు ఈ ప్రధాను. ఏమీ బలవంతం చెయ్యలేదు.

కుంజ: నీవు స్వయంగా నీ చేత్తో ఇతరుల పొణకల్లోని ధాన్యం నష్టపెట్టావని నేను చెప్పడంలేదు. ధాన్యం దంచే మరదాకావెళ్ళి బ్రతిమాలి చెప్పడం బలవంతపెట్టడము కాదా? ఆ తర్వాత.......

నిరంజ: నేను ఎవరినీ బలవంతపెట్టలేదు.

కుంజ: అయితే మంచిదే. నీవు బ్రతిమాలాలేదు. బలవంతపెట్టాలేదు. కాని నువ్వు చేసి చూపించి వారికి నేర్పి పెట్టావు.

ప్రధా: అవును నేర్పాను.

నిరంజ: మరి ఆ పని వివేచనతోనే చేశావా?

ప్రధా: అవును. మంచి వివేచనతో చేశాను. నేనే నేర్పాను అందరికీ— నన్ను ఏమి చేస్తారో చెయ్యండి. పడవను నేనే అటకాయించి ఉంచాను. ఇరవై నాలుగు గంటల నోటీసుతో పడవకెత్తించి మరోచోటికి నేనే పంపేశాను. మీరు ఏమిదలచుకొన్నారో మీరు చేయండి నన్ను. (ప్రధాను అస్థిరుడై పోతాడు.)

కుంజ: (మాట్లాడకని నిరంజను సైగచేసి) నిన్నింక ఎవరూ ఏమీ చేయ దలచుకోలేదు. కాని నడమనడమ మీరు ఎందుకో పరితాప పడుతూ మాట్లాడడం వల్లనే ఈ సంగతులన్నీ ఎత్తవలసివచ్చింది. అయిందేదో అయ్యేపోయింది. ఏమైనా అటువంటి ధాన్యం కొన్ని నెలలతర్వాతగాని మళ్ళి లభించదు దేవుడు అనుగ్రహిస్తే ఏ ఇబ్బందీ రాదు. ఏ విపత్తైనా మునపటిలాగు వచ్చిపడినప్పుడుగదా మళ్ళీ తిండికి దేవులాట. ఏదీ? ఇల్లాలెక్కడికి పోయింది? ఒరే మాఖన్ మీ అమ్మను ఒకసారి కేకవెయ్యరా?

మాళి : మరి అమ్మవచ్చి ఏం చేస్తుందిప్పుడు.

కుంజ : ఏంచేస్తుందో చెప్పాలా నీకు! మొండివెధవా? వెళ్లు. తొందరగా పిల్చుకరా!

మాళి : సరేలే! వెళుతున్నా. (వెళ్ళిపోతాడు)

కుంజ : చంటివెధవ! నోట్లో చనుబాలవాసన ఇంకా పోలేదు. ఇప్పుడే ఎదురువాదించడం నేర్చాడు. తల్లి వీణ్ణి ఎట్లా చూస్తుందో ఏమో మరి. (వచ్చిన రాధికను చూసి) నీ స్వభావం చూపించి అప్పుడనగా వెళ్ళావు. మూతి ముడుచు కొని కూర్చుంటే అందరికీ కడుపునిండుతుందా చెప్పు.

రాధి ; నే నెప్పుడు కోప్పడ్డాను?

కుంజ : ఆ సంగతి కాదులే! (మెల్లిగా అడుగులువేస్తూ పెద్దగదిలోకెళ్ళి) ఏదో మంచెమీద దాచిపెట్టావు ఆ సంగతి.

రాధి : నేనేదో దాచిపెట్టుకొంటే దానివల్ల ఎవరికీ వచ్చేదీలేదు పోయేదీ లేదు.

కుంజ : లేకపోవడం ఏమిటీ! బొత్తిగా గోళ్లు గిల్లుకుంటూ ఇంట్లోకూర్చొని ఉంటున్నాను. చూడు అదే. నీది. ఆ వస్తువు తెచ్చియ్యాలి నువ్విప్పుడు.

రాధి : (ఊహించి కొంచెం కోపంతో) ఏది? ఏదియ్యాలి?

కుంజ ; (కళ్లు మూసుకొని) దాని పేరేమిటి చెప్మా.

రాధి : ఆ-హా, నీ తమాషా చూస్తుంటే మెడకు ఉరిపోసుకోవాలనిపిస్తున్నది.

కుంజ : ఉండు జ్ఞాపకం వస్తున్నది. నీవు నడిచేటప్పుడు – గలగల చప్పు డవుతుంది. అదే. దానిపేరూ ...ఆ జ్ఞాపకం వచ్చింది. నీ కాళ్ళ – అదే.

రాధి : పాంజేబుల జత. అదేనా?

కుంజ : అవునవును. అదే.

రాధి : ఆమాత్రం నాకు తెలియదనుకున్నావా? ఎప్పటినుంచో అది నీ కళ్లు కుడుతున్నది. నా దగ్గిర కొంచెం నాటకమాడావు. పుట్టింటివాళ్లు పెట్టిన వస్తువని అడగడానికి భయపడి: చూడు. ప్రేమతో ఆ వస్తువు నాకిచ్చింది మా అమ్మ. అది

నే ఇవ్వనుగాక ఇవ్వను. అందుకే జాగ్రత్తగా దాచిపెట్టాను. అన్నీ తినేశావు. మిగిలున్నది అదొక్కటే నాకు. అదికూడా మిగలడం చూళ్ళేకపోతున్నావు అయ్యో అదృష్టమా ?

కుంజ: ఇవ్వనుగాక ఇవ్వననిచెప్పి నీ అదృష్టాన్ని దురదృష్టంగా చేసుకోకు. కుంజ సముద్దారు ఇంకా బ్రతికే ఉన్నాడు. చచ్చిపోలేదు.

రాధి : మంచిమాటే. అందుకు ఇదే తార్కాణం. అదీ నా సౌభాగ్యమే.

కుంజ: అంతేనా అది! నేను చచ్చిపోతేనే స్వేచ్ఛకూ,నీ సౌఖ్యానికీ పుట్టింట్లో ఏ ఇబ్బందీ ఉండదని అనుకొంటున్నావేమో నీవు! అది దప్పిక తీరుతుందని ఎండమావులకై పరుగెత్తడమే సుమా ? కేవలం ఆశాభంగమే తెలుసా ! (అని గబాల్న ఇంట్లోకి పరుగెత్తి, గుడ్డా గుడుసూ అన్నీ మూటగట్టి బయటికితెచ్చి) మీ పుట్టింటి వాళ్లు చాలా గొప్పవాళ్లని మాటిమాటికీ మాటల్లో, చేష్టల్లో కనబరుస్తుంటావు. ఆ ధీమా ఒక్క దెబ్బతో నాశనం చేసేస్తాను. (అని మూట క్రింద దింపుతాడు. రాధిక వెళ్ళిపోతుంది.)

నిరంజ: ఇవన్నీ తీసుకొని ఎక్కడికి వెళ్తావు?

కుంజ: ఇంకెక్కడికీ దుకాణానికి! ఇంట్లోవాళ్ళకు తిండిపెట్టాలిగదా! (అని మూటతో వెళ్ళిపోతాడు.)

ప్రధా: మాఖన్! ఒరే మాఖన్ (అని దగ్గుతూ,తిడుతూ ఇంట్లోకి వెళతాడు.)

నిరంజ: ఉమ్మెత్తకాయ! సంసారాన్ని సర్వనాశనం చేశాడు. వెధవ! నేనూ ఇప్పుడే వెళ్ళిపోతాను.

[నీళ్ళకుండ చంకనపెట్టుకొని వినోదిని వస్తుంది ]

వినోదిని: ఎక్కడికెళ్తావు?

నిరంజ: ఓహో! మరొక వగలాడి వచ్చింది! ఉన్నదంతా అయిపోయింది. ఎక్కడకీ వెళ్లిపోక చేసేదేముంది ?

వినోదిని: అయ్యో! అదేమిటీ! నేనేం చేశాను ?

నిరంజ : ఏమీ చెయ్యలేదు. ఏమీ చెయ్యలేదు. సరేనా? వెళ్లు. ఇక్కణ్ణుంచి వెళ్లు. నీకు పుణ్యముంటుంది. నాకేమీ బాగాలేదు. ఇప్పుడే నేనూ వెళ్ళిపోతాను.

వినోదిని : అదే అడుగుతున్నాను. ఎక్కడికి వెళ్తావూ అని.

నిరంజ : ఎక్కడికి వెళ్ళడమో నాకే ఇంకా నిశ్చయంలేదు. రెండు కళ్లూ ఎటుచూపిస్తే అటు వెళ్తాను.

వినోదిని : అయ్యో రాత! ఏమిటీ మాటలు!

నిరంజ : ఈ సంసారంలో మీతోపాటుఉండి రాత్రింబగళ్ళూ సతమతం కావడంకన్నా మరొకటేముంది? ఈరోజే వెళ్లిపోతాను నేను.

వినోదిని : అయితే నన్నుకూడా తీసుకపోరాదూ!

నిరంజ : తాను దూర సందులేదు మెడకొక డోలు అన్నట్లుంది.

వినోదిని : నీకున్న సందు నాకూ ఉంటుంది. నన్నేం మోసుకపోవాలా ఏం?

నిరంజ : ఎక్కడికిపోతావు నీవు? ఎక్కడా నిల్చోడానిక్కూడా నాదీ అనే చోటు లేదు (తలాడిస్తూ పెదిమ విరిచి) ఇప్పటికిక్కడే ఉండు నీవు. ఏదైనా పనో పాటో, కూలో నాలో దొరుకుతుందేమో చూసుకొన్న తర్వాత - అప్పటి సంగతి అప్పుడాలోచించుకోవచ్చు.

వినోదిని : ఒక్కడివే వెళతావా మరి!

నిరంజ : ఒక్కణ్ణికాక జతెవ్వరు దొరుకుతారు నాకు?

వినోదిని : అందుకే వెంట నన్నుకూడా తీసుకపొమ్మంటున్నాను.

నిరంజ : పిచ్చిదానా? నీకేమైనా మతిపోయిందా? ఎక్కడికి వెళ్ళడమో ఏమి చేయడమో నాకే నిశ్చయంలేదని చెపుతున్నాను కాదూ! దారీలేదు. తోవా లేదు. ఏమీ బాగాలేదు. అయినా ఇక్కడ అయ్యవార్లంగారి నట్టిల్లు. దినదినగండం. ఏమైనా సరే ఎక్కడికో వెళ్ళితీరాలి.

వినోదిని : అయితే నిలుచున్నపాటున వెళ్ళడమెందుకు? వెళ్ళడం తప్ప నప్పుడు ఇవ్వాలే వెళ్ళితే బాధేమిటి? అయినా బాధెందుకు?

వినోదిని: బాధ అనుకొంటే బాధ. అనుకోకపోతే ఏమీలేదు. మరి నేనొక్కతినే ఇక్కడ ఉండాలిగదా?

నిరంజ: ఒక్కతెవే ఎందుకు ఉంటావు? మీ ఆడవాళ్ళ ముచ్చట్లన్నీ ఈలాగే ఉంటాయి.

వినోదిని: మరి ఆడదాన్నై పుట్టాను. ఏం చెయ్యను?

నిరంజ: పుట్టావు. మంచిపనే చేశావు. నీవెంత చెప్పినా ఏమి చెప్పినావినను. వినబోను. ఇక్కడ ఇంకా ఎంతోమంది ఉన్నారు. వాళ్ళతోపాటు నీవూ ఉండవచ్చు. నిన్నేమీ అడివిలో దిగవిడిచి వెళ్ళడంలేదు. అన్నయ్య ఉంటాడు. వదిన ఉంటుంది. పెదనాన్న ఉంటాడు. మాఖన్ ఉంటాడు. వీళ్ళేమీ పరాయివాళ్లు కారు. నీకు భయమెందుకు? సంసారం అవస్థ చూస్తున్నావుకదా! ఉప్పు ఉంటే పద్దన్నముండదు. అవస్థలన్నీ చూస్తూ చూరుపట్టుకొని వేళ్ళాడుతుంటే ముందుముందు ఎలాటి మార్పులొస్తాయో ఏమో! బాగా ఆలోచించి చూడు. (వినోదిని కళ్లు తుడుచుకొంటూ ఉంటుంది.) ఉహూ! ఊరికే ఏడిస్తే ఏమీ జరగదు. స్థితిగతులు బాగా యోచించాలి. ఏడిస్తే పనులు జరుగుతాయా? అలాగైతే నేనూ ఏడవగలను! కాని కన్నీళ్లవల్ల ఏమీ ప్రయోజనం ఉండదు.

[అలిసిపోయి కుంజ వస్తాడు.]

కుంజ: (వాళ్ళద్దరికేసి చూసి నిరంజనుతో) మళ్ళా చేయి చేసుకొన్నావనుకొంటాను. ఏం?

నిరంజ: (మాట్లాడడు.)

కుంజ: చాలాసార్లు చెప్పాను నీకు. పధాయిపిల్ల ఒంటిమీద చేయివెయ్యకురా అని. మూఢుడా!

[వినోదిని ఏడుస్తూ వెళ్ళిపోతుంది].

మళ్ళా ఆ పిల్ల ఒంటిమీద చెయ్యివెయ్యి నీ సంగతేదో చూస్తాను. ఇప్పుడే యింట్లోంచి వెళ్లిపో వెధవా? దరిద్రంలోపడి ఈ నడమ నీ స్వభావం నాశనం చేసుకొన్నావు. నీచుడా? మొద్దు వెధవా? ఇప్పుడే నా యింట్లోంచి ఎక్కడికిపోతావో పో

దున్నపోతా! (అని పిచ్చెత్తినట్లు దగ్గరఉన్న కర్ర తీసుకొని నిరంజను తలమీద దెబ్బకొడతాడు. తల పగిలి నెత్తురుకారుతుంటే నిరంజను వెళ్ళిపోతాడు.)

కుంజ : (నెత్తురుచూపి మతిపోయి) ఆ—మ్మో! తల పగిలింది. నెత్తురు. నెత్తురు. అమ్మో! నా తమ్ముణ్ణి ఖూనీ చేశాను. అయ్యో! నిరంజన్! నా నిరంజన్! నా తమ్ముడూ! నా తమ్ముడూ! నా నిరంజన్ అయ్యో.

[తెర వాలుతుంది.]

# ప్రథమాంకం - మూడోరంగం

[గుమ్మంమీద కూర్చొని ప్రధాను హుక్కా త్రాగుతూ పరధ్యానంగా ఉంటాడు. కుంజ ముంగిట్లో నిల్చొని కాలి బొటనవేలితో నేల గీకుతూ ఉంటాడు. చూస్తే వాళ్ళిద్దరినడమ ఏదో ఆలోచన సాగుతున్నట్లు తోస్తుంది.]

ప్రధాను : (చివర పీల్పుపీల్చి పొగ వదులుతూ) అల్లాగైతే మనకు గడిచేదెట్లా? ఏదో ఒకమాట చెప్పు మరి!

కుంజ : నేను చెప్పేదేముంది? పొలము నీది. నీవే బాగా ఆలోచించి చూడు!

ప్రధాను : నా ఆలోచన చెప్పానుగదా. నీవేమంటావో చెప్పు.

కుంజ : నేను చెప్పవలసిందేదో ఇదివరకే చెప్పాను.

ప్రధాను : ఏమిటి చెప్పావు?

కుంజ : పొలమిప్పుడు అమ్మవలసినపనిలేదు. పుల్లుదు చేను అమ్మి తినే రాము. ఎన్నాళ్లవచ్చింది ఆ డబ్బు! అయినా మంచినీళ్ళప్రాయంగా పొలం ఊరికే తక్కువ ఖరీదుకు అమ్మివేస్తే ముందుమాట ఏమిటి? చేసిందేమిటో చేశావు. మరి అమ్మవలసినపనిలేదు. అయినా * మూడు భీగాలేకదా ఉన్న పొలం.

ప్రధాను : అయితే ఇది నిశ్చయమన్నమాటేగా చెప్పు. అకారణంగా....

* ఒక భీగా ఒక ఎకరం పొలంకంటె కొంచెం తక్కువ.

కుంజ : ఇంకా నిశ్చయమేనా అంటావేమిటి? అమ్మవద్దని చెపుతున్నాను. మంచిపంట ఎప్పుడైనా పండవచ్చును. దరిద్రమంటావా, అది ఎప్పుడూ ఉండనే ఉంది. పొలం అమ్మినా ఉంటుంది. అమ్మకపోయినా ఉంటుంది. రోజులన్నీ ఒక మోస్తరే ఉంటాయా? చూదాం. ఇప్పుడు తొందరపడడం ఎందుకు?

[పొరుగువాడు దయాలు మండలు ప్రవేశిస్తాడు.]

**దయాలు : ఇదుగో ప్రధాను! అయితే ఇంటిదగ్గరనే ఉన్నావన్నమాట. అందుకే నీ దర్శనం దొరికింది.**

ప్రధాను : (నలువైపులా చూసి) పొద్దుటినుంచి మనసేమీ బాగాలేదు. ఏవో పాడు ఆలోచనలు తెగవూ, ముడిపడవూ!

దయాలు : వాన వచ్చేట్లుందే.

ప్రధాను : అయితే పైకివచ్చి కూర్చో, పొగాకు తెస్తాను.

దయాలు : కొంచెం పొగపీలిస్తే మంచిదంటావా? వెళ్ళాలయ్యా. (అని కూర్చుంటాడు)

ప్రధాను: ఏమీ ఎక్కడికైనా వెళ్లాలా? (హుక్కా చేతికిస్తాడు.)

దయాలు : లేమలే కాని.... .. (పొగపీల్చి వదులుతుంటాడు.)

కుంజ : (ముందుకువచ్చి) దయాలుబాబూ! ఒక విషయంలో, పెద్దవాడవు. నీ సలహా కావాలి.

ప్రధాను : ఇంకా ఏ విషయాలుంటయి మనకు,

**దయాలు : అయినా విషయమేమిటో చెప్పు.**

**కుంజ : ఉన్న పొలం మూడు భీగాలూ అమ్ముకోవడమా మానుకోవడమా**

**దయాలు** : సంపాదించడం కష్టంగాని అమ్మేసుకోవడం అతి సులభం,

**కుంజ :** ఇదివరకమ్మిన పుల్లుడుచేను పక్కనే మూడుభీగాల బీడుంది మా అన్నగారికి. అది అమ్మివేద్దామంటున్నాడాయనగారు.

దయాలు : ఆ తర్వాతా ?

కుంజ : అదే నేననేది. పొసటరాపిన కష్టాలూ, దుఃఖాలూ ఎలాగూ తప్పవు. మధ్యనున్న ఈ పొలం కాస్తా అమ్ముకొంటే లేని అదృష్టం ఏమైనా వస్తుందా? అమ్మవద్దు అని నేనంటున్నాను.

దయాలు : ఆమాట నిజమే. బ్రతుకుదెరువు ఏదీ లేనప్పుడు ఉన్న పొలం అమ్ముకొంటేమాత్రం ఎన్నాళ్లు గడుస్తుంది. నేనూ ఆ పొరపాటేచేశాను దూరం ఆలోచించక ........

కుంజ : అవును. అన్నట్లు నీవూ భూమి అమ్మివేశావుగదూ?

దయాలు : అవును. కొంత అమ్మివేశాను. అమ్మడమే అయిందికాని విత్తనాల గింజలకుకూడా మిగల్చలేకపొయ్యాను. నీకే అల్లాగైతే ఎవరి అవస్థ బాగుంటుంది మరి - అంతా పోగొట్టుకొని కూర్చున్నావా?

దయాలు : అంతా. కుంజా! ఉన్నదంతా అయిపోయింది. లేకుంటే మీ దయాలు పిడికెడు బియ్యంకోసం గడపగడపకూ దండాలు పెడతాడా? అయ్యో రామ?

ప్రధాను : చిన్న పొరపాటు క్షమించవచ్చు. కాని పెద్ద పొరపాటుకు మరి పరిహారంలేదు. నీవు ప్రాయశ్చిత్తం అనుభవించవలసిందే. ఈ సంగతి తెలుసుకో.

కుంజ : తెలుసుకోవడము నిజమే. కాని ఆలస్యంగా తెలుసుకొన్నందువల్ల లాభమేమిటి?

దయాలు : (జాలిగా నవ్వి) వెంటనే అడగడానికీ తీసుకోవడానికీ సమయం కానప్పుడు తెలిసివచ్చింది.

ప్రధాను : (దయాలు చేతిలోనుంచి హుక్కా తీసుకొని) అట్లయితే ఏ కొంచెమో పొలం ఉండడము మంచిదంటావు.

దయాలు : ఆమాత్రం జీవనాధారం ఉండడం మంచిదే. ఉండనీ. ఉన్న పొలం కాస్తా అమ్ముకొంటే ఆ తర్వాత.

ప్రధాను ; అమ్ముకోవడం మంచిదికాదు. సరేనయ్యా, కాని రోజులు ఎ గడుస్తయో చెప్పు. బ్రతికి ఉండాలిగదా? ఏదీ తిండికి?

దయాలు : మీ అవస్థా అల్లాగే ఉందా.

ప్రధాను : మరి నువ్వేమనుకొంటున్నావు.

దయాలు : మీక్కూడా ధాన్యం లేదా? అరే–మీకుకూడా........

ప్రధాను : ఉన్నప్పుడున్నది సరే. ఇప్పుడున్నదా!

దయాలు : అసస్థ అంటే ఇల్లాగే ఉంటుంది. నేననుకొన్నదేమంటే ప్రధాను ఇంటికివెళ్లితె ఏమైనా కొంచెము .......

ప్రధాను : ఇప్పుడు చెప్పు పొలం అమ్మడాన్నిగురించి ఏమి చెపుతావో నువ్వు. చూస్తున్నావుకదా పొద్దుటినుంచి కేకలూ కొట్లాటా జరిగి చివరకు తిండి గింజలకోసం ఇంట్లో మిగిలున్న కంచుచెంబూ, ఇత్తడిచెప్పేలా అమ్మి రెండుశేర్ల తిండిగింజలు తెచ్చాడు కుంజ. పదిమందివున్న సంసారంలో ఈ కాసినిబియ్యం ఎవరికిపెట్టడమో ఎట్లా పెట్టడమో నీవే చెప్పు.

కుంజ : మరెక్కడున్నాయి. అవీ అయిపోయాయి.

దయాలు : కుంజా.

కుంజ : పొలం అమ్మడంసంగతి ఏం చెపుతావో ఇప్పుడు చెప్పు! నిన్న పొద్దుటినుంచి రంగమ్మకూ నిన్న మధ్యాన్నంనుంచి ఒకమ్మకూ, నిన్న సాయం కాలమునుంచి మరొకమ్మకు తిండిలేక ప్రాణంపోవడానికి సిద్ధంగాఉంది. ఎక్కడ విన్నా ఇప్పుడు ఈ కబురే (అని ఇంట్లోకివెళ్లి బట్టచెంగులో కాసిని బియ్యంపోసు కొని తెచ్చి) చారెడుకంటే ఎక్కువ ఇవ్వలేకపోయాను దయాలుబాబూ. ఇంట్లో మరోపూటకు ఆధారంగా మాకు మిగిలినవి ఇవే. పట్టు (అని ఒడిలో పోస్తాడు.)

దయాలు : ఈ చారెడుతో ఈపూట కడుపు చల్లబడుతుందిలే మాకు. ఎలాగో ప్రాణాలు నిలిస్తే చాలు.

కుంజ : ఇట్లా ఎన్నాళ్లు సాగుతుంది.

దయాలు : ఊపిరాడుతున్నంతవరకు ఆశ తప్పదు. ఆశ ఉన్నంతవరకూ ఇది ఉండితీరుతుంది.

ప్రధాను : వట్టి ఆశతో కడుపునిండుతుందా దయాల్. దీనికేదో ఏర్పాటు జరగాలి.

దయాలు : ఆ ఏర్పాటు ఏమిటో చెప్పు. నేను అందుకోసం సిద్ధంగా ఉన్నాను.

ప్రధాను : పద. వెళ్లిపోదాం.

దయాలు : ఎక్కడికి?

ప్రధాను : ఏదో ఒక పట్నానికి. అక్కడ గొప్పవాళ్లు అన్నసత్రాలు పెట్టారు.

కుంజ : నీవనే ఆ గొప్పవాళ్ల సంగతి నాకు చెప్పకు.

దయాలు : గొప్పవాళ్లమనిపించుకొనే వాళ్ల సంగతి మరిచెప్పకు. వట్టి మోసం.

కుంజ : ఎవరికోసం దొంగతనంచేశామో వాళ్లే చివరకు నీవు దొంగవు కావా అంటారు.

ప్రధాను : గొప్పవాళ్ళను తిడతాముగాని వాళ్లతప్ప మనకు మరోగతిలేదు. ఏమైనా గొప్పవాళ్ల వాకిట్లోకి మాటిమాటికివెళ్లడం మనకు తప్పదంలేదు. వెళ్ళకుంటే పూట గడవదు.

కుంజ : గొప్పవాళ్ళమనుకొనే వాళ్ళందరూ పెద్దమనుష్యులుకారు. తెల్లటి బట్టలువేసుకొని అది చెయ్యి ఇది చెయ్యి అని మంచిభాషలో చెప్పేవారంతా పెద్ద మనుషులుకారు. అటువంటివాళ్లను గొప్పవారని గౌరవించాలా?

ప్రధాను : అదెట్లా అవుతుంది? కాదు.

దయాలు : పోనిద్దూ, జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మనకు కర్తవ్యం ఏమిటో అదే చెప్పు.

ప్రధాను : నేను చెప్పవలసిందేదో చెప్పనే చెప్పాను.

కుంజ : ఇప్పుడు చెప్పవలసిందేమీలేదు. అందరికీవచ్చే అవస్థే మనకూ వస్తుంది. పదిమందితోపాటు మనమూ వీధిలో నిలబడవలసివస్తుంది.

ప్రధాను : చివరకు మనం పడుతున్న భయసందేహాలే నిజం అవుతాయి.

దయాలు : మరి కావడానికి ఏమీలేదు. మనకున్నదారి ఒక్కటే. ఆ దారినే అందరమూ వెళ్ళాలి.

ప్రధాను : అందుకే పట్నానికి వెళదామర్రా అని చెప్పుతున్నాను నేను.

కుంజ: నగరానికను, నరకానికనూ ఉన్నదారి ఒక్కటే. ఇంటిల్లిపాదీ చేయిచాచి వీధివీధినీ బిచ్చమెత్తుకుంటూ బ్రతకడమే మనకున్నదారి.

ప్రధాను: వీధుల్లో బిచ్చమెత్తుకోవలసివస్తుందో? ఈ ప్రధాన సముద్దారుకు వీధెక్కి బిచ్చమెత్తుకోవలసొస్తుందా? దయాల్.

దయాలు: రాసిపెట్టుంటే ఎవరికైనా తప్పదు. చివరికు అదే చూడవలసొస్తుందేమో. మన ఖర్మం! అంతా దైవేచ్ఛ.

ప్రధాను: చేసుకొన్న ఖర్మకాకపోతే పొలం కాస్తా అమ్ముకోవలసి ఎందుకొస్తుంది నేనూ! ఇప్పుడు వీధినిబడి ముష్టెత్తుకోవలసిరావడం ఏమిటి? ఇదంతా ఖర్మగాకపోతే మరేమిటి చెప్పు దయాలుబాబూ!

కుంజ: ఉత్తినే అదృష్టాన్ని నిందించకు. కోరి నిప్పులో చేయిపెట్టి అది కాలిందంటే ఆ కష్టానికి కారణం అదృష్టం అంటావా? ఈ మాటలు నాకు అర్థం కావు. నేను నమ్మనూ నమ్మను. మీరందరూ.......

మాఖన్: (తుఫానులాగు పరుగెత్తుకొచ్చి) మీరందరూ ఇంటికప్పుమీదికెక్కండి. వెంటనే ఎక్కండి, ఏడెనిమిదడుగుల యెత్తున ఉప్పెనవస్తున్నది. ఘోరమైన వరద. హూస్సు అదిగో హోరు వినిపించడంలేదా. మునిగిపోతారు. ఎక్కండి కప్పుమీదికి.

[మాఖన్ ఇంట్లోకి వెళ్ళిపోతాడు. తెరలో ప్రవాహం హోరు.]

కుంజ: అయ్యో! అయ్యో! అట్లాగైతే.

దయాలు: అయితే నేవెళ్తాను ప్రధాన్! పొద్దుటినుంచి ఈరోజు ఘోరంగా ఉంది. అర్ధరాత్రినుంచి వేడిగాలి వేస్తున్నది. అంతా గందరగోళం! గందరగోళం! (పెద్దగాలి దెబ్బహోరు)

కుంజ: కొంచెంసేపుతాళి వెళ్ళు! పెద్ద గాలివానదెబ్బ చూస్తున్నావా? ఒక్కమాటే కొంప ములిగేట్టుంది. (నేపథ్యంలో ఏదో పెద్దచెట్టు విరిగిపడ్డ చప్పుడు. ప్రధాను గుమ్మంలోనుంచి బయటికి కళ్ళకు చేయడ్డంపెట్టుకొని దూరంగా వరదను చూస్తుంటాడు. గాలికి అతని తలమీదిజుట్టు ఎగురుతూఉంటుంది. ఆకులూ, చిగుళ్లూ,

కొమ్మలూ, రెమ్మలూ గాలికి ఎగిరివచ్చి పడుతుంటాయి. రెండు వరాండాలూ కదిలి పోతుంటాయి. ఏ క్షణంలోనైనా అవి కూలిపడిపోవచ్చుననిపిస్తుంది. వానా, నదీ ప్రవాహం ఎడతెగకుండా హోరున పొంగిపొర్లి వస్తుంటాయి. కొంచెంసేపటికి మసకవెలుగు, చీకటిపడినట్లవుతుంది. ఏడ్పులూ, పెడబొబ్బలూ భయంతో వేసే గావుకేకలూ వినవస్తుంటాయి. కప్పడిపోయి పైకిరాలేక పెద్దగా మూలుగుతుంటారు. దూరంనుంచి పల్లెమీదుగా పెద్ద తుఫానుగాలి విసురవచ్చి ప్రధాను ఇంటిమీద పడు తుంది. గభాలున చూస్తుండగానే ఇంటి వరండాలు రెండూ పెద్ద చప్పుడుచేస్తూ విరిగిపడిపోతాయి. కప్పుకింద చిక్కుకొన్న ప్రధాను కేకలు వేస్తాడు.)

ప్రధాను: (ముఖంమీద పడుతున్న వాననీళ్లు తుడుచుకొంటూ) కుంజా! ఒరే మాఖన్! ఒరే కుంజా! ఇదిగో ఇదిగో! ఇక్కడ! ఈ వైపు!

మాఖన్: (ఆత్రంగా పరుగెత్తివచ్చి) తాతా! తాతా! ఇదుగో ఇక్కడున్నాను నాన్నా! నాన్నా! ఎక్కడున్నావు నువ్వు!

రాధి: (పరుగెత్తివచ్చి) మాఖన్! ఒరే మాఖన్! ఎక్కడున్నారా తండ్రీ!

మాఖన్: అమ్మా! అమ్మా! ఇదుగో ఇక్కడున్నా నేను.

రాధి: (పరుగునవచ్చి మాఖన్ను సందిటపట్టుకొని) బ్రతికామురా నాయనా నా తండ్రీ! నా నాయనే!

మాఖన్: ఏడీ! ఎక్కడున్నాడు మా నాయన!

ప్రధాను: ఒరే కుంజా! కుంజా! మాఖన్! ఒరే మాఖన్! ఏడిరా మీ నాయన ఎక్కడున్నాడురా!

కుంజ: ఇదుగో ఇక్కడున్నాను.

మాఖన్: అదుగో తాతయ్యా! పంచకప్పుకింద పడిపోయి బయటికి రాలేక పోతున్నాడు మా నాన్న. చూరు ఎత్తిపట్టుకో త్వరగా త్వరగా వసారా కప్పు పైకి ఎత్తిపట్టుకో.

(ప్రధాను రాధిక పరుగెత్తిపోయి వసారాకప్పు పైకెత్తుతారు.)
కుంజ బయటికి వస్తాడు.)

రాధిక: (ఆత్రంగా ఒళ్లు చూస్తూ) దెబ్బేమీ తగల్లేదు గదా ఎక్కడా?

కుంజ : లేదులే-కాని మాఖన్ ఏడి ? ఓహో ఇక్కడున్నాడా ! సరేలే___

ప్రధాను : అయితే అంతా బతికున్నట్లేనా ?

రాధి : ఏదీ మన వినూ ఎక్కడ ఉంది ?

కుంజ : అయ్యో ! ఏమయింది చూడండి త్వరగా. పంచమూరు కింద పడిందేమో త్వరగా చూడండి.

మాఖన్ : బాబా! బాబా! అదుగో అక్కడ పడిఉంది. (వినోదిని తెలివితప్పి పడి ఉంటుంది. అందరూ ఆమెవైపు పరుగెత్తుతారు.)

రాధి : (వినోదిని ముఖంమీద ముఖంపెట్టి) అమ్మయ్యో! వినో! ఓ వినో! మాటలేదు. బయటికి తీసుకపోదాం.

[కుంజా, మాఖన్, రాధిక, వినోదిని లేవనెత్తి తీసుకొచ్చి బయట ఇంటి ముందు పడుకోబెడతారు.]

కుంజ : (కంటికింది రెప్పలాగి చూసి) బాగా గట్టిదెబ్బ తగిలినట్లుంది పాపం.

రాధి : అక్కా వినో! చూడు నాకేసి చూడు! (వినోదిని నీరసంగా మూలుగుతుంది.)

ప్రధాను : ఒరే కుంజా! బ్రతికున్నట్లేనా మీ మరదలు?

కుంజ : ఆ! అవును. ఊపిరుంది. కాని గట్టిదెబ్బ తగిలినట్లుంది?

రాధి : (వినోదిని తల నిమురుతూ) అమ్మయ్యో! ఎంతగండం తప్పింది వినూ! ఓ వినూ! ఎక్కడ దెబ్బతగిలిందక్కా? బాధగా ఉందా?

కుంజ : ఉస్సు! ఉండు. లేపబోకు. అట్లాగే పడుకోనియ్యి.

[తెరలో ఏడ్పులూ కేకలూ]

ప్రధాను : ఉండడానికి ఒక్క నట్టిల్లుమాత్రమే మిగిలింది. కొంప కూలిపోయింది. ఒరే కుంజా! నీమాటే నిజమయిందిరా? ఇక వీధిలో నిలబడవలసిందే.

అనుకొన్నంతపనీ ఆలస్యంలేకుండానే దాపరించింది. ఒరే కుంజా నీవన్నంతపని జరిగిందిరా! ప్రధాన సముద్దారు ఇక రోడ్డుమీదే గడపాలి. అయ్యో కర్మ!!

దయాలు: (కుంజా అని పిలుస్తూ ప్రవేశించి) ఇదిగో నీవిచ్చిన కాపివి బియ్యం నాకిప్పుడెందుకని ?

కుంజ: దయాలు అన్నయ్యా! దయాలు అన్నయ్యా! ఏమయింది నీకూ.

దయాలు: ఏమయిందా? సర్వం నాశనం అయింది. ఇంతవరకూ నాకూ ఏదో ఉండేది. నావాళ్ళంటూ ఉండేవారు. ఇప్పుడేముంది? ఎవరున్నారు? అందరూ పోయారు. ఏమీ మిగలలేదు. అందరూ పోయారు. ఇదిగో నీవిచ్చిన బియ్యం. నాకెందుకు ఇప్పుడివి? మీకైనా ఉంటాయి. తెచ్చాను తీసుకో.

కుంజ: రాంగామాయికోసమా నీవు.... ...

దయాలు: ఇంకెక్కడి రాంగామాయి నా రాంగా ఎక్కడికిపోయింది? ఏమైపోయింది? నా ఇల్లు—అయ్యో నా ఇల్లు పోయింది. కుంజా అంతా పోయింది.

ప్రధాను: దయాల్! నా దయాల్! అనుకొన్నంతా జరిగిపోయింది. అయ్యో రాతా ?

దయాలు: ప్రధాన్! ఏముందిక! నాలుగువైపులా సముద్రం. ఒకటే సముద్రం. ఊరంతా సముద్రం అయిపోయింది. నీళ్లు! ఎక్కడచూపినా నీళ్ల— నా రాంగామాయ్. నా రాంగామాయ్. అయ్యో! నా రాంగా, నా ప్రాణం (హోరు హోరుమని తుఫాను చప్పుడు.)

[తెర వాలుతుంది.]

# ప్రథమాంకం — నాలుగో రంగం

[పడిపోయిన ఇంటి ఆవరణము. వరాండాలు రెండూ పడిపోయినాయి. ఏ చోటా పాటిన రాటలు లేవు. అంతటా విరిగిన వెదురు ముక్కలు పడి ఉంటాయి ఇంటిల్లిపాది మొగాల్లో కొట్టవచ్చినట్లు దరిద్రం కనబడుతుంటుంది. ముంగిట్లో పొయ్యిప్రక్క కూర్చొని వినోదిని ఏదో వండు తున్నది. పొయ్యి మీది కుండకు మంట తగులుతూ ఉంటుంది. గడప మీద జబ్బు మనిషి మోహన్ కూర్చొనుంటాడు ]

వినోది: (పొయ్యి ఊమాది కళ్లూ మొగమూ పొగగొట్టి మండడమువల్ల కళ్లు నులుముకుంటూ వెనక్కు తిరిగి కూర్చొని) అబ్బా! ఈ పచ్చాకులు మండుతయా చస్తాయా! పొగపీల్చలేక ప్రాణం పోతున్నది. ఊఁహూ! మరి కూర్చోలేను

మోహన్: అయితే పొయ్యి దగ్గర కూర్చొని పొగతో చావడ మెందుకు? ఎందుకొమ్మ ఒకటి అంటించి గడపలోకి వచ్చి కూర్చోరాదు. ఇప్పటికి ఆ గొప్ప ఆత్తికూర వండడమయింది. అది గొడ్లు కూడా తినవు. ఎండుకొమ్మ ఏరిస్తాను ఉండు. నా వంట కావాలి కదా?

వినోది: తేరామూ? ఊరికే కూర్చొని వట్టిపోచికోలు కబుర్లు వాగకు. ఈ వంటకు విలువిచ్చేదెవరు?

మోహన్: నిత్యమూ ఆత్తికూర వండుతావు. ఆ కూరా ఈ ఆకూ వేపి కలగాపులగంచారు పల్చగా కాస్తావు. ఇవాళ ఇవేవీ తినను నేను.

వినోది: తినకుంటే నాశ్రమే తగ్గుతుంది. తెచ్చేటప్పుడు మంచీ చెడ్డా కనిపెట్టి కూరలు తేవాలి.

[బురదంటిన చింకి పంచెతో ప్రధాను చిన్న పీతలపోగు ఒళ్ళో వేసుకొని ప్రవేశిస్తాడు ]

ప్రధాను: మంచీ చెద్దలు చూపి కూరలు తేవడం అంత తేలిక కాదు. (ఒడిలోని పీతలు కదిలించి) ఇవి అంత మంచివి కావనుకో! కాని ఈ కాపిని పీతలూ ఎంతో ఎరుగుదువా? అయినా ఇవి మాత్రం దొరికి వస్తున్నాయా? (వెళ్ళబోతున్న వినోదినితో) ఏకూరైనా తయారు చెయ్యడంలో ఉంది. సరే కాని ఇవి తొందరగా తీసుకో. ఒళ్ళంతా జలదరిస్తున్నది. బురదంతా కడుక్కోవాలి.

[వినోదిని వెళ్ళిపోతుంది.]

మాఖన్: చాలా ఉన్నాయి. ఎక్కడ తెచ్చావు తాతయ్యా? క్రితం సారితెచ్చిన వన్నీ చిన్న చిన్నవి. ఈ మాటు తెచ్చినవి పెద్దవి. ఎక్కడ పట్టుకొన్నావు వీటిని?

ప్రధాను: అన్నీ పెద్దవై పోతున్నాయి. నీళ్ళల్లో కూడా ఇవి ఎక్కువ దొరకడం లేదు. ఇప్పుడు అన్నీ కాల్వపక్క పల్లంలోకి పోయి బొరియలు చేసు కొంటున్నాయి. నా ఒళ్లూ బట్టలూ చూడు వీటికోసం ఎంత కష్టపడ్డానో.

[చింకి బుట్టతో వినోదిని వస్తుంది.]

ప్రధాను: తెచ్చినవి జాగ్రత్తచెయ్యి (నవ్వుతూ) బాగా ముక్కలుచేసి ఉప్పూ కారమూ వేసి వేయించు. ఇదుగో కోడలా మాఖన్‌కు రెండో మూడో ఇవ్వాలి సుమా!

కుంజ: మాఖనుకు పెట్టడమేమిటీ? వాడికి తినడానికి ఏమీ ఇవ్వద్దు. జితేనుబాబు ఏమీ పెట్టవద్దని మరీ మరీ చెప్పెళ్లాడు.

మాఖన్: అయితే తిననుగాని ఎట్లా ఉంటుందో కొంచెం రుచిచూస్తా నంతే ఒకసారి!

కుంజ: నీవేమీ రుచిచూడవద్దులే. ఎంచక్కాగా బెల్లం నంజుకుంటూ అటుకులు తిను. వాటి పేరు తెలుసా నీకు?

మాఖన్: ఎండ్రకాయ.

కుంజ: తెలుసును గదా నీకు? అది తింటావా? ఇదిగో అందరికీ చెప్తు తున్నాను. ఎండ్రకాయ దెండ్రకాయ ఏమీ వాడికి పెట్టవద్దు. జాగ్రత్త.

ప్రధాను : ఎవరిని శాపిస్తావో చెప్పు నీవు? అరే, ఎప్పుడూ చిరచిర లాడుతూ కనపడతావేమిటి?

కుంజ : (బాధతో దుఃఖంతో) చిరచిర లాడుతున్నానా? ఎంత త్వరగా గ్రహించావు నా మనస్సు? పగలంతా మండిపొయ్యే ఎండలో ఊరంతా సందులూ గొందులూ తిరిగి తిరిగి ఎట్లాగో వెదికి ఇన్నిపాత బియ్యం సంపాదించుకొచ్చానుని మహాప్రేమ ఉన్నట్టు ఇప్పుడు నీవు ఈ పీతలు తెచ్చావు. వీటిని చూపి అవే తింటాన. వాడు మారాము చేస్తున్నాడు. కన్న బిడ్డల స్నేహం నీకేమో నాశనమయింది. వాడు నాకొక్కడే కొడుకు. జబ్బుగా ఉన్నాడు. అపథ్యం వల్ల వాడు గుటుక్కు-మంటే ఆపద ఎవరికి? (అంగవస్త్రంలో కట్టి తెచ్చిన బియ్యం పారబోసి) ఈ బియ్యం అవసరం లేదులే. పోనీ ఏం జరిగితే అది జరుగుతుంది.

రాధిక : ఇంత కష్టపడి తేవడమెందుకూ, తెచ్చినవి కింద వెదజల్లడ మెందుకు? పడ్డ శ్రమకిచ్చే విలువ ఇదేనా?

కుంజ : మొదటి నుంచి నా కష్టానికి ఈ యింట్లో ఇంతే విలువ, ఇంతకన్నా ఎక్కువ ఏనాడూ లేదు.

రాధిక : (జాలిగా చూస్తూ ఉంటుంది.)

ప్రధాను : (లేచివెళ్ళి) చూశావా వీడి తొందరపాటు! వింటున్నావా ఆ మాటలు! (అవి చేత్తో పోగుచేస్తూ) రోజంతా శ్రమపడి ఏరి కోరి ఇక్కడా అక్కడా ఈ కాపివి పాతబియ్యం పోగుచేసి తీసుకొచ్చాడుకదా. ఎవ్వరూ ఏమీ అనకుండానే ఎట్లా వెదజల్లి పాడుచేశాడో చూడు!

కుంజ : కష్టమేమో పడక తప్పదు నాకు! అందుకు విచారపడవలసిన అవసరం ఎవరికీ లేదు.

ప్రధాను : (బియ్యం పోగుచేసి) అట్లా నీవనుకొంటే మరి నాకు దుఃఖ మెందుకు?

కుంజ : ఆగు. మరి నీవు దొంగేడుపు ఏడవకు. నీ మోసమంతా నాకు తెలుసు.

ప్రధాను: (క్షణం రెప్పవెయ్యకుండా చూసి) ఏమిటీ? ఏమంటున్నావు? నాది మోసమా? దొంగ ఏడుపానాది? ఒరే కుంజా! నేను చూపే సానుభూతి అంతా అబద్ధమేనా? నన్ను అవమానంచేస్తావురా నువ్వు! మీరే నాకు కొడుకులనుకొన్నానురా! అవమానం చేస్తావురా?

కుంజ: నాకు ఒళ్ళు మండిపోతున్నది! మహామంట! నీకేమి అవమానం చేశానిప్పుడు!

ప్రధాను: అవమానంకాదా? ఇంతకంటే ఏమవమానం చెయ్యాలని ఉంది నీకు? నీకోసం నేను పడే దుఃఖమూ, చూపే సానుభూతీ, అంతా అబద్ధమేనా? అంతా మోసమేనా? ఇంతకంటే నీకు నా నెత్తిమీద కర్రతో (అని అక్కడి కర్ర గబాల్నతీసి తన తలపై కొట్టుకొంటాడు. రాధిక, మాఖన్ అమ్మో అమ్మో అని అరుస్తారు.)

కుంజ: (గబగబ పరుగెత్తి చేతిలోని కర్ర పట్టుకొని) ఏమిటిది పెద్దనాన్నా? ఏమిటిది? ఛీ ఛీ ఏంపని ఇది. అయ్యో రామా?

ప్రధాను: (బాధపడుతూ) ఒరే నన్నొక్కసారిగా చంపెయ్యరా? నా బాధ, నీ గుండెలో మంటా అంతా తీరిపోతుంది. ఒకేసారి నా యాతనా - నా దుఃఖం అన్నీ... (అని మొర పెడతాడు.)

కుంజ: (కర్ర లాగిపారేసి) ఛీ ఛీ ఛీ! బుర్ర వేడెక్కిపోయి నేనేదో అన్నానే అనుకో! దానికింత గందరగోళమా? పెద్దనాన్నా, రోజురోజూ మరీ కుర్రాడవై పోతున్నావు. మాటవరసకు నేను కుర్రకుంక జబ్బుతో బాధపడుతున్నాడు. అదీ గాక వాడికి పీతలూ గీతలూ ఏమీ పెట్టవద్దని డాక్టరుకూడా చెప్పాడు అని అన్నాను. ఈ మాత్రానికి నీవు బాధపడి మమ్మల్ని బాధపెట్టి ఇంత అఘాయిత్యానికి దిగవద్దా చెప్పు, ఛీ ఛీ మరీ కుర్రతనంగా కేమిటిది?

ప్రధాను: జబ్బా? వాడికి జబ్బేమిరా?

కుంజ: అట్లా అంటావేమిటి పెద్దనాన్నా. వాడికేసి చూడు ఒకసారి. కాళ్ళూ చేతులూ వాస్తున్నాయి. కళ్లు పచ్చబడ్డాయి. చిక్కి పుడకై పొయ్యాడు ఈ లక్షణాలుచూస్తే జబ్బుగాక మరేమిటి? చాలా జబ్బుగాఉన్నాడనే డాక్టరుకూడా చెప్పాడు.

ప్రధాను : తెలిసింది. అంతా తెలిసిందిరా కుంజా? తినడంవల్ల జబ్బా తిండి లేక జబ్బా అని నీవు డాక్టరును అడిగావా?

రాధి : ఇప్పటికి నెలరోజులనుంచి వాడేమీ తినడమేలేదు.

కుంజ ; జబ్బుగా ఉన్న మనిషి తింటాడా ఏమిటి మరి!

ప్రధాను : జబ్బా! జబ్బా! ఒరే కుంజా నేనేమీ పొరపాటుపడడంలేదు సరైన తిండిలేక కుర్రకుంక రోజుకు రోజుకూ చిక్కిపోతున్నాడు.

కుంజ : కాదు పెద్దనాన్నా? జబ్బేకాని మరొకటికాదు వాడికి. డాక్టరు చెప్పా డన్నా నీవు నమ్మకపోతే ఎట్లా? నీకు తెలియదు పెద్దనాన్నా?

మాఖన్ : చాలా ఆకలిగా ఉంది ఏదైనా పెట్టండి నాకు. తినాలని ఉంది. నాకు పెట్టండి.

ప్రధాను : నాది ఏమాత్రమూ పొరపాటుకాదు. నన్నెవరూ మోసం చెయలే లేరు తిండిలేకనే కుర్రాడు.........

కుంజ : నీవు పొరపాటుపడుతున్నావు పెద్దనాన్నా? చాలా గడ్డు జబ్బనికూడా డాక్టరన్నాడు. వాణ్ణి చూస్తూంటే తెలియదంటేదా పెద్దనాన్నా?

ప్రధాను : డాక్టరు ఏమిచెప్పినాసరే, నేను నమ్మను. డబ్బు గుంజడానికి అట్లాగే చెపుతారు డాక్టర్లు. నేను నమ్మను. వాడికేజబ్బా లేదు. నాది పొరపాటు కాదు.

కుంజ : వాడు జబ్బుతో తీసుకొంటున్నాడు పెద్దనాన్నా! తిండిలేక కాదు.

మాఖన్ : నాకు బలే ఆకలిగా ఉంది. ఏదైనాసరే తినేస్తాను. పెట్టిచూడండి.

ప్రధాను : నేను పొరపాటు పడడంలేదు. సరైన తిండిలేకనే కుర్రాడు చిక్కి నగమైపోయాడు. చివరకు ఆకలితోనే చచ్చిపోవచ్చుకూడా. నాది తప్పుతోవ కాదు. అంతా కర్మం!

[తెర వాలుతుంది.]

# ప్రథమాంకం - అయిదోరంగం

[వెనకటిదే ఆవరణం. దేశమంతా మహమ్మారీ రోగంతో అట్టుడికినట్లుడికి పోతున్నది. తెరవెనక శవాన్ని మోసుకపొయ్యేటప్పుడు వేసే "గోవిందో గోవింద" అనే కేకలూ అయ్యో అయ్యో అనే గావుకేకలూ ఎడతెగకుండా వినవస్తుంటాయి. జబ్బుగా ఉన్న రాధికకూడా ముడివిడిన కబురు జుట్టుతో జబ్బుగా పడిఉన్న మాఖన్ తల వైపున కూర్చొని ఉంటుంది. ముంగిలి చీపురుతో ఊడుస్తుంటుంది వినోదిని.]

వినోదిని : (చేత్తో చీపురుతోనే రాధికకేసి చూస్తూ) ఈ ఏడ్పులకూ పెడబొబ్బలకూ అంతూపొంతూ లేకుండా ఉంది. రాత్రింబగళ్ళు వినలేక చెవులు గళ్లు పడుతున్నాయి. అబ్బా! ఏం చావులో ఏం లోకమో.

రాధి : ఏం చెప్పం! ఏమీ మిగలకుండా ఊరంతా వల్లకాడైపోయింది. ఉత్తరవీధి పేరులేకుండా పోయింది. ఒకేసారి సర్వనాశం. గొంతులో కాసిని నీళ్లు పోసే దిక్కు కూడాలేని దురవస్థ వచ్చిపడ్డది. దేశానికేదో మూడింది. ఇటువంటి మహా కరువూ ఇన్ని చావులూ మనమెప్పుడూ కనీవినీ ఎరుగం

వినోది : ఇట్లాంటి మహాకరువు ఇదివరకెప్పుడూ మనమెరుగం. మా అమ్మ ఏంచెప్పిందో తెలుసా అక్కా? ఇంత కరువు ఎప్పుడూ తాను చూడలేదట! వాళ్ళమ్మకూడా ఏనాడూ ఇంత కరువు తాను చూడలేదు, వినాలేదు అన్నాదట. ఈ ఘోరం ఏమిటంటావక్కా ?

రాధిక : ఘోరమేమిటి! ఘోరాతిఘోరం. కాదు చెల్లీ! ఆయన ఎక్కడున్నాడో ఏమైపోయాడో అయ్యో కర్మమా ?

వినో : ఇది ఇంతకంటే భయంకరం చెల్లీ ?

[తెరలో హారూదత్తు గొంతు 'ఇదేనా ప్రధాను ఇల్లు' అని వినబడుతుంది. వినోదిని ఊడుస్తూంటుంది. రాధిక మెడ వెనక్కుతిప్పి చూస్తుంది.]

హారూదత్తు: (ప్రవేశించి) ఇదుగో ప్రధాను ఇంట్లో ఉన్నాడా?

[హారూదత్తును చూసి వినోదిని ముసుగు ముఖంమీదికి లాక్కొని వెనక్కు తిరిగి విల్చుంటుంది. రాధిక నిర్లక్ష్యంగా మొఖంమీది ముసుగెత్తి]

రాధి: ఇంట్లో మొగవాళ్ళెవరూ లేరు.

హారూ: ఓహో! నీవు మాఖన్ తల్లివికాదూ? ప్రధాను నన్ను రమ్మని చెప్పేడులే.

రాధి: (మెల్లిగాలేచి ఒక గోనెసంచి వరాండా అరుగుమీద పరిచి) మీరు వస్తే కూర్చోపెట్టమని చెప్పాడు.

హారూ: కూర్చోమని చెప్పాడా?

రాధి: పనిఉంది, వెళ్ళాలి. మళ్ళీ ఇప్పుడే వస్తాను అని చెప్పి వెళ్ళాడు.

హారూ: తొందరగా వస్తాడా? ఆలస్యమవుతుందా?

రాధి: ఏం పని కోసం వెళ్ళాడో! ఇప్పుడే వస్తాననిమాత్రం చెప్పాడు.

హారూ: నన్ను రమ్మనిచెప్పి తానెక్కడికో వెళ్ళాడు! (కూర్చొని) సరేకాని ఆ పడుకున్న దెవరు?

రాధి: మా అబ్బాయి మాఖన్! చాలారోజులనుంచి జబ్బుగాఉంది వాడికి— ఊ అనడు. ఆ అనడు. కాళ్లూ మొఖమూ నీరుపోసినయి, దేవుడిదయ ఎట్లా ఉంటుందో ఏమో?

హారూ: నీవుకూడా జబ్బుగా ఉన్నట్టు కనబడుతున్నావే! చాలా చిక్కిపోయావు, అవునా?

రాధి: ఇప్పటికి కొన్నాళ్ళనుంచి జ్వరం కాస్తున్నది. పాడు జ్వరం ఎప్పటికీ తగ్గడంలేదు.

హారూ: ఏదైనా మందూ మాకూ తింటున్నావా?

రాధి: మాకు మందెక్కణ్ణుంచి వస్తుంది. ఏదో మాములు పథ్యం మటుకు చేస్తున్నాను.

హారూ : వేపబెరడు నీకు తెలుసుగదూ! ఔషధమంటూ నేనేదీ చెప్పడం లేదు. ఆ వేపబెరడు తెచ్చి నీళ్ళతో శుభ్రంగా కడిగి చిన్న దాకలోవేసి–కాదులే– నీవు తయారుచేసుకోలేవు. తయారుచేసే విధాలు చాలా ఉన్నాయి. తయారుచేసింది ఉంది. సీసా యిచ్చి ఎవరినైనా పంపిస్తే ........

రాధిక : ఉలక్క పలక్క వెనక్కు తిరిగి నిలుచొనే ఉన్నావేమిటి? బాబుగారి దగ్గర నీ కింత సిగ్గేమిటిరా వచ్చి కూర్చో?

హారూ : ఎవరామె? నిరంజను భార్యకదూ? ఎవరో కొత్తామె అనుకొన్నాను! చూడు ఆమె వాలకం. సరేలే మాఖన్ తల్లీ! దారిలోనూ, రేవుదగ్గరా, మీయింటికీ, మాయింటికీ వస్తూ పోతూ ఉన్నప్పుడు రోజుకు పదిమార్లైనా మీతోటి కోడలిని చూస్తుంటాను. అయినా ఎంతసిగ్గో ఆమెకు? సిగ్గుండడం ఆడదానికి ఆభరణం. ఎంతైనా ఆడదికదా?

రాధి : (వినోదినికేసి) ఆమె లక్షణమే అటువంటిది. అయినా మిమ్మల్ని చూడలేదు. (వినోదినికేసి మూతితిప్పి దత్తుకేసి ముఖం చిట్లించి వినోదిని మంచి మాటకారి అని సూచించి) వెదురుగడ్డలాగు నిలబడే ఉన్నావేమిటి అక్కా! వచ్చి కూర్చో! బాబుగారు నీకు తండ్రిలాంటివాడు. (ఎర్రబడిన కళ్ళతో చుర చుర అటూ ఇటూ క్షణం చూసి వినోదిని వెళ్ళిపోతుంది.)

రాధిక : (దత్తుతో) వినోదినిని గూర్చి వ్యంగ్యంగా చూశారా మరి!

హారూ : హేహే! చిన్నపిల్లకదూ! పోనీగానీ సీసా యిచ్చి ఎవరినైనా పంపుతావుకదూ? ఇన్నాళ్లు జ్వరం వదలకుండా ఉండడం మంచిది కాదు. కాలం బాగాలేదు. బొత్తిగా పాడయింది. అందరూ ఇట్లానే బాధపడుతున్నారు.

రాధి : భయంవల్ల కాళ్ళూ చేతులూ కదుపుకాదించుకొని ఉంటున్నారు జనం!

[ ప్రధాను ప్రవేశిస్తాడు. ]

హారూ : అడుగో ప్రధాను వచ్చాడు.

ప్రధాను : (కొంచెం విప్వెరపడి) ఏదో కొంచెం ఆలస్యమయింది. మీరు వచ్చి ఎంతసేపయింది?

హారూ : చాలాసేపయింది. నీ కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

ప్రధాను : గద్దురోజు లివి! ఏదీ అనుకొన్నట్లు జరగదు ... ...

హారూ : సరేలే! మన విషయం ఏంచేశావు? నిశ్చయం అయినట్లేనా? అమ్ముతావా లేదా ఆమాట చెప్పు! బలవంతంపెట్టి నీ పొలం కొనుక్కోవా లని నాకు లేదు. తెలిసిందా!

ప్రధాను : నిశ్చయం అయిందని ఎట్లా చెప్పగలను?

హారూ : అదేమిటీ మళ్లా సందిగ్ధంలో పెట్టావు.

ప్రధాను : అయితే కొంచెంసేపు కూర్చోండి. మా కుంజ వస్తాడు. రానీయండి ... ... ...

హారూ : నా కర్థంకావడంలేదు. కుంజ రావడ మెందుకు?

ప్రధాను : ఇప్పుడే చెప్పివెళ్లాడు వస్తానని.

హారూ : ఇప్పుడు కుంజ అవసర మేముంది. ఇంతకుముందు అతగాడితో ఈ సంగతి చెప్పావా నీవు? సలహా అడిగావా?

ప్రధాను : చెప్పడంలో విశేషమేమీ లేదు. పొలం అమ్మదలచుకున్నప్పుడు వారితో చెప్పొద్దా మరి? వాడొప్పుకోకుంటే పని జరగదమెట్లా?

హారూ : ఇదిగో ప్రధాన్! వాడి ప్రమేయం నాకేమీలేదు. అది నువ్వూ వాడూ చూసుకోవలసిందే. అయితే వాడేమన్నాడు నీతో

ప్రధాను : అన్నాడనుకోండి.

హారూ : ఏమన్నాడో చెప్పరాదూ! మనసులో గుద్దులాటెందుకు?

ప్రధాను : ఈ తక్కువ ధరకు పొలం అమ్మవలసిన అవసరమేమీలేదు అని అడ్డుపెట్టాడు.

హారూ : అడ్డుపెట్టాడా! మరి నీవేమన్నా వందుకు?

ప్రధాను : ఏమంటాను? ఇప్పటి పరిస్థితులు ఎరుగున్నావా? అన్నాను.

హారూ : చూడు ప్రధాన్! ఒకమాట చెపుతాను. నీతో వ్యవహారం కొత్తగా ఇప్పుడే చేయడంలేదు నేను. నా సంగతి నీవూ ఎరుగుదువు. అప్పుడు పుల్లుడుచేను నాకు అమ్మావుకదా! అటువంటి బీడు భూమికి అందరూ ఏ ధర పెడుతున్నారో నేను ఏ ధర నీ కిచ్చానో ఆలోచించి చూడు. నిజం చెప్పాలంటే ఆ బీడు కొనడం ఒకవిధంగా నాకు నష్టమే. ఇప్పటివరకూ ఆ భూమిమీద ఒక్క దమ్మిడీ నాకు రాలేదు. నాగలికట్టి దున్నడానికి శక్యంగాక ఇప్పటికీ అది బీడుగానే ఉంది. పైగా దానికీ దీనికీ నాకెంతో డబ్బు ఖర్చయింది. ఇంకా నన్నెంత నష్టపెడతావో చెప్పు. ఆ సంగతి అట్లాఉంచు. నీకు ఎన్నివిధాల సాయంచేశానో నీవే ఆలోచించుకో. బియ్యం ఇచ్చాను. బట్టలిచ్చాను. లేదంటే పులగం వండిపెట్టించాను. నిజానికి పెద్దలదృష్టిలో మట్టికి బదులుగా రూపాయలివ్వడంకూడా ఒకవిధంగా సాయం చేయడమే. ఇప్పుడు మట్టికి ఏం విలువుందో నీవే చెప్పు. ముఖ్యంగా గొత్తె నీది ఇప్పుడు తలవైపు నరుకుతావో, తోకవైపు నరుకుతావో నీ యిష్టం. ఈ ధరకంటె పైసాగాని, అరపైసాగాని నేను ఎక్కువ ఇవ్వలేను. కానిమాట చెప్పడమెందుకు? నువ్వే అన్నీ ఆలోచించుకో.

[ నెత్తిన గడ్డిమోపు పెట్టుకొని కుంజ వస్తాడు. ]

హారూ : అదుగో, కుంజకూడా వచ్చాడు! ఈ గడ్డి ఎక్కణ్ణుంచి కోసుకొచ్చాడో? కుంజా! ఎక్కడ కోసుకొచ్చావు గడ్డి?

కుంజ : పదిచోట్ల తిరిగి తిరిగి ... ... ....

హారూ : ఛా. ఇది పుల్లుడుచేలో గడ్డి. అబద్ధమెందుకు? సరేలే. చేసిందేమో చేశావు, ఇంకెప్పుడూ చెయ్యకు. ఇప్పుడు గడ్డిమోపు ఖరీదెంతో తెలుసా?

కుంజ : ఏదో రెండు సందెళ్ళ గడ్డి!

హారూ : రెండుసందెళ్ళ గడ్డి ఇప్పుడు అర్ధరూపాయకు తక్కువ ఉండదు. ఇంకెప్పుడూ ఆచేలో కాలుపెట్టకు. సరే ప్రధాన్! మనం అనుకొన్న సంగతి అదే పొలం మాట! క్రయదస్తావేజు ఎప్పుడు రాస్తావు? రేపు నీకు వీలుంటుందా?

కుంజ: క్రయ దస్తావేజేమిటి? ఆ పొలం అమ్మం.

హారూ: చూడు. చూడు. ఏమంటున్నాడో! పిచ్చివాడా! ఆ గడ్డిమోపు నీ కెందుకు ఉచితంగా వదిలిపెట్టాను. బీడులో గడ్డిగాక ఏం మొలుస్తుంది. ఊరికే అన్నానుగాని గడ్డికోసుకో. ఎన్నడూ అడ్డుపెట్టను.

కుంజ: మీరేమన్నాసరే, పొలం ఇప్పుడమ్మవలసిన పనిలేదు మాకు.

హారూ: ఒరే అబ్బీ! పొలంలో గడ్డితో పొట్టపోసుకొంటావా నువ్వు? పో పో పిచ్చివాడా? పొలం అమ్మనే అమ్మడట.

కుంజ: ఇదివరకు పొలం అమ్మాము తినేశాం. దరిద్రం తీరిందా? గడ్డు రోజులని ఉన్న పొలం అమ్ముకోవడం ఎందుకు? ఇప్పుడిక ఆ తెలివి తక్కువపని చెయ్యం. ఖచ్చితంగా చెపుతున్నాను.

హారూ: కుర్రకుంకవు, నీవు నోర్మూసుకో. పొలం సంగతి నీకేమి తెలుసు. అయితే ప్రధాన్! నీవు ఏమంటావు? ఆ మాట స్థిరమేనా?

కుంజ: మా పెద్దనాన్న చెప్పేదేమిటి? నేను చెబుతున్నాను. జలగలాగు పట్టుకొన్నారేమిటి? పొలం అమ్మము ముమ్మాటికి అమ్మము.

హారూ: ప్రధాన్! మీ తమ్ముడికొడుకుకు పూర్తిగా మతిపోయింది. ఇంటి విషయం ఏమీ పట్టించుకోడు. ఎన్నాళ్ళనుంచో మా ఖనుతల్లి అట్లా జబ్బుతో పడి ఉందిగదా! రెండడుగులు మా యింటిదాకా వచ్చి జ్వరమ్మునకాషాయం తెచ్చి ఇవ్వ డానికి ఏమొచ్చిందిచెప్పు? చూడు కుంజా! నీవు రావడానికి వీలులేకపోతే ఎవరినైనా పంపితే ఆ మందిచ్చి పంపుతాను.

కుంజ: మందిస్తే లాభమేమిటి? సరైన తిండి లేకనే ఆజబ్బు!

హారూ: తిండిలేక జబ్బా! హె హె హె! ప్రధాన్! నీ తమ్ముడికొడుకు విచిత్రమైన మనిషిలాగు కనబడుతున్నాడే? భలే మాటకారివోయ్ కుంజా! సరేగాని ప్రధాన్! ఆ పొలంవిషయంలో కుంజామాటే స్థిరమా? (అని వెళ్లపోతాడు.)

ప్రధాను: కాదు. ఉండండి.

హారూ: ఇంకా ఉండడమేమిటి? ఇక ఆ సంగతి ముగిసిపోయినట్లే.

ప్రధాను: ఆకొంచెం పొలం మాకు మిగలనియ్యండి. అంతా పోయింది. మిగిలిన ఈ కాస్త పొలం అమ్ముకోడాని కిష్టంలేదు. ఏం కుంజా!

కుంజ: రూపాయల ధూపంవేసి దేశంలో ఉన్న అందరి ధాన్యం ఇంతకు ముందే కాజేశావు. ఇప్పుడు పొలం కాస్తా కాజేయాలని చూస్తున్నావా మహాశయా? కాదు, పొలం అమ్మేది లేదు.

ప్రధాను: అదే ఖాయంబాబూ! మీ రేమనుకొన్నానరే, అదే ఖాయం.

హరూ: అమ్ముతానని మాట ఇచ్చావు. ఆమాట తప్పుతావా? మనిషికి రెండు నాలుకలా?

కుంజ: మాట ఇవ్వడం ఏమిటీ మాట తప్పడమేమిటి? ఆ సంగతి ఎత్తడ మెందుకిప్పుడు, భూకామందు స్వయంగా అమ్మనని చెప్తున్నాడు. ఇక మాట తప్పడమేముంది. అయినా నోటవచ్చిన మాటల్లా నిలుపుకోవడానికి మేమేమీ హరిశ్చంద్రులము కాము మహాశయా!

ప్రధా: ఆహా! నీవు మాట్లాడకు కుంజా!

కుంజ: నేనెందుకు నోరుమూసుకొని పడిఉండాలి? ఎందుకు మాట్లాడకూడదూ?

ప్రధా: ఎదెల్లా కావాలో అల్లా అవుతుంది, నీవూరుకోరా బాబూ!

కుంజ: మళ్ళా ఊరుకోమంటావేమిటి? ఇట్లా అన్నిటికీ నోరుమూసుకొని పడిఉంటే వట్టి మూగదద్దమ్మలమైపోతాము. దురవస్థలో ఉన్న నిరుపేదలమీద ఇట్లా విపరీతంగా ఒత్తిడితెచ్చి వేధించడము దౌర్జన్యంకాదా! పెద్ద మనుష్యుల తరహాయేనా? ఈ సంగతే పదిమందికి తెలిసేటట్లు గొంతెత్తి చాటిస్తాను. నేనూరుకోను.

ప్రధాను: ఊరుకోరా అంటే వినవేమిరా నాయనా?

హరూ: నీ మాటలుచూస్తే కయ్యానికి కాలు దువ్వుతున్నట్లుంది. అదేమిటో నేనూ చూస్తాను.

కుంజ: భయపెడుతున్నారా నన్ను! ఇక మీ భయపెట్టడం సాగదు. ఆ రోజులు పోయినయి.

హారూ : నాకు భయపడవద్దు! ఇదిగో (పైకి వేలెత్తిచూపి) అక్కడ భయపడాలి.

కుంజ : పైకి వేలెత్తి చూపించడమెందుకో నాకు తెలుసు. దేముడి మీద నమ్మకం ఇదివరకేపోయింది. ఇప్పుడు ఆ భయంకూడా లేదు.

హారూ : ఆ భయం లేకపోవడమేమిటో నేనూ చూస్తాను. నీచపు వెధవ' ఎంత పొగరు! ఒకసారి నడుం విరగ్గొడితేగాని ఆ పొగరు తగ్గదు.

కుంజ : ఇదిగో చెపుతున్నాను. నోటికివచ్చినట్లు మాట్లాడితే ఏం కుదరదు.

[దత్తు చిన్న కూతురు మాతి వేగంగా వస్తుంది.]

హారూ : (పిల్లను దగ్గరకు తీసుకొని) నీచపు వెధవ, తెగపేలుతున్నాడు. ఆ పోకిరీవెధవ మాటలు విను! పొగరెక్కి నోటికివచ్చినట్లు వాగుతున్నాడు.

కుంజ : నోరు దగ్గరపెట్టుకొని మాట్లాడు. లేకుంటే మర్యాద దక్కదు.

హారూ : చూడు వాడి పొగరుమోతుమాటలు, కళ్లు నెత్తికొచ్చినయి.

మాతి : (ఏడుస్తూ) బాబా! బాబా!

హారూ : నీవు వెళ్లు మాతీ! కోవెల ముందు ఎవరెవరున్నారో వాళ్ళందరినీ తీసుకురమ్మని మీ మామయ్యతో చెప్పు. వెళ్లు త్వరగా.

ప్రధాను : మీరు వెళ్ళండిబాబూ, ఉన్నది కాస్తభూమి, దాన్ని నేను అమ్మను. ఆ విషయం ముగిసినట్లే.

హారూ : ఊహూ. అంత తేలికగా ముగుస్తుందా? నేను ముగియనిస్తానా?

ప్రధాను : మీరు ఉత్తినే మాటలు మిగులుస్తున్నారు.

హారూ : మాటలు మిగులుస్తున్నది నేనా? అబ్బో! ఇంత పెద్ద వయస్సు వచ్చినా నీవుకూడా తక్కువ తిన్నవాడివేం కావు.

కుంజ : హాత్తెరీ! నీగుండ గొయ్యేతనమేమిటో నేనూ చూస్తాను. (అని గబాలున వెళ్లిపోతాడు.)

[రెండవ వైపునుండి లాఠీలతో ముగ్గురు మనుషులు వస్తారు.]

హారూ : ఆ వెళుతున్న వెధవను నాలుగయిదు గట్టిగా తగిలించండి.

[లాఠీతో కుంజ ప్రవేశిస్తాడు. అతడి లాఠీమీద ఫట్, ఫట్ మని రౌడీల లాఠీ దెబ్బలు పడతాయి. ఒక గట్టిదెబ్బ తగిలి కుంజ పడిపోతాడు. ఒక రౌడీ ప్రధాను రాకుండా అడ్డముంటాడు.]

1 వ రౌడీ: ఒరేయ్ వెధవా! తిండికిలేక ఛస్తున్నావు ఇంకా కొవ్వు తగ్గలేదా? వెధవా! తిండికిలేక చస్తున్నావు. పొగరణగలేదు.

2 వ రౌడీ: క్షమించమని బాబుగారికాళ్లు పట్టుకో పో!

[కుంజ రొమ్ముతో పాకుతూ హారూదత్తు కాళ్ళదగ్గరికి వస్తాడు.]

హారూ: (పళ్లు కొరుకుతూ కాళ్లు వెనక్కు తీసుకొంటూ) కాళ్లు ముట్టుకోకు. పో ముట్టుకోకు (వినోదని ప్రవేశిస్తుంది. మాఖన్ జబ్బుతో వరండామీదినుంచి లేవబోయి తలతిరిగి పడిపోతాడు. రాధిక వినోదని ఏడుస్తూ కేకలు వేస్తుంటారు.)

హారూ: (లాఠీతో కుంజ ముఖంమీద కొట్టి) పెద్దపెద్ద కబుర్లు మాట్లాడావు. ఈ దెబ్బలు మరిచిపోకు. ఎవరితో ఎట్లా మాట్లాడాలో జ్ఞాపకం పెట్టుకో.

ప్రధాను: చంపేశారు బాబూ మావాణ్ణి. చంపేశారు. అయ్యో అయ్యో.

2 వ రౌడీ: ఇదుగో వీడొకడు (లాఠీతో దెబ్బ కొడతాడు. ప్రధాను కూల బడిపోతాడు. కుంజ వెక్కి వెక్కి ఏడుస్తాడు. జబ్బుగా ఉన్న మాఖన్ కింద పడి పోతాడు. వినోదిని, రాధిక, ప్రధాను పరుగెత్తిపోయి గట్టిదెబ్బతిన్న మాఖన్ ముఖంమీదికి వంగి నిశ్చేష్టులై పడిపోతారు.)

రాధి: అయ్యో దేవుడా! నా కొంప కూలిపోయింది. నా సర్వం నాశనం అయింది. నేను దిక్కులేని పక్షినయ్యాను. అయ్యో! మాఖన్! నా బంగారు తండ్రీ! నన్ను విడిచిపోతావా... ....

ప్రధాను: (వినోదినితో) కాపిని నీళ్లు తెస్తావా? చన్నీళ్లు.

రాధి: మాఖన్. నా మాఖన్ (మాఖన్ చిన్న మూలుగు మూలుగుతాడు.)

ప్రధాను: ఒరే మాఖన్! నా మాఖన్! ఒరే కుంజా! ఒక్కసారి మాఖన్ను చూడరా! (రాధిక ఏడుస్తూ కూలబడిపోతుంది. వినోదిని గుడ్డ నీరు కుక్కుకుంటూ ఉంటుంది.)

కుంజా: (బాధతో) మాఖన్, మాఖన్, నా తండ్రీ!!

ప్రధా: మన మాఖన్ వెళ్లిపొయ్యాడు. కుంజా వెళ్లిపొయ్యాడు. మరి లేడురా మన మాఖన్.

[తెర వాలుతుంది.]

# ద్వితీయాంకం — మొదటి రంగం

[కాశీధను కొట్టుగది. ఒక మెత్తటి తివాచీమీద ఒక మూల దిండుకు ఆనుకొని కూర్చుంటాడు కాశీధను. బలిష్ఠమైన నల్లని శరీరం ఒంటిమీద వేస్టుకోటు, మెడలో బంగారం గొలుసు చేతికి బంగారు తాబీజు. గోడ మీద సిద్ధి వినాయకుడిబొమ్మ కింది భాగాన "శ్రీ శ్రీ కాశీమాత పాదపద్మాల భక్తితో వ్యాపారం జరుగుతున్నది" అనిపిందూర ముతో వ్రాసిన అక్షరాలు. పక్కన ఎర్రగుడ్డ అట్టతో అద్దగా పడిఉన్న ఖాతా పుస్తకాలు. గది నడుమ పెద్ద కాటా, అర్ధసేరు మొదలుకొని మణుగువరకూ తూనికవేసే ఇనప దిమ్మలు, అటూ ఇటూ పడిఉంటాయి. గొడౌను గదిలో ఒకపక్క ఖాళీబస్తా సంచులకట్టలు పడిఉంటాయి. కూలీలూ గుమాస్తాలూ ఇటూ అటూ వస్తూపోతూ ఉంటారు. ఎదురుగుండా రెండు మళ్ల బియ్యంబస్తాలు మూపుమీద పెట్టుకొని మోతకూలీలు తెచ్చి గొడౌనులో రహస్యంగాఉన్న దొంగ గదుల్లో నిల్వచేస్తూ ఉంటారు సరుకంతా. గల్లాపెట్టిమీదికి వంగి కాశీధను పద్దుల కాగితాలుచూస్తూ గొణుక్కుంటూ ఉంటాడు. ఎదురుగా తివాచీమీద ఒకపక్కన కాలుమీద కాలువేసుకొని కూర్చొని బీడీ కాలుస్తూ హారూ దత్తుకేసి బెచ్చిబెచ్చి చూస్తుంటాడు. ఇద్దరి నడుమ ఏదో పద్దు విషయంలో తగాదా నడుస్తున్నట్లు కళ్లల్లో మొఖంలో కనబడుతుంటుంది. తివాచీ కుడి వైపున ఒక మూలగా ఈగలాగున పెద్ద గుమాస్తా ఖాతా పుస్తకాలగుడ్డల్లో మునిగి ఉంటాడు. అప్పుడే చిన్న గుమాస్తా విరంజను 'రాఖహరి' అనే పేరుతో తాళంచెవుల గుత్తి ఆడిస్తూ కాశీధను వైపు వెళతాడు.]

విరంజ: సరుకు అంతా గోడౌనులోకి చేరిపోయింది.

కాశీ: సరిగ్గా దేవి కవి వేరుగా పెట్టించావా? (వేలెత్తి చీకటికొట్టువైపు చూపిస్తూ) మొత్తం అంతా....

విరంజ: మూడో నెంబరు గదిలో.

కాశీ: మూడో నెంబరా! సరే అయితే. కాని మళ్లా ఒకసారి జాగ్రత్తగా చూడు. (అని ఖాతా పుస్తకంమీదికి దృష్టిపోనిస్తూ) తాళం!.... ....

విరంజ: ఇదిగో ఇప్పుడే తాళంవేసి వచ్చాను.

కాశీ: వేశావు. వెయ్యంగానే సరా! బాగా లాగి చూశావా? ఎన్నిసార్లు అని చెపుతాను? అబ్బే ఇల్లాగైతే వ్యాపారం సాగినట్లే! (వెళ్ళిపోబోతున్న విరంజనుకేసి చూపి) ఇదుగో మాట! చెప్పేపి అంత తొందర తొందరగా వెళ్ళిపోతే ఎట్లా? తాళం సరిగా పడ్డదో లేదో ఒకటి రెండుసార్లు గట్టిగా లాగిచూడాలి. వెళ్ళిపోయే టప్పుడు రెండు బస్తాలు లాగి సొరంగానికి అడ్డుపెట్టాలి. తెలిసిందా! వెళ్లు. (నిరంజన్ వెళ్ళిపోతాడు.) అన్నీ చెప్పినట్లు చెయ్యాలి. ఇవన్నీ మాటిమాటికీ చెప్పాలసొస్తున్నది. చూడు! కంగారు మాని ఇటురా. (అని నిరంజను గూర్చి హారూ దత్తుతో) వీళ్ళతో వ్యాపారం నడుపుకోవాలి. ఏ పనికైనా వీడు పట్టి అంబోతు. కాని నమ్మకమైనవాడే అని ఉంచాను. తీసిపారేస్తాను. మెల్లిగా కాని ఈమాట వాడితో అనవద్దు.

హారు: ఈ కాలంలో నమ్మకమైనవా డొకడు దొరకడమంటే సామాన్యం కాదు.

కాశీ: అందుకే ఉంచాను మరి! (దత్తుకేసి చూపి) అయితే యావత్తూ ఇంకా నీ అధీనం కాలేదన్నమాట. సరే ఆలస్యంకావడమే మంచిది. రాఖహారీ రానీ చెపుతాము మళ్లా! బీడీ ఒకటి కాల్చు.

హారూ: సరేలే. (బీడీ అంటించి గుక్కపీల్చి) నాకింకా అక్కడ చాలా పని ఉంది.

కాశీ: మళ్లా వస్తావుగదూ? చూడు దత్తూజీ! ఈసారి నీవు పంపిన బియ్యం అంత బాగాలేవు సుమా.

హోరూ : ఇంకా బాగా ఉండాలా? రెండు రోజులుపోతే మరి బియ్యం అంటూ దొరుకుతాయో లేదో చూడు. అదీగాక పల్లెల్లో బియ్యం కోసం మరీ చావు దెంపులుగా ఉంది తెలుసా!

కాశీ ; తెలుసునయ్యా తెలుసు. నందీవాళ్ళ దుకాణానికి నీద్వారా వచ్చిన బియ్యమున్నాయే చాలా బాగున్నాయి.

హోరూ : సరేకాని ధర ఎంతో అడిగి చూశావా?

కాశీ : ఎంతో నీవు చెప్పరాదూ?

హోరూ : ఇరవై రెండున్నర! నీవు పెట్టగలవా చెప్పు!

కాశీ : అబ్బో, ఇరవై రెండున్నరా?

హోరూ : నడవ కిరాయీ, కమీషనూ ఇంకా కొంత ...... కావచ్చు.

కాశీ : ఆధర చాలా ఎక్కువ దత్తూజీ!

హోరూ : అవునయ్యా! మంచివస్తువు కావాలంటే మంచిధర పెట్టాలి. లేకుంటే దొరుకుతాయా! నీవు సరేనంటే 'ఇరవై పడవలకు సరిపడే ధాన్యం దొరుకుతాయేమో ప్రయత్నించి చూస్తాను. కాని ధరమాత్రం ఇరవై రెండూ ఇరవై మూడూ అంతకు అరపైసాకూడా తగ్గదు. ఇష్టమైతే చెప్పు.

కాశీ : అంతధర పెట్టలేను. వట్టినే దెబ్బతినవలసొస్తుంది.

హోరూ : దెబ్బ ఎందుకొస్తుంది? ముప్పైఅయిదు, నలభై అంటే ఎగ రేసుకపోతారు. నందీవాళ్లు నష్టానికి తీసుకొంటారా।

కాశీ : వాళ్ళమాట చెప్పకు. నేను మాత్రం అంతధర పెట్టలేను. మార్కెట్టంటావా ఎండా, వానా ఆటలాగుంది. ఎప్పు డెట్లా మారుతుందో!

హోరూ : ఆలోచించు. నీ వంటి పురానా సాహూకారే అట్లా అంటే ఇక చిల్లరవర్తకుల మాటేమిటి చెప్పు.

కాశీ : అదికాదు దత్తూజీ! నీకు తెలియదుగాని కనీసం లక్ష పాతికవేల రూపాయల సరుకు ఇంకా ఇక్కడా అక్కడా చిక్కడి ఉంది. అసలు ఒక్క రూపాయకూడా వసూలు కాలేదు.

హారూ: వసూలుకాక ఎక్కడికి పోతుంది? తాపీగా అవుతుంది.

కాశీ: ఇది మాటలతో అయ్యే పని కాదు. వసూలవుతుందని నీ వంటావు. కాని, వసూలవుతాయా కావా అని రాత్రిం బగళ్ళూ. ఎన్నో ఊహలు కందు రీగల్లాగు నాలుగు వైపుల నుంచి వచ్చి పిచ్చెక్కిస్తున్నాయి ఏమి చెప్పను నీకు?

హారూ: ధైర్యం పోతుంది. చికాకులుంటాయి. రక్తంపోటు వస్తుంది. అవన్నీ లేకుంటే పెద్ద పెద్ద వాళ్ళకు సాగదయ్యా.

కాశీ: అట్లాగే అనుకొంటారు. (వస్తున్న విరంజను కేసి చూసి) అడుగో వస్తున్నా డింత సేపటికి!

హారూ: అయితే ఈ మాటు తొందరగా నా పని చూడు. చాలా ఆలస్యం అయింది ఇప్పటికే.

కాశీ: నీకు డబ్బంతా ఇప్పు డివ్వలేను.

హారూ: అదేమిటట్లా అంటున్నావు? సరేలే, ఏమివ్వదలచుకొన్నావో వెంటనే ఇచ్చేయి. నా కింకా అక్కడ....

కాశీ: ఇప్పుడు నీవు గుయీ బాబుల ఇంటి కెళ్తావు గదూ! ఆ సంగతు లన్నీ నీవు నా కింకా చెప్పనే లేదు. ఎప్పుడూ చెప్పుల్లో కాళ్ల పెట్టుకొనే వస్తావు! రెండు నిముషాలు కూర్చొని ఆ కబురూ ఈ కబురూ దొచారు విశేషాలు చెపుతావా ఏవన్నానా? (విరంజనుతో) ఎన్ని బస్తాలైనయో చెప్పు!

విరంజ: పూర్తిగా ఏడు వందల బస్తాలు. ఒక గూడ్సు వేగను అన్న మాట.

హారూ: ఇదిగో కాశీధన్! ముందుగా నా కిచ్చేదేదో ఇచ్చేయి. తర్వాత మీ లెక్కా డొక్కా చూసుకో.

కాశీ: (గొంతు తగ్గించి) సరే. ముందు నీ పనే చూస్తాను (గల్లాపెట్టె తీసి ఒక నోట్లకట్ట విప్పి లెక్కపెట్టి హారూదత్తు చేతికిచ్చి) సరీగ్గా లెక్కపెట్టుకో.

హారూ: తర్వాత లెక్కపెట్టుకుంటాలే! అయిదూ పదీ ఏభై ఏభై అయితు వేలు? అయిదువేలు.

కాశీ : ఇందులో ఎంత ఇవ్వను? అయిదు వందలు. ఇదిగో ఖాతాలో చెల్లుపెడతాను. ఇది నీ అక్కౌంటులో ఉండనీ.

హారూ : ఉండుండు. అక్కౌంటు నీ దగ్గర ఉంటుంది. అందువల్ల మరి....సరేలే నే వెళ్తాను. (లేస్తూ) చాలా ఆలస్యమయింది. ఎప్పుడు బజారుకు వెళ్తానూ, ఎప్పుడు సరుకు బేరం చేస్తాను. సరే నే వెళ్తున్నాను. మరి ఆ సంగతి ఏమి చెపుతావు? ఒక పడవ బియ్యం చూడనా వద్దా?

కాశీ : ధర చాలా హెచ్చుగా ఉంది దత్తూ!

హారూ : సరుకు చాలా మంచిది. ఇక మరి దొరక్కపోవచ్చు. కొంత కొనగలిగితే మంచిదనుకొంటా.

కాశీ : వస్తువూ మంచిదే. ధర కూడా హెచ్చే. అందులో అటువంటిదేమీ ఉండదు. ఈ బియ్యమే నీవు మరికొంత నాకు....

హారూ : అది చెప్పడం అయింది. ఇది కూడా కొంత అట్టే పెట్టవచ్చు. నీ కది బరువైతే నే నేమీ చెప్పదలుచుకో లేదు. ఇంకా నాకు ఆ వైపున చాలా....

కాశీ : ఇంతగా చెప్పుతున్నావు కాబట్టి కొంత ఇయ్యి.

హారూ : ఎంత ఇమ్మంటావు ?

కాశీ : ఎంత ఇవ్వగలవో చెప్పు.

హారూ : (చేతి అయిదు వేళ్ళూ చూపించి) ఇంత!

కాశీ : (ఆశ్చర్యపడుతూ) అంతా! అయితే ఇయ్యి.

హారూ : (బయలుదేరబోతూ) ఉంటే ఇయ్యి కొంత. తర్వాత నీకు అంత భారం కాదు.

కాశీ : సరే! సరే! (దిగ్గరగా) ఇదిగో దత్తూ. తర్వాత—ముంది కబురు—అదే—ఆ వస్తువు సంగతి. నేను కోరిన అదే ఆ వస్తువు సంగతి ఏం చేశావు?

హారూ : (సందిగ్ధంగా చూస్తూ) దేని సంగతి అడుగుతున్నావు?

కాశీ : భలే! ఆ వస్తువేమిటో మళ్ళీ చెప్పాలా?

హారూ : ఏ వస్తువు చెప్మా? ఓహో! అదా? జ్ఞాపకం వచ్చిందిలే. అవు నవును (నవ్వుతూ) అది అవుతుంది. తప్పక అవుతుంది. నే నొకమారు అటుకేసి

వెళ్ళి అంతా బాగా జరిగేట్టు ఏర్పాటు చేసి వస్తాను. ఇదివరకే కలిసి మాట్లాడా ననుకో! అయినా ఇప్పుడే అటుకేసి ఒక మారు....

కాళీ : నిజమేనా? ఏది చేతిలో చెయ్యి వెయ్యి.

హారూ : (వెళ్లతున్నవాడు తిరిగి చూసి నవ్వి) నమ్మకం లేదా?

కాళీ : సరే. నీ యిష్టం. కానీ! (హారూదత్తు వెళ్లిపోతాడు.)

[గల్లాపెట్టె మూత తెరిచి పట్టుకొని బాగా వెతికి చూసి ఒక పెద్ద తాళంచెవి తీసి వెనక్కి తిరిగి ఇనపెట్టె తీసి కొన్ని నోట్ల కట్టలను అందులో పెడతాడు.]

రాజీవు : (ఆవలించి మూడు చిటకలు వేసి) రాధీగోవింద రాధేగోవింద!

కాళీ : గుమాస్తాగారూ!

రాజీ : (కళ్ళజోడు సందు నుంచి ఒకసారి కాళీధను కేసి చూసి మళ్లా తన పనిని చూసుకొంటాడు.)

కాళీ : గుమాస్తా మహాశయా ! ఒకసారి—

రాజీవ : వింటున్నాను చెప్పండి.

కాళీ : ఆ రోజు మీ కిచ్చిన చలాను పంపించారా?

రాజీవ : విపినబాబు పేర ఉన్న చలాను కదూ? పద్నాలుగో నెంబరు ఛలాన్లు.

కాళీ : (ఖాతా చూసి) అవును అదే.

రాజీ : ఆ! ఇచ్చాను రాఖహరికి ఇచ్చాను. ఒకసారి అడుగుతాను పంపాడో లేదో!

కాళీ : ఇదే మీతో వచ్చిపడిన ఇబ్బంది.

రాజీ : ఇంతలో వచ్చిపడిన ఇబ్బందేమిటి? అతగాడి పేరేమిటి చెప్మా ? ఆజ్ఞాపకం వచ్చింది. రాఖహరి. ఓయి ! రాఖహరి ! విపినబాబు చలాను పంపావా లేదా ?

విరంజి : (చేస్తున్న పని వదిలి దగ్గరికి వెళ్ళి) ఏ చెలాను? నెంబరెంత?

[ఒక పెద్ద మనిషి ప్రవేశిస్తాడు.]

కాశీ : చెలాను నెంబరెంతో ఇప్పుడు అడుగుతున్నావా? ఇక ఇటువంటి వాళ్లతో వ్యాపారం సాగించడం చాలా....(పెద్దమనిషి కేసి చూసి)....తమకు....

పెద్ద : చూడండి నేను—

కాశీ : తెలుసు. తెలుసు. మంటూ బాబుల ఇంటి నుంచి వచ్చారు గదూ ? కొంచెంసేపు ఆగాలి మీరు. ఎంతో ఆలస్యం కాదు లెండి.

[పెద్ద మనిషి దద్దమ్మలాగ పక్కనున్న కుర్చీ మీద కూర్చుంటాడు.]

కాశీ : (విరంజను కేసి చూసి) అయితే వెళ్ళు. నోరు తెరుచుకొని ఇక్కడ నిల్చొని ఏమి చూస్తావు! జరగవలసిందేదో జరిగింది. చలాను నిన్న వెళ్ళలేదు. ఈ రోజు వెళ్ళదు. (రాజీవు కేసి చూసి) మీరూ ఆ రకం మనుష్యులే! చెలానా అతగాడి కివ్వడంతో మీపని తీరిపోయింది? చెలాను వాడు అది సరిగా పంపడం జరిగిందో లేదో ఒకసారి కనుక్కోవద్దా? ప్రతివాళ్ళూ ఇల్లాగైతే.... .... ....

రాజీవ : ఆరోజు పొద్దున్నే చెలాను ఇచ్చేశాను. వెంటనే పంపమని! మరి ఏంచేశాడో?

కాశీ : ఇచ్చారు తెలుసు. ఆపొద్దున్నే ఇచ్చారు. అదీ తెలుసు. అది పంపాడో లేదో కనుక్కోవలసిన బాధ్యత మీకు లేదా?

రాజీ : ఆవూహ నాకు తట్టలేదు.

కాశీ : తట్టకపోవడంలో ఆశ్చర్యం లేదు. సరే, ఇక వెళ్ళండి మీరు. (పెద్దమనిషి కేసి తిరిగి) ఇప్పుడు చెప్పండి మీ సంగతేమిటో! ఓహో, గుమాస్తా గారూ! ఈవేళ పొద్దున్న అనంతధామం నుంచి ఎవరో ఒకరు వచ్చారేమో కబురు తెలిసిందా?

రాజీవ : అనంతధామం నుంచి బియ్యం కోసం ఎవరో రావడం మటుకు వచ్చారు! కాని ఎన్ని అనే సంగతి.... .... ....

కాశీ : (పెద్దమనిషితో) మీకు ఎన్ని మణుగులు కావాలన్నారు?

రాజీ : ఉండండి ఖాతా చూస్తాను. రాసే ఉంచాను. (అని ఖాతా తిరగ వేస్తుంటాడు.)

పెద్దమనిషి: (విప్వేరపడి) మీ మాట లేమీ నాకు బోధపడడంలేదు. మంటూబాబూ ఎవరో, అనంతధామం నుంచి ఎవరు వచ్చారో నాకేమీ అర్థం కావడంలేదు.

కాళీ: (ఆశ్చర్యంగా) అయితే మీ రెవరూ? ఎక్కణ్ణుంచి వచ్చారూ?

పెద్దమనిషి: నేనొక సామాన్య గృహస్థుణ్ణి ఎంతో అవసరమై మీ దగ్గరికి వచ్చాను. మీ రెంతధర అడిగితే అంతా ఇస్తాను. నాకు కొంచెం బియ్యం కావాలి.

కాళీ: (చేయి పైకీ కిందికీ తిప్పుతూ) బియ్యం ఎక్కడున్నాయి మహాశయా! ఇరవై ఏండ్లనుంచీ వాడుకగా కొంటున్నవాళ్ళకే యివ్వడానికి లేవు. మీకు ఇక్కడ దొరకవు. కాబట్టి మరొకచోటికి వెళ్ళడం మంచిది. ఏమవన్హరాబాబూ!

పెద్దమనిషి: ఇంట్లో రెండు మూడురోజులనుంచీ పస్తుఉన్నారు. చూడండి. నేను మీ రడిగిన ఖరీదు ఇస్తాను.

కాళీ: వట్టినే ఖరీదుమాట ఎత్తుతా రెందుకు? ఖరీదు యివ్వరవి లేదనడం లేదయ్యా బాబూ! అసలు బియ్యం లేవు.

పెద్దమనిషి: బియ్యం లేవంటే ఎట్లాగండి.

కాళీ: ఎట్లాగో నేనేం చెప్పను. మరొకచోటికి వెళ్ళి చూడండి.

పెద్దమనిషి: ఎక్కడ చూడను చెప్పండి? ఇంతకు ముందే అయిదారు దుకాణాలకు వెళ్ళి చూశాను. అన్నిచోట్లా లేవు, లేవు అనే మాట తప్ప మరొక మాట లేదు. ఏమిచేయమంటారు నన్ను? మీరే చెప్పండి. నా యిబ్బంది, నా అవసరము మీరు సరిగ్గా గ్రహించలేదనుకొంటాను. ఎంతోమంది పిల్లా జల్లాతో పట్నంలో ఉంటున్నాను, ఇంట్లో మూడు రోజులనుంచి బియ్యపుగింజ అనేమాట లేదు. కొంచెం దయ చూపండి మీకు తెలియందేముంది?

కాళీ: తెలుసునయ్యా బాబూ! అంతా తెలుసు. బియ్యం లేనప్పుడు నేనేం చెయ్యగలను చెప్పండి.

పెద్దమనిషి: చూడండి! మీరు బెంగాలీలు. నేనూ బెంగాలీను. మీకు పుణ్యముంటుంది, ఏదో ఒక ఏర్పాటుచేసి యింత తిండి పెట్టండి. (అని చేతులు జోడిస్తాడు.)

కాశీ: ఏమిగోల వచ్చిందయ్యా! ఖరీదుమాట చెపుతున్నారు మీరు. ఎంత ఖరీదు పెట్టగలరో చెప్పండి. మరో దుకాణంలో ఎక్కడనయినా దొరుకుతాయేమో భోగట్టాచేసి తెప్పించడానికి ప్రయత్నిస్తాను మరి!

పెద్దమనిషి: ఎంత ఖరీదో మీరే చెప్పండి.

కాశీ: (చేతి అయిదువేళ్ళూ చూపి) ఇంత యివ్వగలరా మీరు? అయితే ఎవరింట్లో నయినా బియ్యం ఉన్నాయేమో తెలిసికొని తెప్పిస్తాను.

పెద్దమనిషి: ఎంతా!! (గుండెమీద కొట్టుకొంటూ) యాభయి రూపాయలా? హాల్ఫ్!!

రాజీవ్: (ముఖమెత్తి) పొల్లు కబుర్లు చెప్పకు కాశీధన్. ఎందుకు అలా పెడతావు ఆయనకు?

కాశీధన్: ఏదో పెద్దమనిషి ప్రాధేయపడుతున్నాడు. పోనీ ఉపకారంకదా! (పెద్దమనిషితో) ఆధరకైతే చెప్పండి.

రాజీవ్: బియ్యం తింటారు! ఎన్నైనా తిని అరిగించుకొంటారు. ఈ మహా కరువులో సాలీళ్లు, బొద్దింకలు బియ్యం తినడాని కెన్నో వస్తున్నాయి.

కాశీ: ధర వినగానే అంత ఉలికిపడ్డారేం? అందుకే మీరు బియ్యం కొనలే రని నేను ముందుగానే చెప్పాను.

పెద్దమనిషి: అందుకేనా ఒక్కమాటే యాభయిరూపాయలు చెప్పారు.

రాజీవ్: అరె! మణుగు అరవై రూపాయలంటే బ్రతిమిలాడి ఎగరేసుకు పోతున్నారు. అసలు ఆ ధరకు ఇప్పుడు దొరుకుతున్నాయా? యాభయి అవి చెప్పేటప్పటికే మీరేమో గడగడలాడిపోతున్నారు. సరుకు లేనప్పుడు ధర హెచ్చు ఉంటుందయ్యా!

కాశీ: (పెద్దమనిషితో నవ్వుతూ) అయితే ఇంకా శోధించి చూడండి.

పెద్దమనిషి: మీకు అంత నవ్వులాటగా ఉంది.

కాశీ: నవ్వక మరి ఏడవమంటారా? తమాషాగా ఉందే!

పెద్దమనిషి: ఇంతకుముందు ముప్పై రూపాయలకు ఇచ్చేవారు. అవసరం కాబట్టి ఇప్పుడు ముప్ఫయిఅయిదు తీసుకోండి. ఇంకా కావలిస్తే నలభై పుచ్చుకోండి.

నాకు పన్నెండు శేర్లు ఇప్పించండి. మీకు పుణ్యం ఉంటుంది, నా ఇబ్బంది తీరుతుంది.

రాజీవ్: ఈయన వ్యవహారం చూస్తే వేలు చూపిస్తే మండ మింగే రకంగా కపపడుతున్నాడు. చూడు కాశీధన్. వీళ్లు ఏం మనుష్యులయ్యా?

కాశీ: నేను ఏమీచేయలేను, క్షమించండి.

పెద్దమనిషి: (చేతులు జోడించి) నేను అడుగుతున్నది పన్నెండు శేర్లే కదండి.

రాజీవ్: ఈ మనుషుల సంగతి నేను చెప్పలేదూ!

పెద్దమనిషి: మీరు మాట్లాడకండి. చాలాసేపటి నుంచీ చూస్తున్నాను మీ వ్యవహారం.

రాజీవ్: కాశీధన్. కళ్ళెర్ర చేస్తున్నాడు! మెడపట్టుకొని దుకాణంలోనుంచి గెంటెయ్య రాబహరీ.

పెద్దమనిషి: ఎక్కడ దాపరించావయ్యా కౄరుడవు! నిన్ను పోలీసుల కప్పగిస్తాను చూడు.

కాశీ: వెళ్ళవయ్యా వెళ్లు. పిల్చుకురా పోలీసులను. ఇక్కణ్ణించి వెళ్ళిపో.

పెద్దమనిషి: (బాధగా)అనంతధామంనుంచి మనుషులొస్తే ఎన్ని మణుగులు కోరితే అన్ని మణుగుల బియ్యం అతడికి ఇవ్వగలరు మీరు, కాని దురవస్థలో ఉన్న నాకు..........

కాశీ: వట్టినే కేకలేస్తా రెందుకు? బియ్యం లేవు. దొరకవు. వెళ్ళిపొండి.

రాజీవ్: (వికటారంగా నవ్వి) పిచ్చివాళ్ళలాగు కనబడడంలేదూ వీళ్లు నీకు? పోలీసులను తీసుకురానీ (పెద్దమనిషికి కాశీధన్‌ను చూపిస్తూ) ఈ బాబు సంగతి నీకు తెలియదు. ఎంతోమంది జడ్జీలను, మెజిస్ట్రేట్లను, పోలీసులను జేబులో వేసుకొన్నాడు. తెలివితక్కువవాడవు నీవు. పోలీసుల పేరు చెప్పి బెదిరిస్తావా?

[ తెరలో ]

[ అయ్యో, అయ్యో దేవుడా! అని కేకలు, బొబ్బ ఆడిస్తూ కాళీధన్ నవ్వుతుంటాడు. ]

పెద్దమనిషి : సరే. నేను వెళుతున్నాను. కానీ దీనికి ప్రతీకారం ఏమైనా ఉన్నదేమో చూస్తాను. ఏదో ఒకటి చూడాలి ఒకమారు. (అని వెళ్లిపోతాడు).

రాజీవ్ : (ఖాతా పుస్తకాలకేసి ఒకసారి చూసి) ఈ కరువు రోజుల్లో దేశంలో ఉన్న బిచ్చగాళ్లందరూ చావడానికి ఈ పట్నం మీద వచ్చి పడ్డారు. రాఖహారీ దుకాణం బయట మూసెయ్యి. వెంటనే తలుపు మూసెయ్యి.

[తెరలో—ఝణఝణ మని ముఖ ద్వారం మూసిన చప్పుడు]

[తెరవాలుతుంది]

# ద్వితీయాంకం — రెండో రంగం

[ఒక పార్కులో భాగము. ఒకవైపున బెంచీవేసి ఉంటుంది. లోపల పాతికమంది బిచ్చగాళ్లు గుంపుగా కూర్చుని ఉంటారు. ఆవరణ అంతా కలకలధ్వనులతో మారు మోగుటుంతుంది. ఆగుంపులో ప్రధానూ, కుంజా, రాధికా, వినోదినీ, కనబడుతుంటారు. ప్రధాను ఒక చినిగిన చొక్కా కుట్టుకొంటూ ఉంటాడు. రాధిక తల ముడివేసుకొంటూ ఉంటుంది. కుంజ చెంపన చేయి పెట్టుకొని ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. వినోదిని పక్కనున్న బిచ్చకత్తెతో హాస్యమాడుతూ ఉంటుంది, గోనె సంచుల మూటలూ మట్టికుండలూ చిన్న డబ్బాలూ సంసారానికి అవసరమైన వస్తువులూ అటూ ఇటూ పడి ఉంటాయి. ముసలివాళ్లూ, పడుచువాళ్లూ, పిల్లలూ, వయస్సువాళ్లూ, నిరుపేదలు అక్కడ కలిసి ఉంటారు. కొందరు ఏడుస్తుంటారు. కొందరు నవ్వుతుంటారు. కొందరు పోట్లాడుకుంటూ వుంటారు. ఈ గందరగోళం నడుమ ఆడిటోరియంలో నుంచి సూటూబూటూ వేసుకొన్న ప్రెస్సు ఫోటోగ్రాఫరు వచ్చి ఒక చంకన పిల్లను ఎత్తుకొని ఉన్న ఒక బిచ్చకత్తెను చూసి కేక వేస్తాడు.]

1వ ఫోటోగ్రాఫరు: వహవ్వా! బలే వసందైన మోడలు. మూర్తీ! రండి, రండి ఇటు వెంటనే రండి. మన పత్రికకోసం కొన్ని ఫోటోలు తీద్దాము ఇటువంటి మోడల్సు దొరకడం కష్టం. రండి వెంటనే.

[మరొక ఫోటోగ్రాఫరు ఆడిటోరియంలో నుంచి స్టేజిమీదికి వస్తాడు.]

2వ ఫోటోగ్రాఫరు: ది బెస్టు ఐడియా! నీకు బాగా తట్టింది. నాకసలు తట్టనే లేదు. ఓహోహో! ఎన్ని ఫోటోలు తీశావు?

1వ ఫోటో గ్రా: రెండు మాత్రం! కాని బాగా ఎక్స్పోజు కాలేదని తోస్తున్నది.

2వ ఫోటో గ్రా: ఎంచేత బాగారాలేదు?

1వ ఫోటో గ్రా: అనుమానంగా ఉంది. వెధవ ఊరికే కదిలాడు. ఒకటే కదలడం. పొజిషను సరిగా కుదరలేదనుకుంటాను.

2వ ఫొటో గ్రా: సరే ఉండు. నేను సరిచేస్తాను. (బిచ్చగాళ్ళవైపు ముందుకు వెళ్ళి) నేను చెప్పినదాకా ఉండు. అర్థం లేకుండా మాబును ఫోటో తీసి పట్టనే ఫిలింపాడు చేయడం ఎందుకు? మంచి మోడలు బాగా చూసి చెప్పు. పొజిషను సరిగా ఉండేటట్లు నేను చూస్తాను. (పసి బిడ్డను చంకకెత్తుకొన్న బిచ్చకత్తెను చూపి) నేను చెప్పినట్లు చేస్తే మీకు తిండి పెడతాను. అంటే తెలుసు? మీరందరూ పొంగలి తినవచ్చు.

బిచ్చకత్తె. కాదులే! (అని ఫోటోగ్రాఫరుకేసి చేయి చాస్తుంది.)

2వ ఫోటోగ్రా! (కెమెరా గురిచూస్తూ) ముఖర్జీ?

1వ ఫోటోగ్రా: కొంచెం నవ్వించగలవా? 'జస్టు బిట్టాఫ్ స్మైలు' చూడు. ప్రయత్నించిచూడు.

2వ ఫోటోగ్రా: అంత తేలికగా నవ్వు వస్తుందా?

1వ ఫోటోగ్రా: అవును. ముఖాన 'జస్టు బిట్టు స్మైలు' కనబడితే 'మెడోనా ఆఫ్ బెంగాల్' అని పేరు పెట్టవచ్చు.

2వ ఫోటోగ్రా: మాంచి ఐడియా! రేపు మన పత్రిక కాపీల అమ్మకం రెట్టింపవుతుందన్నమాట. మేరీ కన్య అనుగ్రహం! గొప్పతెలివోయి నీది! ఏం చేస్తే నవ్వు వస్తుందో నీవుచెప్పు.

1వ ఫోటోగ్రా: కొంచెం ప్రయత్నించు. 'జస్టు ఆవ్ ది బిట్టు స్మైల్!' కావాలంటే నాలుగు డబ్బులు పారెయ్!

[కెమెరా ఫోకస్ చేసి చూస్తారు. 2వ ఫోటోగ్రాఫరు దగ్గరికి వెళతాడు.]

2వ ఫోటోగ్రా; ఏంకావాలి నీకు?

బిచ్చ: నాకోసం కాదు బాబూ! ఈ చంటి పాపకోసం. కనికరించండి బాబూ! పుణ్యం ఉంటుంది.

2వ ఫోటోగ్రా: (జాలిగా) చంటిపాపకోసం పైసా కావాలా? ఇదిగో తీసుకో (డబ్బు ఇస్తాడు. డబ్బు కనబడగానే బిచ్చకత్తె ముఖం వికసిస్తుంది.)

2వ ఫోటోగ్రా: ఏం వోయ్! ఎలా ఉంది?

1వ ఫోటోగ్రా: ఓ కె! గుడ్ లక్.

2వ ఫోటోగ్రా: కోరిక నెరవేరినట్లేనా.

1వ ఫోటోగ్రా: అనుకొన్నదానికంటె ఎక్కువగా (బిచ్చకత్తెతో) నీవు ఇక వెళ్ళవచ్చు. డబ్బు ముట్టిందికదూ!

(బిచ్చకత్తె వెళ్ళిపోతుంది) ముఖర్జీ వెరీ సక్సెస్‌ఫుల్! సరేగాని ఇటువంటి బెస్టు మోడల్సు మూడునాలుగు చూస్తేచాలు. ఆ ముసలాణ్ణి? ఒకమారు విల్సో బెట్టగలవా? (ప్రధాన్ని చూపును.)

2వ ఫోటోగ్రా: చింకెచొక్కా తొట్టుకొంటున్నాదే ఆ ముసలాణ్ణేనా? ఓ దట్ గ్రేట్ పాట్రియార్క్!

1వ ఫోటోగ్రా: వారెవా! ఎక్సలెంటు పేరు పెట్టావోయ్ నిజంగా పాట్రియార్కే వాడితో రెండు మాటలు మాట్లాడి చూద్దాం (ప్రధాను దగ్గరికి వెళ్ళి) ఓయోయ్! నీయిల్లెక్కడో చెపుతావా? అంటే నీగుడిసె!

ప్రధాను: చెప్పితే అనవాలు పట్టగలవా?

1వ ఫొటోగ్రా: ఎందుకు పట్టలేను!

ప్రధాను: అయితే చెపుతాను. మీరెరిగిందే! అమీన్ పూర్.

1వ ఫొటో గ్రా: అమీన్ పూరా!

ప్రధాను: అవును. ఇదివరకు——

1వ ఫోటోగ్రా: అయితే మీరందరూ అక్కణ్ణుంచి ఇక్కడికి లేచి వచ్చారన్నమాట. సరేగాని మీకు ఇక్కడ ఉండడానికీ, తినడానికీ బాగా జరుగుతూ ఉందా?

ప్రధాను : మాలాటి పేదోళ్ళకు జరగడమంటూ జరక్కాపోవడమంటూ ఎక్కడా ఎప్పుడూ ఉంటుందా బాబూ ?

1వ ఫొటోగ్రా : ఎందుకుండదులే ! కాని నీవు ఒకమాటు కొంచెం లేచి నిల్చోగలవా ?

ప్రధాను : లేచి నిల్చోమంటారా ?

1వ ఫొటోగ్రా : అవును. కొంచెంసేపు — ఎందుకంటే — ఫొటో తీద్దాము.

ప్రధాను : ఫొటోతీస్తారా ? మాలాటివాళ్ళ కెందుకు ఫొటో బాబుగారూ ?

1వ ఫొటోగ్రా : ఆయన నచ్చేట్టు చెపుతాడు విను. ముఖర్జీ డీల్‌విత్ హిం.

2వ ఫొటోగ్రా : (ప్రధానుతో) మేము పత్రికలవాళ్ళంలే. నీ ఫొటో తీస్తే అందంగా పత్రికలో పడుతుంది.

ప్రధాను : పత్రికలోనా ? పడుతుందా ? పడితే మాకేం వస్తుంది బాబూ ?

1వ ఫొటోగ్రా : దేశమంతా చూస్తారు. పేదలు ఏ అవస్థలో ఉన్నారో తెలుసుకొంటారు.

ప్రధాను : మా దురవస్థ తెలుసుకొంటారా ? వాళ్ళకు పత్రిక ఎక్కడ నుండి వస్తుంది ?

2వ ఫోటోగ్రా : కొనుక్కొంటారు వాళ్లు.

ప్రధాను : కొనుక్కొంటారా ? అయితే వాళ్ళకు మీరే అమ్ముతారా ?

1వ ఫొటోగ్రా ! మేము అమ్మకుంటే దేశం ఎట్లా ఉందో ఎక్కడ ఏం జరుగుతున్నదో జనానికి ఎట్లా తెలుస్తుంది మరి.

ప్రధాను : అదీ నిజమే. యాపారం ! ఎముకలగూళ్ళ యాపారం. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు. అదీ ఒక బతుకుతెరువే. సరే ఇప్పుడు మీరు నన్నేం చెయ్యమంటారో చెప్పండి.

1వ ఫొటోగ్రా : ఏమీ శ్రమ వుండదు. నీవు కొంచెంసేపు లేచి నిల్చోవాలి, అంతే.

ప్రధాను : ఎలాగ నిల్చోవాలి ?

2వ ఫొటోగ్రా : చూదు. ఏమీలేదు. దబ్బిస్తాను. నీకు తెలిపిందా ? ఒకసారి లేచి నిల్చో.

ప్రధాను : దబ్బిస్తావా ? అయితే ఇవ్వండి ఈకుండా, చింకెచొక్కా చేత్తో పట్టుకొనే నిల్చోనా ? కుండ పట్టుకొని నిలుచుంటే బాగా కనపడుతుందికదూ ?

2వ ఫొటోగ్రా : (1 వ ఫొటో గ్రాపరుపై గతో) భలే బాగుంటుంది! కుండ చేత్తో పట్టుకొనే నిల్చో.

ప్రధాను : (లేస్తూ) సరే. కుండతీసుకొంటాను. పట్టుకొని నిల్చుంటాను కానీ. అస్థిపంజరం బొమ్మ యెత్తు.

2వ ఫొటోగ్రా : ఉండు. ఉండు. గెట్ రెడీ.

ప్రధాను : అస్థిపంజరం బొమ్మ తియ్యి.

1వ ఫొటోగ్రా : (మీట నొక్కి) బస్ ! అయిపోయింది.

ప్రధాను : అరే ! అయిపోయిందా ?

1వ ఫొటోగ్రా : ఎంతసేపు ! ఒకరెప్పపాటు పని. నీకు దబ్బిస్తానన్నాను కదా ! ఇదిగో, తీసుకో (డబ్బిచ్చి) సంతోషమేనా ? సరే "ది గ్రేట్ పాట్రియార్క్" !

ప్రధాను : ఈ అస్థిపంజరం బొమ్మ అమ్ముకో. వెళ్లు వెళ్లు.

(ఫొటోగ్రాఫర్లు వెళ్లిపోతారు. ప్రధాన్ మళ్ళా కుట్టుకుంటూ ఉంటాడు.)

[తెరలో దప్పు వాయించిన చప్పుడు. దప్పు వాయిస్తూ బారికెవాడు ప్రవేశిస్తాడు.]

బా—వాడు : (మూడుసార్లు దప్పుకొట్టి) బజారు బయల్లో బీదోళ్ళకు అన్న దానం చేస్తున్నారు కాబట్టి బికార్లందరూ రావాల్సిందహో. (అని చాటించి మూడు సార్లు మళ్ళీ దప్పు కొడతాడు)

ఒక బికారి : అన్నదానం ఎక్కడ బాబూ ? ఎక్కడ చేస్తున్నారు ?

బా.వాడు : బజారు బయల్లో బికార్లకు తిండి పెడుతున్నారయ్యా. అందరూ యెళ్ళండి అక్కడికి.

[చాటింపు విని బిచ్చగాళ్ళలో కలవరం బయలుదేరుతుంది. ఎవరి మటుకు వాళ్లు గుడ్డా గుడుసూ పట్టుకొని గబగబా బయలుదేరుతారు.]

రాధిక : (బిగ్గరగా) ఓ వినో ! ఓసేయ్ వినోదినీ ! (అని కేకవేస్తూ కుంజను చూసి) ఏదీ మన వినో? ఎక్కడకు వెళ్ళింది?

కుంజ : చాటింపు విని ముందే వెళ్ళివుంటుంది. చూడడంలేదూ? ఇక్కడ ఉన్నవాళ్ళంతా వెళ్లుతున్నారు.

[ప్రధాన్ తప్ప కుంజ, రాధిక మొ॥ వాళ్ళందరూ వెళ్ళిపోతారు. చిరిగిన చొక్కా, మాసిన బొంతా పట్టుకొని చాటించిన మాటలు అదేలాగు పట్టి పట్టి అంటూ ఉంటాడు.]

రాధి : ఓయ్యో ! అయితే నేనూ వెళతాను. ఏమిటోగోల.

[వెళ్ళిపోవును.]

ప్రధాను : బజారు బయట్లో కలగాపులగం లోజనం పెడతారోహో,అక్కడికి అందరూ వెళ్ళండోహో (అని అందరి వెనుక తాను వెళతాడు.)

[ప్రధాన్ వెళ్ళగానే ఒక దలారి పార్కులోకి వచ్చి ఒకమూల బెంచేమీద కూర్చుంటాడు. బక్కపలచని శరీరం. మిలమిల మెరిసే కళ్లు, బీడి కాలుస్తూ నాలుగు వైపులా చూస్తూ ఉంటాడు. ఆసమయానికే కంగారుపడుతూ వినోదిని వస్తుంది అక్కడికి.]

వినో : అయ్యో ! ఇక్కడున్న వాళ్ళందరూ ఎక్కడికి వెళ్లారో ? ఏమి దారి నాకు?

దలారి : (వినోదినిని చూసి ముసిముసి నవ్వులు నవ్వుతుంటాడు)

వినో : చూడండి బాబూ! ఇక్కడున్న వాళ్ళందరూ ఎక్కడికి వెళ్లారో చెప్పగలరా? నేను బిచ్చమెత్తుకోవడానికి వెళ్లాను. వచ్చి చూసేసరికి ఇక్కడ ఎవ్వరూ లేరు!! ఎటువెళ్లారో చెప్పగలరా బాబూ?

దలారి : ఎటువెళ్లారో చెప్పడం కష్టమే.

వినో: అమ్మో! అమ్మయ్యో! నాకేం దారి ఇప్పుడు? ఏమి చేయను? ఎటవి వెళ్ళగలను?

దలారి: నీవెంట తోడెవరూ లేరా?

వినో: ఏమిటంటారు బాబూ?

దలారి: ఆహ ఏమీలేదు. వెంట ఎవరూ లేరా? అని అడిగాను. (వినోదిని ఏమీ మాట్లాడదు.) నీకు భర్త ఉన్నాడా?

వినో: ఉన్నాడు. వదిలేసి వెళ్ళిపోయాడు.

దలారి: విడిచిపెట్టేశాడా? అయ్యో! బంగారపు బొమ్మలాగున్నావు. నిన్ను ఒంటరిగా విడిచిపెట్టి ఎట్లా వెళ్లాడు? దరిద్రుడు?!! ఎంత ఘోరం! ఎంత అన్యాయం! ఇది మహా పట్నంలో బజారు. ఎక్కడ చూసినా రౌడీలు, పోకిరీలు, దుర్మార్గులూను. చాలా చిక్కే నీకు!

వినో: ఏం చేయను? ఏమిటి దిక్కు బాబూ నాకు?

దలారి: నీవేమో ఆడదానవు. నీకు నేను సాయపడడమెట్లాగో చెప్పు?

వినో: వాళ్లు ఎటువెళ్లారో కొంచెం వెతికి చూసి చెప్పండి బాబూ.

దలారి: ఇప్పటికిప్పుడు నేను ఏమి చూడగలనమ్మా? ఈ పట్నంలోకి ఎంతోమంది జనం వచ్చిపడ్డారు. మీ వాళ్లను నేను ఎట్లా గుర్తుపట్టగలను? వెతికినా కనబడతారా ఏమన్నానా? అయినా చూడమ్మా, ఒకమాట చెపుతాను. ఒంటిగా ఇక్కడ ఉండడంకాని వీధినబడి వెళ్లడంకాని నీకు చాలా ప్రమాదం. ఆపదలో ఉన్నావు. ఆడదానవు. నీకు సాయపడాలనే ఉంది నాకు. ఇక్కడ నేనెరిగిన పెద్ద మనిషి ఒకాయన ఉన్నారు. ఆయనకు ఇల్లున్నది. నేను ఆయనతో చెప్పి చూస్తాను. నీకు అక్కడ ఉండటానికి, తినటానికి ఏలోటూ వుండదు. సంసారంలో చిల్లర పనులేమయినా చేసుకొంటూ, రెండు పూటలా భోంచేస్తూ అక్కడ ఉండవచ్చు నీవు. ఇంటి ఆయన చాలా మంచివాడు. సాక్షాత్తూ దేముడిలాటివాడు. నేను అప్పటిమాట చెప్పటం లేదు. అక్కడ కొన్నాళ్లుంటేమటుకు నీకు ఇబ్బంది ఏమిటి? దేనికీ లోటుండదు. ఈలోగా నేను నాల్గు వైపులా వెదికి మీవాళ్ళ ఆచూకీ కనుక్కొంటాను. ఆలోచించుకో. ఏమంటావో చెప్పు?

వినో : నాకు తల్లీ తండ్రీ మీరేబాబూ! ఏదోదారి చూపించండి.

దలారి : దారిచూపించాలనే కదా ఇదంతా చెప్పడం. వాళ్లు చాలా పెద్ద మనుషులు. కావలసినంత డబ్బుంది. అదీగాక మనదేశస్తులే వాళ్లు. మధ్య మధ్య ఒకటో అరో నీకిష్టమైతే సరదాలూ, తమాషాలు తీర్చుకోవచ్చు. మనసు కలిపి ఉంటే నీకు రొట్టె విరిగి నేతిలో పడ్డట్టవుతుంది. చూస్తావు కదూ. నీకెంత అదృష్టం పడుతుందో? నేను చెప్పేదేమిటి. నీకే తెలుస్తుంది. తర్వాత ఏమంటావు. వస్తే రా మరి. తీసుకు వెళతాను. (అని అతడు లేస్తాడు. అతని వెంట వినోదిని కూడా బయలుదేరుతుంది.)

[తెర వాలుతుంది.]

# ద్వితీయాంకం — మూడో రంగం

[పట్నంలో రాజవీధి. వీధిపక్క లక్షాధికారి నివాసభవనం. ఎదురుగా ఉన్న ముఖ ద్వారంనుంచి ముస్తాబైన స్త్రీలూ పురుషులూ లోపలికి బయటికి వస్తూపోతూ ఉంటారు. ద్వారంలోపలికి వెళ్లగానే కుడిపక్కా ఎడంపక్కా వరసలు వరసలుగావేసిన విరు గుడుచేవకుర్చీలు. ఎలక్ట్రిక్ దీపాల వెలుగులో మిలమిల మెరుస్తూంటాయి. లోగిట్లోనుంచి సన్నాయి వాద్యం. మందస్వరంలో వినవస్తూ ఉంటుంది. దేశీయసంగీతం వెల్లివి తానంతో సాగుతుంటుంది కలకల్లాదే ముఖాలతో యువ తులు సీతాకోకచిలకల్లాగా గుమ్మంలోపలనుంచి ఆడుతూపాడుతూ వస్తుం టారు. ద్వారంముందు ఇంటి యజమాని కొందరు సభ్యులతోకలిసి నిల్చొని ఆదరంగా అభ్యాగతులను 'రండి, దయచేయండి' అని లోపలికి ఆహ్వా నిస్తూ ఉంటాడు. ఆయన పక్కన పదిపన్నెండేండ్ల చక్కని ఆడ పిల్ల కొన్ని పూలదండలు చేత్తోపట్టుకొని నిల్చొనుంటుంది. (ఇదంతా రంగ స్థలం కుడివైపున జరిగేసంగతి ఎడంవైపున చెత్తకుండీ సగం మాత్రం కనబడు తుంది. దాంట్లో పోగుపడిఉన్న ఎంగిలాకుల్లో తినుబండారాలు ఏవైనా దొరుకుతాయేమోనని, గెలికి చూస్తూ కుంటూ రాధికా ఉంటారు. మసక వెలుతురులో వాళ్ళెవరూ స్పష్టంగా కనబడుతుండరు. ప్రధాను మాత్రం స్పష్టంగా కన బడుతూ గుమ్మానికి కొంచెందూరాన నిల్చుంది భవనంకేసి చేయెత్తి "అమ్మల్లారా ఒకముద్ద బాబుల్లారా మాదాక వళం" అని ప్రాధేయపడుతుంటాడు చెత్తకుండీ పక్కన మధ్య మధ్య కుక్కలు మొరగడం వినబడు తుంటుంది హఠాత్తుగ చెత్తకుండీ దగ్గర ఒక కుక్క గట్టిగామొరిగి కుంటి మీద దూకుతుంది. కుక్క కరి చిన గాయం నుంచి నెత్తురు కారుతున్న చేయి గట్టిగా మరోచేత్తో నొక్కిపట్టుకొని బాగా వెలు తురున్న చోటికి వస్తాడు. రెండు వైపుల దృశ్యము స్పష్టంగాకనబడటానికి కావలసి నంత వెలుగు సాయం ముఖ్యంగా ఉండాలి.]

ఇంటి యజమాని: (మంచి దుస్తులువేసుకొని వస్తున్న పురానామనిషి మెడలో పూలదండవేసి సాదరంగా) రండి! దయచేయండి! మీకోసమే చూస్తున్నాను. పదండి లోపలికి. (మరిద్దరు పెద్ద పురానామనుషులు ప్రతినమస్కారంచేసే లోపలికి వెళ్లారు.)

ఒకటో పెద్దమనిషి: (రెండో ఆతడితో) అసలు సంగతి ఏమిటో తెలుసా? దబ్బు! దబ్బుంటే! అది ఉంటే పిల్లి సమర్తకు బ్యాండుమేళం పెట్టొచ్చు. బెంగాలీ వర్తకులకు దబ్బెక్కడిదిలెండి! వ్యాపారస్థుల వైభవమూ దర్జా చూడాలంటే బొంబాయి వెళ్ళాలి. అహమ్మదాబాదు వెళ్ళాలి. వాళ్లు కలియుగ కుబేరులుకదండీ. పెంపుడుకుక్కకు పెండ్లి చేసి వేలు వెచ్చిస్తారు. (ఇంటి యజమానిని చూపి నవ్వుతూ) ఆలస్యంచేశానా ఏం?

ఇంటి యజమాని: రండీ. రండీ. మీకోసమే చూస్తున్నాం. ముఖర్జీ ఏడీ? నిర్మలబాబు రావడంలేదా?

రెండో పెద్దమనిషి; వచ్చారు. వచ్చారు. అందరూ వచ్చారు. (వెనక్కు తిరిగిచూసి) ఇంకా వెనకనే ఉన్నారేమిటి? ఏయ్ ముఖర్జీ? నిర్మలబాబూ?

మూడో పెద్దమనిషి: అరే! సాక్షాత్తు పెదబాబుగారే ఎదురుకోలిస్తున్నారే? (పెద్దగా నవ్వు)

[తెరలో "అమ్మా ఒకముద్ద పడెయ్యండి బాబూ. ఒక కవళంపెట్టండి" అనే కేకలు.]

నిర్మలబాబు: (ప్రవేశించి దగ్గరికివెళ్ళి) ఇదుగో అన్నగారు!

రెండో పెద్దమనిషి: అదుగోనయ్యా! మీ నిర్మలబాబుగారు వచ్చారు! రండి! దయచేయండి.

మూడో పెద్దమనిషి: బజారంతా బ్లాకొటు. రాకపోకలు మహాకష్టంగా ఉంది ఇంకా.....

ఇంటి యజమాని: మరి చెప్పకండి భాయీ? ఈ బ్లాకొటొకటి పైగా కరువు కాలం ఒకటి. ఇది మా దురదృష్టం. అంతా హడావుడి అయినా తేలిగ్గానే జరుగుతున్నది శుభకార్యం.

రెండో పెద్దమనిషి : అయితే ఎంత మందిని పిలిచారేమిటి?

ఇంటి యజమాని : దాదాపు వెయ్యి మందిదాకా ఉంటారు. ఎంత ప్రయత్నించినా అంతకు తగ్గించడానికి వీల్లేకపోయింది.

మూడో పెద్దమనిషి : అబ్బో! వెయ్యిమందే? ఏభైమందికి మించి విందు చేయగూడదనే భారత రక్షా విధానం ఒకటి ఉందికదా? దాన్ని అతిక్రమించి నట్లవుతుందేమో?

ఇంటియజమాని : ఉండంటే ఉంది! విధానమూ ఉంది. చట్టమూ ఉంది. చట్టంలో తప్పించుకోవడానికి అవకాశమూ ఉంది. (నవ్వి) ఇక్కడ మాకున్న బంధువులూ మిత్రులూ అయిదువందల మందికి తక్కువ ఉండరు. ఇంకా ఎన్నో మొగమాటాలుంటాయి. ఎవరిని పిలవకుండా మానతాం చెప్పండి?

[తెరలో ముద్ద పడేయండి. ఒక ముద్ద పెట్టండి అనే కేకలు]

రెండో పెద్దమనిషి : అదీ నిజమే. అయినా ఇదొక పెద్దవిషయం కాదనుకోండి. గడచిన ఏప్రెల్లో మనమరాలికి అన్నప్రాశన జరిగింది. అదేమీ పెళ్ళిలాంటి శుభకార్యమేమీ కాదు. అయినా ఎంత క్లుప్తంగా చేయాలన్నా ఎనిమిదివందల మందికి పైగానే పిలవవలసి వచ్చింది. ఏమీ తగ్గించలేకపోయాం. మీ తాహతును బట్టి ఇదికూడా పెండ్లిలాటి ఘనకార్యమే అనుకోవాలి.

నిర్మలబాబు : అయితే ఇది చాలా పెద్దెత్తుగా చేస్తున్నారన్నమాట? రాయ మహాశయా? ఇప్పటి మార్కెట్టునుబట్టి వెయ్యిమందికి విందుచేయడమంటే సామాన్యమైన పనికాదు.

రెండవ పెద్దమనిషి : అర్థబలమూ అంగబలమూ ఉన్నవాళ్ళకు అసాధ్యమనేదిలేదు.

నిర్మలబాబు : అయితే కావలసిన పదార్థాలు సమకూర్చడానికి మీరేమీ ఇబ్బందిపడలేదా?

ఇంటి యజమాని : ఇబ్బందికేముంది? చీకటిబజారుందికదా? అది ఉన్నంత వరకు దేనికీ ఇబ్బందుండదు.

రెండో పెద్దమనిషి : అవును. ఏంచేస్తాం మనం! నిజం చెప్పవలసివస్తే చీకటిబజార్లో ఏ పదార్థానికీ లోటులేదు. కావలసినంత దొరుకుతుంది. అందాకా ఎందుకు? మామూలు పంచదారసంగతి చూడండి. సంసారానికి నెలకు రెండు మళ్ళన్నర పంచదార ఉండితీరాలని ఇంటావిడ ఖచ్చితంగా చెపుతుంది. లేకుంటే ఇంట్లో దెబ్బలు. కంప్లీటు దెబ్బలు. అంత పంచదార మీ కిప్పుడు పబ్లిక్ మార్కెట్టులో దొరుకుతుందా? ఏ దుకాణానికివెళ్ళినా లేదులేదు అంటూ మొండిచేయి చూపిస్తారు. ఏంచేస్తామప్పుడు? కాబట్టి నిలవదార్లుండాలి, చీకటిబజార్లుండాలి. కాకుంటే నాలుగు రెట్లు ఖరీదు ఎక్కువ తీసుకొంటారంతే! ఎంతకావాలన్నా వస్తువుమాత్రం దొరుకుతుంది. డబ్బు మనతోరాదు. వస్తువులేకుంటే పని జరగదు. ఖరీదెంత ఎక్కువైనా కొనక ఏం చేస్తాం?

నిర్మలబాబు : ఆమాట డబ్బున్నవాళ్ళు మాత్రమే అనగలరు. అసలు సమస్య ఏమిటంటే ప్రజల్లో చాలా భాగం డబ్బులేనివాళ్ళేగదా? మరి వాళ్ళ మాటేమిటి?

[తెరలో "ఆకలి. ఆకలి. అమ్మా అన్నం పెట్టండి. అయ్యా అన్నం పెట్టండి" అని కేకలు]

రెండవ పెద్దమనిషి : చూడండి నిర్మలబాబూ అటువంటి సమస్యలన్నీ నెత్తిన పెట్టుకొంటే మనం కుంగిపోతాం. ప్రతిరోజూ ఇరవైనాలుగు గంటలూ, రాత్రనక పగలనక లోకంలో ఎన్నో అన్యాయాలూ అత్యాచారాలూ విధీ విరామం లేకుండా జరుగుతూనే ఉన్నాయి. వాటన్నిటికీ విరుద్ధంగా నిలబడాలంటే మన వ్యాపారం, మనవృత్తి, మన పనిపాటులన్నీ కట్టిపెట్టుకోవలసి వస్తుంది.

నిర్మలబాబు : అవును. వదులుకోవాలసివస్తే వదులుకోవాలి. అన్యాయాని కెప్పుడూ చోటీయ్యవద్దని మనపెద్దలన్నారు. పెద్దలేకాదు, సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానులు కౌరవసభలో ధృతరాష్ట్రుడితో 'సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే పారము పొందలేక చెడబారిన యద్దురవస్థ దక్షు లెవ్వార లుపేక్షసేతు రది వారల చేటగు ... ...అని సెలవిచ్చారు గదండీ?

మూడో పెద్దమనిషి : అయితే మంచిదే కానీయండి. వ్యాపారం గీపారం అంతా కట్టేద్దాం (అని నవ్వుతూ) నిర్మలబాబూ? మీరు మొత్తం భలే తమాషాగా మాట్లాడతారే! (అందరూ నవ్వుతారు.)

ఇంటి యజమాని : ఆలస్యమెందుకు? పదండి లోపలికి వెళదాం. (అందరూ వెళ్ళిపోతారు.)

[వెంటనే రంగంమీద చెత్తకుండీవైపు స్పష్టంగా కనబడేటట్లు బాగా లైటు వెలుగుతుంది. కుక్క అరుస్తూ ఎవరిమీదనో దూకి కరచినట్లు 'అమ్మ బాబోయ్' అనే గావుకేక వినవస్తుంది. కుంజ వెంటనే కుక్క కరిచిన చేయి పైకెత్తిపట్టుకొని వెలుగున్న చోటికి వచ్చి కనబడతాడు.]

ప్రధాను : (చీకట్లోనుంచే) అమ్మల్లారా! రెండు మెతుకులు పడెయ్యండి. బాబుల్లారా ఒక ముద్ద!

రాధిక : అమ్మో! పిచ్చికుక్క కరిచేసింది బాబోయ్! (అని కుండీవైపునుండి కుంజ ఉన్నవైపు పరుగెత్తి వస్తుంది.)

రాధిక : పెద్ద పిచ్చికుక్కే కరిచిందే దేవుడా! చాలా గట్టిగా కరిచింది. దీని ముఖం మండ! అయ్యయ్యో! నాకేందారి దేముడా? (కుక్కకేసి చూసి థూ థూ అని ఉమ్మేస్తూ) ఛీ పాడుకుక్కా! ఫో. నీదుంపతెగ! నీ నోట్లో దుమ్ము పడ. చీపురుతో కొడతానుచూడు! చూస్తావేం! పిచ్చివెధవ కుక్కను కొట్టండి.

[తెరలో కుక్క మొరుగుతుంది.]

రాధి : (కట్టుకొన్న గుడ్డచించి ఒక పీలికతీసి కుంజచేతికి కట్టుకడుతుంది.)

ప్రధాను : పట్టి లంగోటీమాత్రం కట్టుకొని భవనంవైపుకు చెయ్యిసాచి అరుస్తూ) రెండు మెతుకులకోసం ఎంతసేపటినుంచో గొంతు పగిలేట్టు మొరపెడుతున్నా మాగోడు వినిపించుకోరు బాబుల్లారా! మీకు చెముడొచ్చిందా? మీగుండె రాయైపోయిందా? రెండు రోజులనుంచి ఆకలితో మాడిపోతున్న ఈ ముసలాడికి

రెండు మెతుకులు పడేసే ధర్మాత్ములెవ్వరైనా మీలో లేరా? ఎంతో అన్నం రోడ్డుమీద వెదజల్లిపారేస్తున్నారే! ఒక్కముద్ద, రెండు మెతుకులు ఆకలితో మాడి పోతున్న ఈ దిక్కులేని పేదముసలాడికి పడేస్తే ఏం? మీకు జాలిలేదా? హృదయం లేదా? కళ్లున్నా మీకు పేదలు కనబడడంలేదా? బాబుల్లారా! డబ్బున్నవాళ్ళకు పేదల మొర వినబడుతుందా? దేవుడా! నీవూ ఆలకించలేదు మామొర అయ్యో! ఆకలి! రెండురోజులనుంచి పస్తు. ఆహా, ఏం పుణ్యం! ఏంలోకం!

రాధిక: (కుంజ చేతికట్టు చూస్తూ) బాధపెడుతున్నదా ఎక్కువగా? కాపివి నీళ్లైనా తెప్పిస్తాను తాగడానికి?

కుంజ: ఊహూ! వద్దు. (అని రాధికకేసి చూస్తాడు. ఏదో జ్ఞాపకంవచ్చి కన్నీరు కారుస్తూ రెప్పవెయ్యకుండా రాధికకేసి జాలిగా చూస్తూ ఆమె తలమీద చెయ్యి వేస్తాడు.)

[ తెరవాలుతుంది. ]

# ద్వితీయాంకం — నాల్గవ రంగం

[హారూదత్తు ఇల్లు, పగటివేళ, వరండాలో బల్లమీద కూర్చొని, హుక్కా తాగుతుంటాడు. ఆ వరండాలోనే ఒకమూల పల్లెపడుచులు ముగ్గురు, ఒంటినిండా బట్టకప్పుకొని కూర్చుంటారు. ఇద్దరు వెనక్కితిరిగి కూర్చుంటారు. ఒకామె మాత్రం హారూదత్తుకు ఎదురుగా కూర్చొని, దాక్షిణ్యంగా మాట్లాడుతుంటుంది. ఆమె చిన్నప్పుడే భర్తపోయిన బ్రాహ్మణ వితంతువు. పేరు ఖుకీర్మా. వయస్సు మీరిన పల్లెటూరి వాడొకడు ముంగిట్లో కూర్చొని ఉంటాడు. ]

హారూదత్తు: (హుక్కా ఒకపీల్పు పీల్చి) గ్రామం కోసం నేను ఏమి చేశానో, ఏమిచేయలేదో ప్రజలకు తెలుసు. మరి (పైకి చూపి) భగవంతుడికి తెలుసు. ఎక్కువగా చెప్పుకోవడం ఎందుకు? ఆత్మస్తుతిచేసుకోవడం నాకెప్పుడూ అలవాటు లేదు.

ఖతీర్మా : అది తమరు చెప్పాలా బాబూ! మాకంతా తెలుసు. (పక్కనున్న పెద్దవాడితో) చూడు చందర్! అప్పుడొకమాటు ఖకీకి చాలా జబ్బుచేసింది. ఎప్పటి మాటో చెపుతున్నాను. గడిచిన కార్తికమాసంలో అనుకుంటా. అప్పుడే వెదురు పిడిలోంచి పది వెదుళ్ళు సీద్వారా అమ్మేశాను.

చందర్ : పదికాదమ్మా! ఎనిమిదేను.

ఖతీర్మా : ఎనిమిదికాదు! పదిబాబూ. ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం ఉంది. పదివెదుళ్లూ మీకు మూడురూపాయల రెండణాలకు అమ్మేను. మీరు అప్పుడు నాకు మూడురూపాయలే యిచ్చి చిల్లరలేదని రెండు అణాలు బాకీ పెట్టేరు. తర్వాత మీరు నా దగ్గర ఐదుకుంచాల ధాన్యం కొని ఆ రెండణాలు చెల్లిపెట్టారు. జ్ఞాపకం వచ్చిందా మీకు?

చందర్ : ఔనౌను, అది నిజమే. నేనే పొరబడ్డాను (అని నవ్వుతాడు.)

హారూదత్తు : (నోటినుంచి హుక్కాతీసి) జడ్జీ కోర్టులో ప్లీడరుగా ఉండ వలసినదానవు నువ్వు ఖతీర్మా!

ఖతీర్మా : (నవ్వి) ఈకాలంలో ఆడపిల్లలు, మీరు చెప్పినట్లే వ్రాతకోతలు నేర్చుకొని, అన్ని విషయాల్లో మొగవాళ్ళకు పోటీగా ఆఫీసుల్లో, కచేరీల్లో పని చేస్తున్నారుకాదా బాబూ. అటువంటి చదువూ, దీక్ష మీ ఆశీర్వాదంవల్ల నాకూఉంచే, నేనూ వకీళ్ళ తల తిరిగేటట్టు చేసి ఉందేదాన్ని.

హారూదత్తు : అంతపనీ చేయగల నెరజాణవే నువ్వు. (మారం నించే చేత్తో వీపుమీద తడతాడు.)

ఖకీ : ఆ పోనిద్దురూ? ఏదో చెప్తున్నా మీకు? ఆ జ్ఞాపకం వచ్చింది. ఖకీకి జబ్బుచేసినప్పటి సంగతి. రెండు రోజులు ఆడపిల్లపడ్డ అవస్థ చూడలేక ఏమిచేయాలో తోచక నాకు మతిపోయింది. వెంటనే రామనాధ డాక్టరు దగ్గరికి పరుగెత్తి "బాబూ, డాక్టరుగారూ! ఒక్కసారి వచ్చి నా పిల్లను చూడండి. చాలా భయంగా ఉంది. ఇదే చివరిసారి. మీరు గనుక ఒక్కమాటు వచ్చి ఏదైనా మందో మాకో చెపితే పిల్ల బతుకుతుంది. మీ కాళ్లు పట్టుకొంటాను. నా మొర ఆలకించండి బాబూ!" అని ఎంతో బతిమిలాడాను. దబ్బుతే అన్నా డాయన.

"ఇప్పుడు డబ్బు ఇయ్యలేను. నా దగ్గర పైసాలేదు. రేపో ఎల్లుండో యిస్తాను తప్పక. పిల్లను బతికించండి బాబూ! మీకు పున్నెముంటుంది బాబూ!" అని ఎంతో బతిమిలాడాను. నపేసిరా అన్నాడాయన. దోపిడీ దొంగలు కాని వీళ్ళకు దయా దాక్షిణ్యాలుంటాయా బాబూ! అప్పు డిక ఏమిచేయడమూ, ఎక్కడికెళ్ళడమా అని ఆలోచించాను. చటుక్కున బాబుగారిమాట జ్ఞాపకం వచ్చింది. పరుగెత్తి మీదగ్గరకు వచ్చి పడ్డాను. మొఖమెదుట చెప్తున్నాను కాబట్టి ఈముందర గొప్పచేసి పొగుడు తున్నదనుకోవచ్చు తమరు. మీ పాదాలముట్టి చెపుతున్నాను. నేనేమి అతగాలేదు పెట్టాలేదు. ఇందులో వీసమంతయినా అబద్ధం లేదు. అది అంతర్యామికే తెలుసు. నా ముఖంచూసి తమరు అంతా గ్రహించారు. లోపలికెళ్ళారు. మందు ఏదో తెచ్చి నా చేతికిచ్చారు. ఆ మందు వాడాను. చచ్చిపోతుందనుకొన్నపిల్ల మూడురోజుల్లో తేరుకొని బతికి బయటపడ్డది. అంతేకాదు, పథ్యంపెట్టే రోజున స్వయంగా మా యింటికొచ్చి "ఖదీర్మా! పథ్యంపెట్టడానికి పాతబియ్యం తెచ్చాను. ఇటువంటివి మీ ఇళ్ళల్లో ఉండవు. ఇవి వండి బిడ్డకి పథ్యంపెట్టు. ఇవి దగ్గర దగ్గర రెండు శేర్లుంటాయి. ఖరీదుకేమిటీ, ఎంతపెట్టినా దొరకనివి ఇవి అని ఇచ్చారు. ఇట్లాంటి అవాంతరం ఏదొచ్చి వెళ్ళినా బాబుగారు 'లేదు' అనే మాట ఎప్పుడూ అనలేదు. నాకే కాదు ఎవరొచ్చినా, ఎప్పుడొచ్చినా, ఎందుకొచ్చినా మీరేంచేసేవారో, ఏం చెయ్యరో మీరు చెప్పాలా బాబూ: మేము ఎరగమా? బాబూ?

హరూదత్తు: అదేంకాదూ! నీకు ఆపద వచ్చినప్పుడు నేను చూస్తే, నాకు ఆపద వచ్చినప్పుడు నీవు చూస్తావు. అట్లా కాకుంటే లోకం ఎట్లా సాగుతుంది. ఏమంటావు చందర్?

చందర్: కాదని ఎవరనగలరు బాబూ! తమరన్నదంతా యదార్థం.

హరూదత్తు: ఇప్పుడు మిమ్మల్నందర్నీ పట్నంతీసుకపోవడం ఎందుకు నాకు? ఇంత శ్రమపడవలసిన అవసరం నాకేమిటీ? తిండిదొరకక ఈ ఆడపిల్ల లందరూ నిష్కారణంగా చచ్చిపోవడం ఈ కళ్ళతో చూడలేక దాచుకొన్న డబ్బు ఖర్చుపెట్టి, దానికి నచ్చచెప్పి దీనికి నచ్చచెప్పి కరువుకాలం తీరిందాకా పట్నంలో సుఖంగా బతుకుతారని కాకపోతే ఇంట్లోతిని అడివిలో దున్నలను మేపినట్లు ఈ

ప్రయత్నమంతా నాకెందుకు ? ఇందులో నా స్వలాభం ఏమైనా ఉన్నదంటావా ? నీవే చెప్పు?

చందర్ : ఉందని ఎవరనగలరు బాబూ!

హారూదత్తు : మాటవరసకు చెపుతున్నాను. మనుషులందరూ మరి నీలాటి నాలాటివాళ్లు కారు. లోకంలో చెడ్డవాళ్లూ ఉన్నారు. లేరని చెప్పగలవా నువ్వు ? మనుషులనోళ్లు మూయడానికి మూకుడు ఉందా? మెల్లి మెల్లిగా తోకాడిస్తూనే పెద్ద పులి మనిషిని చంపుతుంది. వద్దూ అనగలవా నువ్వు. అనకుంటే పరోపకారం ఏమిటికి? పరోపకారం ఎవరు చెయ్యమన్నారు నిన్ను? అని అంటావా? మనుషులందరూ అటువంటివాళ్ళే అయితే సమాజం ఈ సంసారం సర్వం ఎప్పుడో ధ్వంసం అయిపోతుంది.

చందర్ : (ఆశ్చర్యంతో హారూదత్తుకేసి చూసి) ధ్వంసం అయిపోతుందా అంతా ?

హారూదత్తు : కాదంటావా మరి (ఖుఖీర్మాకేసి చూస్తాడు.)

ఖుఖీర్మా : ఊహు (నవ్వి తలాడిస్తుంది.)

హారూదత్తు : అదేమీకాదు. అంతా చెడ్డవాళ్లుగారు. మంచివాళ్ళూ లోకంలో ఉన్నారు. వాళ్లే ఈ లోకాన్ని నడుపుతున్నారు. తెలియచెప్పేందుకు, తెలుసుకోవడానికి ఈ జగత్తులో ఎన్నో ఉన్నాయి. కానీ యిదిగో, యిట్లారా, ఈ కాగితంమీద వేలిముద్రవేసి సంతకంపెట్టి వెళ్లు.

చందర్ : మళ్ళా వేలిముద్రవేయడం ఎందుకు ?

హారూదత్తు : మనిషి నోటిమాటకు విలువలేదని తెలుసుకో. మాటకు విలువ దొర్తిగాలేదు. మాట గాలిలో కలిసిపోతుంది. అందుకే అంతా కలంతో కాగితం మీద వ్రాతమూలకంగా జరగాలి. ఒకమాటు కాగితంమీద పెట్టేవా, అది చిరకాలం నిలిచిపోతుంది. ఇదిగో వ్రాతమూలం. తీసికొని వేలిముద్రవేసి యివ్వు. మళ్ళా ఈ విషయంలో నాకు .. ....(చందర్ లేచివచ్చి దత్తు యిచ్చిన కాగితంమీద వేలి ముద్రవేసి తిరిగి యిస్తాడు.)) బొటనవేలు బాగా నొక్కావా? సరే, వెళ్ళు. దీనివల్ల

వచ్చేదేమీలేదు. పోయిందేమీలేదు. (అని వేలుముద్రవేసిన కాగితం ఒకమాటు చూసి) నీ పని అయిపోయింది. ఇక వెళ్ళవచ్చు నువ్వు.

చందర్ : (ఆతురతతో) నా బిడ్డను ఎట్లా చూస్తారో బాబూ.

హారూదత్తు : చెప్పక్కరలేదు. దాని బాధ్యత అంతా నామీద వేసుకొన్న తర్వాత నువ్వు చెప్పాల్సిందేముంటుంది.

చందర్ : అదికాదు బాబూ. దాని మూడోఏట తల్లి చచ్చిపోయింది. అప్పట్నించీ ఒక్క మోస్తరుగా (కళ్ళు తుడుచుకొంటూ) కళ్ళల్లోపెట్టుకొని నేనే పెంచి పెద్దదాన్ని చేశాను. ఆ గర్వం నాకిక ఏమీలేదు కదా ! (ఏడుస్తాడు.)

హారూదత్తు : మళ్ళా నువ్వు బిడ్డకోసం ఏడుస్తున్నావా? అమ్మాయి నీ కూతురే కాని నా కూతురుకాదు.

ఖుకీర్మా : (చందర్‌తో) ఎందుకు దుఃఖపడతావు. నీపిల్లకేమీ లోటురాదు. బాబుగారిదగ్గిర కులాసాగా ఉంటుంది.

హారూదత్తు : ఏయ్. ఎవడ్రా అక్కడ ?

[నేపథ్యంలో 'వస్తున్నా బాబూ' అని వినపడుతుంది.]

చందర్ : మాత. విన్ను సర్వనాశనం చేశాను. బాబువెంట వెళ్ళు పడవ రేవుకొచ్చిందేమో.

సేవకుడు : (ప్రవేశించి) సరుకులన్నీ పడవకెక్కించనా బాబూ ?

హారూదత్తు : ఎక్కించాలి. ఎప్పుడనగానో వెళ్లావు. ఇంతసేపు ఏం చేస్తున్నావు ?

సేవకుడు : పడవను రేవులోకి తీసుకురావడానికి వెళ్ళాను.

హారూదత్తు : వెళ్ళావు మమ్మల్ని ఉద్ధరించావు ! మూర్ఖుడా. నావను రేవులోకి తీసుకురావడానికింతసేపు పడుతుంది. ఇక్కణ్ణుంచి రేవుకు వెళ్ళడానికి ఎన్నాళ్ళ ప్రయాణం ? కళ్లు నెత్తికొచ్చినాయా? వెధవా? ఎదురుగా నిల్చోని ఇంకా వాదిస్తు

న్నావా. ఎక్కడ దొరికావురా? నీచపువెధవా? ఒక్క రోజులో నావ అక్కడికి చేరకపోతే అప్పుడు చూస్తాను నీ సంగతి.

సేవకుడు: పోటు తగ్గిపోయి నావ మెరకపట్టింది. లాక్కురావాల్సివచ్చింది.

హారూదత్తు: నీ ముఖం ఎవరికి చూపించాలని యిక్కడింకా నిల్చుంటావు· వెళ్లు, వెళ్లు. (సేవకుడు వెళ్ళబోతాడు) ఏయ్ నరంగూ! మాట పూర్తిగా వినిపో. మూడు తెడ్లు వెయ్యమని చెప్పు.

సేవకుడు: పోటు తగిలింది మళ్ళి, రెండు తెడ్లువేస్తే చాలు బాబుగారూ!

హారూదత్తు: మరి తొయ్యవలసిన అవసరం రాకూడదు. మూడు తెడ్లూ వెయ్యమని చెప్పు. అబ్బబ్బ! (అని హుక్కా చేతపట్టుకొని లేచి ఆడవాళ్ళతో మెల్లిగా) మీరందరూ ముందు నడుస్తూండండి. ఖఫీర్మా! వాళ్ళందరినీ పడవదగ్గరకు తీసుకు వెళ్లు.

[ఆడవాళ్ళందరూ వెళ్ళిపోతారు.]

హారూదత్తు: అయితే చందర్, నీవు ఇక వెళ్ళిపోదువుగాని (అని జేబు లోని గుడ్డమూటవిప్పి నోట్లుతీసి లెక్కపెట్టిస్తాడు.) తీసుకో, (వెనకాడుతూ చందర్ నోట్లు తీసుకొంటాడు.) ఇప్పటికింతే ఇచ్చాను, తీసుకో, నేను మళ్ళావస్తాను. అప్పుడు నీకియ్యవలిసింది పూర్తిగా ఇచ్చేస్తాను.)

చందర్: (ఏడుస్తూ) నేను కన్నబిడ్డనమ్ముకున్నాను, అయ్యో! ఖర్మమా! నా తల్లీ! నా మాతీ! నా మాతంగినీ! నిన్ను దిక్కుమాలి అమ్ముకున్నానే నా తల్లీ! (అని వెళ్ళిపోతుంటాడు. హారూదత్తు పీటమీద కూలబడి హుక్కా పొగపీలుస్తూ అరమూతకళ్ళతో చందర్ కేసి చూస్తూంటాడు.)

[తెర వాలుతుంది.]

# ద్వితీయాంకం — అయిదో రంగం

[సేవాశ్రమంలో ఒక గది. కిటికీచువ్వ పట్టుకొని వినోదిని మాట్లాడక చూస్తూంటుంది. నిరంజను గదినడుమ తలవంచుకొని నేలపై చూస్తూ ఎవరిమీదనో కోపంతో రుసరుసలాడుతూ ఉంటాడు. అతడి కళ్ళల్లో ముఖంలో ఏదో కసి ద్యోతకమవుతూ వుంటుంది. వినోదిని సగంమాసిన ముతకచీర కట్టుకొని ఉంటుంది. నిరంజను పొట్టిచేతుల చొక్కా, మాసిన నాలుగుమూరల పంచ కట్టుకొని ఉంటాడు. కాళ్ళకు చెప్పులు ఉండవు. ఏ విషయంలోనో ఇద్దరికీ రాటీ కుదరక బాధ పడుతున్నట్లు కనబడుతుంటారు.]

వినోదిని: (తటాలున వెనక్కు తిరిగి కలవరంతో) పట్టినే ఏమిటిది? నేను ఇక్కడ పడుతున్న యాతన మాటలతో నీకు తెలియజేయలేక పోతున్నాను.

నిరంజను: (తన అరచేతిలో పిడికిడితో ఒక గుద్దుగుద్ది) అందుకు కసి తీర్చుకొని తీరతాను. (అని వగురుస్తూ) సరేకానీ!

వినోదిని: (గొంతు తగ్గించి) మాఖన్ చచ్చిపోయాడు. అక్క జబ్బు పడింది. మీ అన్న పిచ్చివాడులాగు అక్కడా అక్కడా తిరుగుతున్నాడు.

నిరంజను: (నిట్టూర్చి) అన్నయ్య!

వినోదిని: ఉక్కరిబిక్కిరి పిచ్చిఎత్తి తెగతిరుగుతున్నాడు. మందా మాకా, పథ్యమా పానమా ఏముంది? ఇక మీ పెదనాన్నసంగతి చెప్పక్కర్లేదు పొద్దస్తమానం శ్రీపతీ భూపతీ అని కలవరిస్తూ ఉంటాడు. నాము పగపట్టినట్లు నాలుగు వైపుల భయం! మహమ్మారీ దేవత గాలియింద ఎక్కి పడుస్తూ విచ్చలవిడిగా తిరుగుతూ ఉన్నది. మనుషులు బయటికిరావడానికే హడలిపోతున్నారు. ఎవరిమాట ఎవరు వింటారు? మీ పెద్దనాన్న అడవులు వరికిస్తూ శ్రీపతి భూపతులను వెదికి పట్టుకొస్తానని వెళ్లిపోయాడు. అయిబూలేదు మోక్షంలేదు. ఈ దురవస్థకు తోడు గోరుచుట్టుమీద రోకటిపోటులాగా ఈ హారూదత్తు అత్యాచారం ఒకటివచ్చి పడింది. మరిచిపోదామన్నా మరిచిపోలేకపోతున్నాను. ఏంచెప్పను నా దురవస్థ!

నిరంజను: కూడదని వాడికి ఎదురుచెప్పే మొగవాళ్ళెవరూ ఊళ్ళో లేనే లేరా?

వినోదిని: లేకేం. ఉన్నారు. కాని ఎవరైనా వాడికి ఎదురుచెప్పడానికి సాహసిస్తే వాళ్ళ బ్రతుకంతా నాశనమైపోతుందని భయం.

నిరంజను: ఆ నాశనం ఇప్పుడు ఎవరికవుతుందో నేను చూస్తాను. (అని పచార్లు చేస్తుంటాడు.)

రాజీవు: (హఠాత్తుగా ప్రవేశించి) ఏయ్ రాఖహరీ! ఇంట్లో దూరి గుసగుసలాడేపని నీకేముందిక్కడ? ఇంత ధైర్యంగా పట్టపగలే ఇక్కడికిరావడం చిత్రంగా ఉందే! రహస్యాలు ఇంకా పూర్తికాలేదా? ఏదో పన్నాగం పన్నడానికి తయారవుతున్నట్లున్నావు (తటాల్న వినోదినిని చూసి) ఇదేమిటి? నీవు ఎందుకు వచ్చావిక్కడికి? నీకేంపని? వెళ్లు. బాబుగారికి తెలిస్తే ఏంచేస్తారో తెలుసా? వెళ్లూ లోపలికి! నీకే వెళ్ళమని చెపుతున్నాను. వెళ్ళిపో లోపలికి! (తల వంచుకొని వినోదిని వెళ్ళిపోతుంది.)

నిరంజను: నేను చాటుగా లోపలికి వచ్చానా?

రాజీవు: నీకే అది బాగా తెలుసు నన్నడుగుతావెందుకు? మూఢుడా? ఆమెతో నీవేం మాట్లాడుతున్నావు. రహస్యంగా? ఆమె నిన్ను గుర్తుపట్టలేదనుకుంటాను. ఫూల్ నీ ప్రేమకలాపానికి మరోచోటు దొరకలేదా!

నిరంజను: శకునపక్షిలాగు ఊరికే వాగకు. మరొక సంగతి ఏదో మాట్లాడుతున్నాం మేము.

రాజీవు: (భుజా లెగురవేసి) ఏమిటి! ఏమన్నావ్! శకునపక్షిలాగ అరుస్తున్నానా నేను? ఓరి చెవుల పిల్లివెధవా! నీ గూడుపుఠాణీ అంతా బయటపెడతాను చూడు. (వెనక్కు తిరిగి) సింహం నోటికండ నక్కపాలు చేయాలనుకుంటున్నావా? బాబుగారికి తెలిస్తే నిన్నేం చేస్తాడో తెలుసా? నీ మొండిధైర్యానికి మెచ్చుకోవాలిరా కృతఘ్నుడా.

[ త్వర త్వరగా కాశీధన్ ప్రవేశిస్తాడు. ]

కాశీ : గుమాస్తాగారూ! మీరు వెళ్ళకండి. ఆగండి. రాఖహారీ! నీవూ వెళ్లవద్దు. ఆగు. (గుమాస్తాకేసి చూసి) జ్ఞానదా దగ్గర నేను కొంత కొంత విన్నాను. అసలు సంగతి అంతా మీ రిప్పుడు నాకు చెప్పాలి. నా దగ్గర ఏమీ దాచొద్దు. చెప్పండి.

రాజీవు : ఓయ్ రాఖహారీ! పొద్దుట్నుంచీ ఏం జరిగిందో అయ్యగారడుగు తున్నారు చెప్పు జవాబు.

కాశీ : (నిరంజనుతో) ఇది సేవాశ్రమమని నీకు తెలుసా ?

రాజీవు : మొదట్నించీ నేను ఈ అలగా జనాన్ని దగ్గరకు చేరనివ్వవద్దని చెబుతూనే ఉన్నాను. కానీ నా మాట వినిపించుకోలేదు. వినిపించుకునే స్థితిలో లేవు నువ్వు వీళ్ళేమయినా మనుషులా చెప్పు ?

[ నిరంజను రాజీవుకేసి కొర కొర చూస్తాడు. ]

కాశీ : (నిరంజనుతో) నీవు వెళ్ళిపో! ఈ క్షణమే ఇక్కణ్ణుంచి వెళ్ళిపో!! నీవంటి పనివాడు నా కవసరములేదు. (గట్టిగా గద్దిస్తూ) ఇక్కడనుంచి వెళ్ళిపో వెంటనే.

[నిరంజను వెళ్ళిపోతాడు. వేగంగా వినోదిని ప్రవేశిస్తుంది.]

వినోదిని : నేనూ వెళ్ళిపోతాను. ఇప్పుడే వెళ్ళిపోతాను. వదిలెయ్యండి నన్ను.

రాజీవు : (అడ్డం వచ్చి) అరే! ఇదేమిటిక్కడ? నీవు ఆడదానవు. నీవుండ వలసినచోటు లోగిల్లో. బయటికెందుకు వచ్చావు? లోపలకు వెళ్ళిపో. ఊ వెళ్ళిపో. తమాషా అనుకున్నావా ?

వినోదిని : నన్ను వదిలెయ్యండి. నేనూ వెళ్ళిపోతాను. వెళ్ళిపోనియ్యండి నన్ను.

కాశీ : జ్ఞానదా? ఓజ్ఞానదా? (పిలవగానే వస్తుంది. చేత్తో సైగచేస్తూ) ఈమెను లోపలికి తీసుకుపో.

జ్ఞానద : (వినోదిని చేయి పట్టుకొని) రా! ఇట్లా చెయ్యగూడదు, వెళ్ళి పోదాంపద. (జ్ఞానద వినోదినిని తీసుకుపోతుంది లోపలికి)

రాజీవు : (బయలుదేరబోతాడు.)

కాళీ : ఇదిగో గుమాస్తాగారూ! ఎలాగైనా సరే ఆమెకు రావల్సిన డబ్బు అణాపైసలతో లెఖ్ఖచూసి ఇచ్చి పంపించేయండి వెంటనే. ఇక ఇక్కడ ఒక్క క్షణమైనా ఆవిడ ఉండడానికి వీల్లేదు. ఇంట్లోవాళ్ళే విశ్వాసఘాతకులైతే .......

రాజీవు : ఈ నీచపువెధవలకు ఆశ్రయమివ్వవద్దని నేను నీకు ముందే చెప్పాను. నీవు నామాట లెక్కచెయ్యలేదు ఈ అలగాజనంతో ఏం వ్యవహారం జరిగింది నీకు? వీళ్ళేమయినా మనుషులా ఏమిటి? పత్తి పశువులు.

కాళీ : అదంతా మీ కనవసరం. నేను చెప్పినట్లు చేయండి. వెళ్ళండి.

రాజీవు : ఇదిగో! వెళుతున్నాను. నా కెందుకీ గోల! ఇప్పుడే వెళ్ళిపోతాను. హబ్బా.

కాళీ : సరే! అయితే ఇప్పుడే వెళ్ళిపొండి. వ్యాపారం ఏమైతే అది అవుతుంది. ఇళ్ళో! ఇవన్నీ తీరుబాటుగా ఒక టొకచే సర్దుకోవాలి. కావలసిందేదో అయింది. ఎవరినేమంటాం. (అని సోఫాలో చేరబడి) ఎవరా వస్తున్నది? (ఒక సేవకుడు ప్రవేశిస్తాడు.)

సేవకుడు : (సలాంచేసి) జీ! హుజూర్!

కాళీ : సరేగాని అక్కడ కూర్చొని మీరంతా ఏం చేస్తున్నారు? ఎంత పిలిచినా ఎవడూ పలకడేం?

సేవకుడు : పిలవగానే వచ్చాను హుజూర్!

కాళీ : వెంటనే వచ్చావా?

సేవకుడు : చిత్తం ప్రభూ!

కాళీ : నోర్ముయ్యి. మధ్యాహ్నం గేట్లో ఎవరున్నారు?

సేవకుడు : చిత్తం. నేనే ఉన్నాను.

కాళీ : రాఖహరీ ఇక్కడకు ఎప్పుడొచ్చాడు ?

సేవకుడు : పగలు పొద్దుండగానే వచ్చాడు.

కాళీ : పగటిపూటనే వచ్చాడా ?

సేవకుడు : చిత్తం.

కాళీ : సరే! ఇంకెప్పుడూ వాణ్ణి సేవాశ్రమంలోకి రానివ్వకూడదు. తెలిసిందా?

సేవ : చిత్తం. రానీయను.

కాళీ : చిత్తం గిత్తంకాదు. లోపలికి అడుగుపెట్టనీయవద్దు.

సేవ : చిత్తం తమ ఆజ్ఞప్రకారం చేస్తాను.

కాళీ : అంతేకాదు! నన్ను అడగకుండా ఎవరినీ లోపలికి రానీయొద్దు తెలిసిందా ?

సేవ : చిత్తం బాబూ !

కాళీ : రామరతన్‌బాబు రాగానే నా కొకమారు........

[ తెరలో గుర్రపుడెక్కల చప్పుడు. సేవకుడు ఆ వైపు చూస్తాడు ]

కాళీ : ఏమిటీ, ఆ వైపు చూస్తున్నావ్?

సేవ : చిత్తం. గుర్రబ్బండిమీద ఎవరో వచ్చినట్లుంది.

కాళీ : గుర్రబ్బండిమీదనా ?

సేవ : చిత్తం. (అని మళ్లీ ఒకసారి గుర్తుగా చూపి) బాగా గుర్తుకు రావడంలేదు. మూడు నాలుగు రోజులక్రితం పగటిపూటనే కోటూ, బూటూ వేసుకొని, ఎవరో బాబులాటి ఆయన వచ్చాడు. చూస్తే ఆయనగారిలాగే తోస్తున్నది. వెంట ఇంకా ఇద్దరు, (మళ్ళా బాగా చూపి) ఆ! ఆ ఇద్దరే! మరో ఇద్దరు ఆడంగులు కూడా ఉన్నారు.

కాళీ : (కంగారుగా లేవబోతూ) గుర్రబ్బండిమీదా? ఆతవాళ్ళు ఉన్నారా? ఇంకా ఎవరున్నారో వెళ్ళిచూడు తొందరగా.

[భయపడుతూ విరంజనా, వినోదిని ప్రవేశిస్తారు. సేవకునితో కూడా కాళీదన్ వెడతాడు]

వినోదిని : (మెల్లిగా) ఎవరువాళ్లు?

నిరంజను : (చూపుడువేలు నోటిమీద పెట్టుకొని) ఇస్స్! మాట్లాడకు. మన ఊరిదత్తు హారూదత్తు.

వినోదిని : హారూదత్తా? అమ్మబాబో? ఇక్కడికెందుకు దాపురించాడు?

నిరంజను : (మెల్లిగా) ఇక్కడి కాళీధను ఆయనకు పెట్టుబడి పెడుతుంటాడు. అందుచేత తరుచు ఇక్కడికి వస్తుంటాడు. కాని ఆ ఇద్దరు ఆడపిల్లలూ (ఆశ్చర్యంగా చూస్తాడు.)

వినోదిని : ఎవరు వాళ్లు?

నిరంజను : సరిగా గుర్తుకు రావడంలేదు. దూరాన్నుంచి చూస్తుంటే ఎక్కడో చూసిన మొఖాల్లాగా ఉంది. సరీగ్గా జ్ఞాపకం రావడంలేదు. దత్తుతో రావడాన్నిబట్టి మన ఊరువాళ్లే అయిఉంటారని తోస్తుంది. ఊహూ! వెధవ సమయానికి బాగా వచ్చాడు. ఈ దెబ్బతో అన్నీ బయటపడిపోతాయి.

వినోదిని : అయితే ఏం చేస్తావు?

నిరంజను : ఏమీ చెయ్యను. నీవూరుకో. ఒకమాటు నీవు లోపలికెళ్ళి ఎవ్వరితోనూ మాట్లాడకుండా ఉండాలి. ఏవీ మాట్లాడకూడదు తెలిసిందా! నేను వెళ్లుతున్నాను.

వినోదిని : సరేగాని నీవిప్పుడు ఎక్కడికి వెళ్తావు?

నిరంజను : అంతా తర్వాత చెపుతాను. నీవుమాత్రం నేను చెప్పినట్లు చెయ్యి. త్వరగా వెళ్లు.

[నిరంజను వెళ్ళిపోతాడు. జ్ఞానద వస్తుంది.]

జ్ఞానద : అమ్మయ్యో! నాపని ఏమవుతుందో! నీవు ఒంటరిగా ఇక్కడికెందుకొచ్చావు? వెళ్లు లోపలికి! పెద్దపెద్ద వాళ్లందరూ ఇప్పుడిక్కడికి వస్తారు లోపలికెళ్లు. (వినోదిని వెళ్లిపోతుంది. జ్ఞానద బయటికి తొంగిచూసి కళ్లు పెద్దవి చేసి) పోసీబాబూ! నా కెందుకీ గోల వెళదాంపద మళ్ళా ఎవరో వస్తున్నారు! ఎవరు చెప్మా?

[కాశీధనూ హారూదత్తూ చేయిచేయి కలిపి పట్టుకొని మాట్లాడుకుంటూ వస్తారు. జ్ఞానద వెళుతుంది.]

కాశీధను : (నవ్వుతూ) దత్తు మహాశయుడువచ్చి ఎన్నాళ్ళో అయినట్లుంది. ఉత్తరం పత్తరం ఏమీలేదు అని అనుకొంటున్నాను. నీ దర్శనమయింది. ఎవడ్రా అక్కడ, హుక్కా తీసుకరా!

హారూదత్తు : భాయీ! నా అవస్థ ఏం చెప్పను. పొద్దున్న మొదలు రాత్రి పదకొండు గంటలవరకు ఈ లావాదేవీలతో ఊపిరి తీసుకోవడానికికూడా తీరిక లేదనుకో! ఒకవైపు పెట్టుబడిదార్ల ఒత్తిడి, మరోవైపు కంట్రాక్టర్ల అవసరాలూ పైపెచ్చు (నవ్వుతూ) నీ గురించిన సంగతీ పీటన్నిటితో సతమతమైపోతున్నాను.

కాశీ : అద్భుతశక్తిగలవాడవయ్యో! నీవు దత్తూ! ఒకచేత్తో ఇన్ని వ్యవహారాలు సర్దుకొస్తున్నావంటే అది మామూలు మాటకాదు.

హారూదత్తు : సర్దుకోవాలయ్యా! పాటుపడి ప్రసాదం లభించనప్పుడు సర్దుకోకపోతే ఎట్లా జరుగుతుంది.

కాశీధను: ఓహో! మంచిది మాకీగా మాట్లాడుతున్నావే! అయితే మాటోటి వాళ్ళ గతేమిటీ?

హారూదత్తు : (కాశీధను తొడ చరిచి) పోవయ్యా! మరీ పేదార్పు లరవకు. మా కందరికీ దిక్కూ, మొక్కూ నీవేగదయ్యా!

**కాశీధను : అయితే సరి! ఇక నీవు పట్నంలో చిన్నదో పెద్దదో ఒక ఇల్లూ వాకిలీ ఏర్పాటుచేసుకోవడం మంచిది. నాచేతిలో కావలసినంతమంది మనుషు లున్నారు చెప్పు.**

హారూదత్తు : (ఎక్కువ చనువువల్ల కాశీధను మెడమీది చెమటపొక్కును చిదిమి, ఆశ్చర్యంగా అతడి మొఖం చూస్తూ) పట్నంలో కాపరమా? వద్దుబాబూ, వద్దు. మా స్వభావానికి అది సరిపడదు. 'పక్కా పల్లెటూరి బైతు' అని మీ రెవరిని అంటారో వాళ్ళం మేము. పట్నవాసం నడవడి మాకుగిట్టదు బొత్తిగా. (సేవకుడు హుక్కా తయారుచేసి తెస్తాడు.)

కాళీధను: (నవ్వుతూ) పల్లెటూరి నడవడి అంటే ఏమిటో చెప్పు! పట్నవాసం నడతకంటే పల్లెనడవడి తక్కువదా ఏమిటి? పల్లెలకూ, పట్నాలకూ ఇప్పుడు నాగరికతలో హెచ్చుతగ్గు లేవీ లేవు. నీ మాటలు చాలా తమాషాగా ఉన్నాయే? (అని దత్తుపీపు మెల్లిగా తట్టుతాడు.)

[ ఇంతలో పోలీసు నబిన్‌స్పెక్టరూ, కొందరు కానిస్టేబిల్సూ, నిరంజనూ, కొందరు పెద్దమనుషులూ ప్రవేశిస్తారు. ]

పో.ఇ.: కాళీధనుపాడా అంటే మీరేనా?

కాళీధను: చిత్తం నేనే! కాని............

పో.ఇ: నేను రావడం చూసి ఆశ్చర్యపడుతున్నారా?

[ కాళీధను, హారూదత్తు లేచి నిల్చుంటారు గభాలున, అనుమానంతో దత్తు కళ్లు పెద్దవిచేసి చూస్తుంటాడు. ]

కాళీధను; తమరు........ఇక్కడికి..........

పో.ఇ.: అయితే మే మెవరమో తెలుసునన్నమాట! (దత్తుకేసి చూసి) మీ పేరేమిటి?

హారూదత్తు: నేను ఇప్పుడే వచ్చాను, వెళ్ళిపోతున్నాను. నా పేరు చెప్పాలంటారా?

పో.ఇ.; అహా! చెప్పి తీరాలి.

హారూదత్తు: నా పేరు హారాణ చంద్రదత్తు అంటారు.

పో.ఇ.: హారాణచంద్రదత్తా! శ్రీకృష్ణుడికి ఎన్నో పేర్లు?

హారూదత్తు: (కంగారుపడుతూ) చిత్తం చిత్తం ...

పో.ఇ.: మీరు తీసుకొచ్చిన ఆడపిల్లలను ఎక్కడ దాచిపెట్టారు?

కాళీధను: ఆడపిల్లలనా! ఏమిటీసార్ మీ రనేది? ఇది సేవాశ్రమం.

పో.ఇ.: సేవాశ్రమంలో ఆడవాళ్లుండగూడదా? మీకు ఎన్నో వ్యాపారాలు. దానికేంగాని నే నడిగినదానికి త్వరగా జవాబు చెప్పండి. లేకుంటే చాలా చిక్కుల్లో పడవలసి వస్తుంది.

1 వ పెద్దమనిషి : బియ్యం వర్తకంతోపాటు రకరకాల వ్యాపార సంస్థలు నడుపుతున్నారు. వీళ్లు చాలా ప్రమాదకరమైన ఘాతకులు.

పో.ఇ. : ఓ! అట్లా చెప్పండి (నిరంజనుతో) ఈ కానిస్టేబిల్నుతో లోపలికి వెళ్ళి అక్కడవున్న ఆడవాళ్ళను అందరిని బైటికి తీసుకురా. వెళ్లు.

నిరంజను : రండి మీరందరు నా వెంబడి (అని కానిస్టేబిల్సుతో లోపలికి పోతాడు.)

పెద్దమనిషి : నాలుగు దిక్కుల నుంచి డబ్బు సంపాదించడానికి బియ్యం వర్తకంతోపాటు ఉచ్ఛనీచాలు యోచించక ఎన్నో వ్యాపారాలు వీళ్ళకు. చూడండి ఇన్‌స్పెక్టర్ గారూ! వేలకొద్దీ బస్తాల బియ్యం గోడౌన్లల్లో దాచిపెట్టి, మూడురోజుల నుంచీ ఇంటిల్లిపాదీ పస్తుండి మలమల మాడిపోతున్నారు. ఖరీదు తీసుకొనే ఎన్నో కొన్ని సేర్ల బియ్యం ఇవ్వండని కాళ్లావేళ్లాపడి ఎంతో బతిమాలుకొన్నాను. ససేమిరా బియ్యం లేవు వెళ్ళిపో అని మెడపట్టి గెంటించడానికి కూడా సిద్ధపడ్డాడు ఇతగాడు. పక్కాదొంగలు!

[ సబిన్‌స్పెక్టరు అంతా వ్రాసుకొంటుంటాడు. ]

కాశీధను : చెప్పండి, చెప్పండి, రాసుకోండి తమరు. మా మాటకు విలువనేది లేనప్పుడు.... .... ........

పెద్దమనిషి : విలువ! ఉన్నవిలువ నిలుపుకొన్నావా నీవు? అమాయకుల లాగ కనబడుతారుగాని ఎంత ఘాతకులనుకున్నారు వీళ్లు! మీవంటివారి ముందు ఎంతో సాధువుల్లాగా, సత్పురుషుల్లాగా మేమేదో అన్యాయాలు, అత్యాచారాలు మోపుతున్నట్లు మాట్లాడతారుగాని వీళ్లు కొంపలు కూల్చే మహాఘాతకులు సుమండీ!

పో.ఇ. : ఓహో! అట్లాగా !!

[ నిరంజనూ, చందరుకూతుళ్లూ, వినోదిని, జ్ఞానద, రాజీవు, కానిస్టేబిల్సు వస్తారు. ]

పో.ఇ. : ఆశ్రమంలో ఉన్న గుంపంతా ఇంతేనా?

నిరంజను : కాదు. ఇంకా ఉన్నారు. (చందరు ఇద్దరు కూతుళ్ళను చూపి)

ఈ ఇద్దరు ఆడపిల్లలూ మాఊరివాళ్లు. హారూదత్తు వీళ్ళను దొంగతనంగా తీసుకొచ్చి ఇక్కడ దాచిపెట్టాడు.

హారూదత్తు: తప్పు! తప్పు!! నేనేమీ దొంగిలించి తీసుకురాలేదు.

పో.ఇ.: మీరేమీ మాట్లాడవద్దు. (నిరంజనుతో) ఆ. చెప్పు తర్వాత.

నిరంజను: (వినోదినిని చూపించి) ఈమె నా భార్య. కరువు రోజుల్లో తిండిలేక పొట్టపోసుకోవడానికి పట్నానికి వచ్చి బిచ్చమెత్తుకొంటూ ఈ బాబుగారి ఏజెంట్ల కంట పడింది. కల్లబొల్లి కబుర్లు చెప్పి వాళ్లు ఈమెను తీసుకొచ్చి ఇక్కడ అట్టే పెట్టారు. నేను ఈ బాబుగారి దుకాణంలో పనికి కుదిరి ఇక్కడే ఉన్నాను. కాబట్టి హఠాత్తుగా ఒకనాడు నా కంటబడి సంగతంతా చెప్పింది. సరే ఇక్కడే ఉండమని చెప్పి.........

పో.ఇ.: సరే. నీ ఉపన్యాసం తర్వాత వింటాను. చూడు ఆమె నీ భార్య అని ఋజు వేమిటి?

నిరంజను: చిత్తం. (వినోదినితో) తాళిగట్టిన భర్తను అవునో కాదో చెప్పు.

[ వినోదిని లేచి నిల్చుంటుంది. ]

పో.ఇ.: పోనీ, సరే తర్వాత నీవు ఈ బాబు దుకాణంలో గుమాస్తాగా ఉన్నావా?

నిరంజను: బియ్యం గోడౌనులో పనిచేస్తుంటాను తరుచు,

పో.ఇ.: గోడౌనులోనా పని, దుకాణంలోనా?

నిరంజను: తరుచు గోడౌనులోనే ఉంటుంటాను.

పో.ఇ.: అయితే గోడౌన్లో ఇప్పుడు ఎన్నిబియ్యం ఉన్నాయి.

(కాళీధను కంగారు పడతాడు.)

నిరంజను: చాలా ఎక్కువగానే ఉంటాయి.

పో.ఇ.: ఎక్కువంటే కాదు. ఎన్నిమళ్ళో చెప్పాలి.

నిరంజను: లక్ష పాతికవేల మణుగు లుండవచ్చు.

పో.ఇ.: అబ్బో! లక్ష ఇరవైయైదువేల మణుగులే!

నిరంజను: ఉజ్జాయింపుగా చెప్పాను. కొలిస్తే ఎక్కువా ఉండవచ్చు, తక్కువా ఉండవచ్చు.

పో.ఇ.: సరేలే! చూడు (రాజీవుకేసి చూపించి) ఈయనెవరు?

నిరంజను: ఆయన బాబుగారి కుడిభుజం. గుమాస్తా అని పేరుకుగాని ఆయనే బాబు, బాబే ఆయన.

పెద్దమనిషి: బియ్యంకోసం వచ్చినప్పుడు ఒకమాటు అతగాడే నాతో "జడ్జీలూ, మేస్ట్రిట్లూ, పోలీసులూ మా జేబులో ఉన్నారు" అని ధీమాగా అన్నాడు.

పో.ఇ.: సరే అదీ చూద్దాం!

రాజీవు: ఛా....ఛా....నే నామాట అననేలేదు.

పో.ఇ.: మీరు మాట్లాడకండి. (కానిస్టేబిల్సుకేసి చూపి) ఏయ్, చూడు. ఈ ముగ్గురి చేతులకు బేడీలు తగిలించు.

[ కాళీధను, హారూదత్తు, రాజీవు ఈ ముగ్గురి చేతులకు బేడీలు వేస్తారు. హారూదత్తూ, కాళీధను ఇద్దరూ ఒకరి కొకరు సైగలు చేసుకొంటారు. సంకెళ్లు లేకుండా పోలీసు స్టేషను వెళ్ళడానికి వాళ్ళిద్దరికీ ఏ ఇబ్బందీ కలగలేదు. తెరవాలుతుంది ]

# తృతీయాంకం — మొదటి రంగం

[ధర్మసత్రం "ఉచితముగా భోజనము పెట్టబడును" అని ముందున్న స్తంభానికి తగిలించి ఉంటుంది. రంగస్థలంమీద తిండిలేని పేదలూ, బిచ్చగాళ్లూ గుంపుగా ఉంటారు. అందరూ పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్న సవ్వడి వినవస్తుం టుంది. ముందువైపున కుంజా, రాధిక కనబడుతుంటారు. హఠాత్తుగా తెరలో రోదన ధ్వని వినవస్తుంది. అందరూ భయంతో తల్లడిల్లి పోతుంటారు. కొందరు కళ్లు పెద్దవిచేసి వెనక్కు తిరిగి చూస్తూం టారు. రోగంతో తీసుకొంటున్న ఒక ముసలిది గొంతు కూర్చొని దగ్గుతూ నడుమ నడుమ కింది నించి మీదికి తేరిపార చూస్తుంటుంది. ]

బిచ్చకత్తె: చూడండి. యాపారం. చుట్టూ ఉన్నవారితో పట్టుకపోతే అందర్నీ ఒకేమాటు పట్టకపోరాదూ? కొంద రెళ్లిపోయి కొందరుంటారేటి! ఇది బుద్ధితక్కువ పనికాదూ? (అరుస్తూ) ఆడపిల్లలిని తీసుకపొయ్యారు. పిల్లలను విడిచిపెట్టలేక తల్లి వీధిని పడ్డది. ఇది ప్రాణం. మాటకాదు.

1 వ బిచ్చగాడు: అదేమిటి! చెవికోసిన నక్కలాగా అరుస్తావు?

1 వ బిచ్చకత్తె: ఓయమ్మో! పట్టి తీసుకపోతూంటే అరవద్దా మరి? అందర్నీ పట్టుకపోయి ఇంజనన్ చేసేస్తారట. ఎవరికి తెలుసు?

ముసలివాడు: అందర్నీ పట్టుకపోతారు. ఎవర్నీ ఉండనియ్యరు. ఎవరేలి గరిగిన చోటికి వాళ్లు ఎళ్ళిపోండి. పారిపోండి. లేకుంటే సత్రంలో ఉన్న వాళ్ళందరూ మిమ్మల్ని ఇడిసిపెట్టి ఎళ్ళిపోతారు. ఎనకా ముందూ అలోసించకండి. వేళ ఉండగానే ఎళ్ళిపోండి. అందరూ పారిపోండి.

బిచ్చకత్తె: ఇంజనన్ ఇచ్చి అందర్నీ చంపేస్తారంటూ చెప్పుకొంటున్నారు మరి?

కుంజ: అందర్నీ పోగుచేసి ఎక్కడికి తీసుకపోతారు?

1 వ బిచ్చగాడు: ఎవరికి తెలుసు! యుద్ధానికి తీసుకపోతారని కొందరంటు న్నారు. కాదు బలంగా ఉన్న రైతుల్ని వాళ్ళవాళ్ళ ఊళ్ళకు పంపుతున్నారని కొంద రంటున్నారు. నిజం దేవుడెరుగు నీరు పల్లమెరుగు ఏం చెప్పగలం?

కుంజ: అందర్నీ పోగుచేసి ఎక్కడికి తీసుకపోతారట?

బిచ్చకత్తె: ఇంజసన్ ఇచ్చి చంపేయడానికి తీసుకపోతున్నారంటారు కొంతమంది.

కుంజ: ఇదిగో అట్లాంటి అబద్ధాలు చెప్పకు మరి.

బిచ్చగాడు: ఆమాట అనకయ్యా బాబూ! అట్లాగూ జరగవచ్చు.

కుంజ: పిచ్చివాడా! మతిపోయిందా నీకు! ఇంజక్షన్‌తో మానవులు చస్తే ప్రాణాలు తీసేదైనా దానికి ఖరీదుంది, నీ జీవితానికీ నా జీవితానికీ విలువేముంది? ఏమీలేదు. ఇటువంటి పుకార్లతోనే మన బతుకు శూన్యమైపోయింది. అవునా?

1 వ బిచ్చగాడు; అయితే వరసబెట్టి అందర్నీ ఎక్కడికి తీసుకపోతున్నా రంటావు?

2 వ బిచ్చగాడు: అనేక రకాల పుకార్లు వింటున్నాము. ఈమాటు కోతలకు మనుషులుకూడా దొరకనంత ఎక్కువగా వరి పండిందట. అందువల్ల రైతులను అందర్నీ వాళ్ళవాళ్ళ గ్రామాలకు పంపేస్తున్నారట. ఇంకా ఎన్నో వింటున్నాము.

కుంజ: ఎవళ్ళో పంపడంకంటే రైతాంగం స్వయంగా నడిచివెళ్ళడమే మంచిది. పట్టినే దీవికింద హంగామాతో పనేమిటి?

1 వ బిచ్చగాడు: అవునుగాని గుంపులు గుంపులుగా జనం ఏవైపుకు వెళ్ళ తున్నారో తెలియడంలేదు.

కుంజ: (చేయెత్తి చూపుతూ) ఈ దారినే ఎకాయెకి ఉత్తరంగా వెళ్ళితే ఇబ్బందేమీ ఉండదు.

2 వ బిచ్చగాడు: (చేత్తో చూపిస్తూ) సరీగ్గా ఉత్తరం వైపు.

2 వ బిచ్చగాడు: మీకు ఉత్తరమైతే నాకు దక్షిణమన్నమాట. పంచమహా లనే పేరెప్పుడైనా విన్నావా?

కుంజ : పంచమహలా ?

2 వ బిచ్చగాడు : అవును. అది ఇక్కడినుంచి చాలా దూరం.

ముసలి బికారి : అమాటే ఆలోచిస్తున్నా. లేచి నిల్చోలేను. అంత దూరం నడవగలనా నేను? నా గతి ఏమవుతుందో ఏమో? (దగ్గుతూ) చివరదాకా ఇక్కడే ఉండిపోవలసివస్తుందేమో (ఏడుస్తూ) మీరు అందరూ వెళ్ళిపొండి నన్ను వది లెయ్యండి. నా మాట మరిచిపొండి. వెళ్ళండి. అందరూ పొండి.

[తెరలో గంట మోగిన చప్పుడు.]

2 వ బిచ్చగాడు : మళ్లా గంటకొడతారు. గంట ఇంకోసారి కొడతారు.

[కుంజా, రాధికా, ముసలిబికారి తప్ప తక్కినవాళ్ళంతా
కుండా మండా సర్దుకొని గబగబ బయలుదేరుతారు.]

2 వ బిచ్చగాడు : మళ్ళా గంట కొడతారు. కొడతారు గంట మళ్ళా!

1 వ బిచ్చకత్తె : ఏమో, ఏ క్షణం గంట మోగుతుందో. వేళ దాటిపోతుం దేమో పద పద వెళ్ళిపోదాం.

కుంజ : మళ్ళీ మన ఊరికి వెళ్ళాలనుకొన్నంత మాత్రాన నా గుండె ఎట్లా కొట్టుకొంటున్నదో ఒకసారి చెయ్యివేసి చూడు !

[అని రాధిక చేయి తన గుండెమీద పెట్టుకొంటాడు.]

రాధిక : (విచారంగా) నిజంగానే సుమా !

కుంజ : (జాలిగా నవ్వుతూ) ఎంత ఆనందంగా ఉందో చెప్పడం ఎల్లా! పద. మనంకూడా మన ఊరికి వెళ్ళిపోదాం. ఉన్న ఊరూ కన్న తల్లి అన్నారు. ఈ పాడుపట్నంలో మనమింక ఉందొద్దు పద. తిరిగి వెళ్ళిపోదాం.

రాధిక : వెళ్ళొద్దు. నాకేమీ ఇష్టంలేదు. ఉన్నవూరికెళ్ళడం అదృష్టమే. కాని దేనికోసం వెళ్ళాలి. ఎక్కడుంటాము (ఏడుస్తూ) అక్కడి మట్టికూడా నా భాగ్యంలోలేదు. దగ్ధమయిపోయింది. నా బంగారు మాఖన్ బ్రతికుంటే (అని బిగ్గరగా ఏడుస్తుంది.)

కుంజ : అన్నీ ఉంటాయి. భయపడకు. ఈ పాడుపట్నంలో మనం ఇక ఉండొద్దు. పడ్డగోడలు పడ్డట్టే ఉండవు. పద మన ఊరికి తిరిగి వెళ్లిపోదాం. (రాధిక కళ్లు తుడుచుకొని కుంజ చేయిపట్టుకొని లేచి) పద వెద్దాం. (బయలుదేరతారు.)

మునలి బిచ్చగాడు : మాయలో చిక్కుకోకండి. మీరందరూ వెళ్ళిపొండి. వంకరటింకర దారి. వెళ్లడం కష్టమేకాని ఎక్కడ లేదు కష్టం! వెళ్ళండి మీరందరు. (కుంజ చేయిపట్టుకొని రాధిక ముందుకు వెళ్లుతుంది.)

[తెర వాలుతుంది.]

# తృతీయాంకం — రెండో రంగం

[పెద్దాసుపత్రి. నడవలాగు పొడుగైన గదిలో అటుపక్కన మంచాలువేసి పక్కలు పరిచి ఉంటాయి. అన్ని మంచాలమీద రోగులు పడుకొని ఉంటారు. గదిమధ్య ఒక నర్సు ముందున్న బల్లమీద కాళ్లుచాచుకొని తల చేత్తో పట్టుకొని కుర్చీమీద కూర్చుంటుంది. బల్లమీద మందుల సీసాలు చికిత్సా సామగ్రి పద్దుల పుస్తకాలు ఒత్తుగా పడిఉంటాయి. ఇద్దరు రోగులు పడుకొనిఉండే గట్టిగా మూలుగుతూ, అరుస్తూ ఉంటారు. ఉండుండి నర్సు మెడతిప్పి రోగులకేసి చూస్తూంటుంది. హాలుకు ముందు నేరుగా ఒక మోస్తరు చిన్న వసారా ఉంటుంది. దానిమధ్య ఒక బల్ల రెండు కుర్చీలూ ఒక పొడుగాటి బెంచీబల్ల ఉంటాయి. గోడకున్న చిలక్కొయ్యకు కోటు తగిలించి ఉంటుంది. బయటనుంచి వచ్చిన రోగులతో యువ డాక్టరొకడు సతమతమవుతూ ఉంటాడు. వరాండానుంచి దిగిరావడానికి మెట్లుంటాయి వాటిమీద పేద రోగులందరూ కూర్చొని ఉంటారు. ఒక కాంపౌండరు మందుల బల్లదగ్గర పనిచేస్తూ ఉంటాడు. మధ్యతరగతి పెద్ద మనుషులు, డాక్టరు బల్లకి ఎదురుగాఉన్న బెంచీమీద కూర్చునుంటారు. సీసాలు చేత్తోపట్టుకొని, పెద్దమనుషుల తాలూకు పది పన్నెండేళ్ళ కుర్రవాడొకడు తలమీద ముఖంమీద బ్యాండేజీలతో చికిత్సకోసం వచ్చి కూర్చొని ఉంటాడు. (కాళ్ళకు జోడు, తలకు పాగా, ఒంటిమీద కోటూ వేసుకొన్న తోటివాడులాటి మనిషి ఒకడు అక్కడ ఉన్న రోగులను సర్దుబాటుచేస్తూ ఉంటాడు.) హాలు గది వెనకవైపున ఒకటో నెంబరు పక్కమీద రోగి పెడుతున్న మొరవిని నర్సులేచి దగ్గరికి వెళ్ళి రోగిని లేవదీసి మందేదో ఇచ్చి వెంటనే తిరిగివచ్చి టేబిలుమీది ఖాతాలో ఏదో వ్రాస్తుంది. మళ్ళా ఏదో మూలుగులూ అరుపులూ వినవస్తాయి.]

(నర్సు: (రోగులవైపు ముఖంపెట్టి గద్దింపుగా) ఏమయిందేమిటి? (అసి కేక వేస్తుంది.)

[ఆ గద్దింపుతో 'అమ్మో అయ్యో' అని అరుస్తున్న ఒకటో నెంబరు రోగి ఊరుకుంటాడు. తర్వాత నర్సు ఇతర రోగులదగ్గరికి వెళ్ళి గడియారం చూస్తూ నాడి పరీక్షచేస్తుంది. అంతటితో హాల్లో గల్లంతు తగ్గుతుంది. తర్వాత నర్సు ఒక్కొక్క రోగి దగ్గరకు వెళ్ళి అందరి నాడి పరీక్ష చేస్తూ పోతుంది. బైటి వరాండాలో సూటూబూటూ వేసుకొన్న యువ డాక్టరు 'ఒక్కొక్క రోగినీ ఊపిరి బాగాపీల్చుకో' అని సెతస్కోపుపెట్టి చూసి, వేలితో గుండె, వీపుమీద కొట్టి, కనురెప్ప లాగిచూసి వెళ్ళకూర్చొని మందుసీట్లు రాసి ఇస్తాడు. ఆ చీట్లుపట్టుకొని సీసాలు తీసుకొని కొందరు వెళ్లి నిల్చుంటారు.) తెంచా షర్టూ వేసుకొన్న కాంపౌండరు తొందర తొందరగా మందుల టేబులు మీద పెద్ద సీసాలలో కలిపిఉంచిన ఎరుపూ, తెలుపు,నలుపూ మందునీళ్లు రోగుల సీసాల్లో పోస్తూ శ్రమపడుతున్నట్లు కనబడతాడు.])

డాక్టరు: (ఒక రోగిని పరీక్షించి) దగ్గుతో ఆయాసపడుతున్నావా?

4 వ రోగి: అవును బాబూ! మహా యాతన!

డాక్టరు: బాధ ఏమిటో చెప్పగలవా?

రోగి: చెప్పలేను.

డాక్టరు: నాలుక చూపించు (రోగి నాలుక చూపిస్తాడు) ఇంకా బాగా చాపు నాలుక. (చూసి చీటీ వ్రాస్తూ) రాత్రుళ్లు నిద్రపడుతుందా?

4 వ రోగి: అసలు నిద్ర పట్టనే పట్టదు బాబూ!

డాక్టరు: (చీటీ ఇచ్చి) సరే మరో వారంరోజులు ఈ మందే పుచ్చుకో.

4 వ రోగి: ఈవేళ మందు మారుస్తామని చెప్పారుగా డాక్టరుగారూ?

డాక్టరు: ఈ మందే వాడు తర్వాత చూద్దాం.

4 వ రోగి: జ్వరం ఏమాత్రం తగ్గలేదండీ.

డాక్టరు : తగ్గుతుందయ్యా! తగ్గుతుంది. రావడమంటే జ్వరం త్వరగా వస్తుందికాని పోవడానికి కొన్నాళ్లు పడుతుంది. తొందరపడితే ఎల్లా చెప్పు. ఈవారం తగ్గకపోతే చూద్దాం.

రోగి : జ్వరం తగ్గడానికి ఏదైనా మంచి మందిత్తురూ మీకు దండంపెడతాను.

డాక్టరు: నీకోసం ప్రత్యేకం మంచిమందు ఏదైనా నేను సృష్టించగలనా? రోగానికి ఉన్నమందేదో ఇస్తున్నాను.

4 వ రోగి : ఈ మందు నెలరోజులనుంచీ పుచ్చుకొంటున్నాను. జ్వరం పిసరంతైనా తగ్గలేదు. కాళ్లవాపు అట్లానే ఉంది. ఈ యాతన ఎన్నాళ్లు బాబూ?

డాక్టరు : జ్వరం గిరం అంతా తగ్గిపోతుంది వెళ్లు. నేనేం దేవుణ్ణా?

4 వ రోగి : అయితే నా ఖర్మ ఇంతేనంటారా?

డాక్టరు : చొప్పదంటు ప్రశ్నలువేసి నన్ను వేధించకు. ఇంకాఎంత మందినో రోగుల్ని చూడాలి. వెళ్లు.

4 వ రోగి : అయితే మీ చిత్తం (వెళ్లిపోవును.)

పెద్దమనిషి : (కుర్చీమీద కూర్చున్నవాడు డాక్టరుకేసి చూపి) అన్నీ మలేరియా కేసులే అనుకొంటా!

డాక్టరు : చాలావరకు అవే. ఇంకా కొన్ని ఉన్నాయనుకోండి. ఈ మధ్య నెలరోజులనుంచి జలోదరం కేసులు ఎక్కువగా వస్తున్నాయి. ఇక్కడ కావలసిన మందులు లేవు, మాకులూ లేవు. ఏం పెట్టి చికిత్సచేస్తాంమేం చెప్పండి?

పెద్దమనిషి : మరి ఆ సంగతి పై అధికారులకు ఎందుకు తెలియజెయ్యరూ?

డాక్టరు : పైకి రాసిరాసి ప్రాణం విసుగెత్తిపోయింది. కావలసిన మందులు సప్లై చెయ్యలేనప్పుడు వట్టి బూటకంకాకపోతే ఈ ఆసుపత్రి ఎందుకూ మూసెయ్యకూడదూ చెప్పండి. ఎన్నిసార్లు రాసినా పైవారు ఉలకరూ పలకరూ! ఈ అవస్థలో మేం ఏంపని చేయగలమండీ? అవసరమైన సామగ్రి సప్లైచేస్తే మూడు గంటలుకాదు పదమూడు గంటలు మేము శ్రమపడతాం. పదికాదు వందచీట్లు రాస్తాము. కల్లా కప

టమూలేకుండా పనిచెయ్యాలని మనసున్నా పిండిలేకుండా రొట్టె ఎట్లా చెయ్యగలం చెప్పండి. ఇదీ మా దురదృష్టం కానియ్యండి ఏమి చేస్తాం! అనుకొని లాభంలేదు. (ఒక రోగినిచూపి) నీకేమిటోయ్ చెప్పు.

[హఠాత్తుగా హాలులోనించి రోగి ఆర్తనాదం వినవస్తుంది.
నర్సు పరుగెత్తివెళ్ళి రోగినిచూపి డాక్టరు దగ్గరికి వస్తుంది.]

నర్సు : డాక్టరు ముఖర్జీ ?

డాక్టరు : ఏమిటీ సంగతి అంత కంగారు ?

నర్సు : అయిదోనెంబరు పేషంటుకు హెపటైటిస్ వచ్చింది.

డాక్టరు : హెపటైటిసా? ఏమిటి కారణం? అయితే పద వెళ్ళిచూద్దాం (ఇద్దరూ రోగిదగ్గిరికివెళ్ళి పరీక్షించి) రేవా? చార్టు ఏదీ?

నర్సు : (ఛార్టుతెచ్చి ఇస్తుంది)

డాక్టరు : వెంటనే కొంచెం మంచుగడ్డ తెమ్మని తోటితో చెప్పు. త్వరగా వెళ్ళాలి. (నర్సువెళ్ళి తిరిగి వచ్చి తీసుకొస్తున్నాడని చెప్పింది. ఇంతలో తోటివాడు మంచులేదని చెపుతాడు.)

డాక్టరు : ఆసుపత్రిలో మందూ లేదు, మంచుగడ్డకూడా లేదు. ఛూ ఛూ.

నర్సు : గ్లూకోజు ఇంజక్షను ఇస్తేనో?

డాక్టరు : ఇంజక్షనూలేదు. మందూలేదు, మంచుగడ్డాలేదు. రోగులుమాత్రం ఆసుపత్రినిండా ఉన్నారు.

నర్సు : (హఠాత్తుగా అయిదోనెంబరు రోగికి వెక్కిళ్లు ఆరంభమవుతాయి గబగబ నర్సు వెళ్లిచూపివచ్చి) డాక్టర్! పేషెంటు.......

డాక్టరు : హెల్పులెస్! రేవా? ఈ స్థితిలో మనం చేయగలిగిందేమీ లేదు. వాడు చచ్చిపోతాడని నాకు తెలుసు. వాడేకాదు రేవా! మొత్తం రోగులందరూ! వాళ్లగతి అంతే. మనగతి ఇంతే. ఇది మనుషులను చేతులారా చంపడమేగాని మరొకటి కాదు.

[డాక్టరు కేకలు విని రోగులందరూ పక్కకు ఒత్తిగిలి లేచి కూర్చొని అమ్మో
అమ్మో అని భయంతో అరుస్తారు. కాంపౌండరు వచ్చి చూస్తాడు.]

కాంపౌండరు : పడుకోండి మీరందరూ? ఏమీ జరగలేదు. మాట్లాడక పడుకోండి. [అని తన చోటికి వెడతాడు.]

[రోగులందరూ యథాప్రకారం దుప్పటి ముసుగుపెట్టి పడుకొంటారు. చచ్చి పోయిన అయిదో నెంబరు రోగిపైనిండా తెల్లటిగుడ్డ కప్పి డాక్టరుదగ్గిరికి విచారంగా వెళ్ళి నిల్చొంటుంది. అప్పటికి కాంపౌండరు టేబిలుదగ్గర రోగుల క్యూ ముగుస్తుంది. శవాన్ని తీసుకపోయే బారికెవాళ్లు ఇద్దరు శవవాహనంతో వస్తారు. డాక్టరు వాహకులతో అయిదోనెంబరు రోగి అని చెపుతాడు. వాళ్లు వెళ్ళిపోతారు.]

డాక్టరు : (టేబిలుదగ్గర అవీఇవీ సర్దుకొంటూ ముఖం ఎత్తిన నర్సుకేసి చూపి) ఆ రోగిని బ్రతికించగలనని నీకు ఆశ ఉండేదికదూ!

నర్సు : ఆశకేమిటిలెండి! అంతా దేవుడి దయ!

[డాక్టరు ఏదో పనిచూసుకొంటూ ఉంటాడు. ప్రధాను గుమ్మంలోకి వస్తాడు. చింపిరివేషంతో చెత్తకాగితాలూ చింకిగుడ్డలూ చంకనపెట్టుకొని చిరుగుల చొక్కా తొడుక్కొని కుండ ఒకటి చేత్తోపట్టుకొని గుమ్మంలో కూర్చున్న ప్రధానును చూపి పిచ్చివాడనుకొని డాక్టరుతో]

నర్సు : మీకోసం వీడెవడో కనిపెట్టుక్కూర్చున్నాడు.

డాక్టరు : ఎవడూ?

నర్సు : ఏంకావాలి నీకు?

ప్రధాను : ఏదైనా మందు కావాలమ్మా?

నర్సు : దేనికీ మందు?

ప్రధాను : (ముఖం చిట్లించి తలూపుతాడు.)

డాక్టరు : ఎవడువాడు? ఏమంటాడు?

నర్సు : మీరే వచ్చి చూడరాదూ?

డాక్టరు : (లేచి) ఏమంటావు? నీకేమయింది?

ప్రధాను : ఏదైనా మందుకావాలి బాబూ? (కాళ్ళకేసి చూపుతూ) చాలా బాధ.

డాక్టరు : బాధగా ఉందా? ఎక్కడ? (చేతిలోవున్న చెత్తవస్తువులను చూపుతూ) అవన్నీ ఏమిటి?

ప్రధాను : అవే ఉన్నాయి బాబూ !

డాక్టరు : ఎల్లా ఉన్నాయి ?

ప్రధాను : ఎట్లాగో మిగిలినాయి.

డాక్టరు : వాటిని పారేయరాదు! వాటితో ఏం ప్రయోజనం ?

ప్రధాను : వాటినికూడా పారేస్తే ఇంకేం మిగులుతుంది? పారెయ్యడమే అన్నీ ! అయ్యో ! ఇవన్నీ.

డాక్టరు : అమూల్య రత్నాలుకదూ! ఎల్లా పారెయ్యడం! అవునా!

ప్రధాను: కాదు. (నవ్వుతాడు)

డాక్టరు : (నర్సుకేసి చూపి) ఈ జబ్బేమిటో తెలిసిందా నీకు ?

నర్సు : కొంచెం....కొంచె........

డాక్టరు : ఈరకం జబ్బులు ఎన్నో ఉంటాయి. ఉండవా మరి ?

ప్రధాను : నిశ్చయం. ఎందుకుండవు? (హఠాత్తుగా బాధ నటిస్తూ) అబ్బబ్బ! అమ్మో బాధ !!

డాక్టరు : ఎక్కడో బాధ చెప్పు ?

ప్రధాను : (చేయెత్తి) ఇక్కడే ఇక్కడే బాధ ఇక్కడే (అని చేయి చూపిస్తాడు).

డాక్టరు : (కాళ్లుచూపి) ఇక్కడేనా బాధ ! కాళ్లు లాగుతున్నాయా ?

ప్రధాను : లేదు.

డాక్టరు : బాధమరెక్కడో చెప్పు !

ప్రధాను : అదిగోను. ఇంకా అక్కడే.

డాక్టరు : ఇంకా అక్కడే ఉందా? నేను మంత్రం వేశాను.

ప్రధాను : అరే ఇప్పుడే పారిపోయింది. ఇప్పుడే ఒక్కపరుగున పారిపోయింది. (గెలిచినట్లు చేయెత్తి నవ్వుతాడు.)

నర్సు : (నోరు నొక్కుకుంటూ నవ్వుతుంది).

డాక్టరు : పరుగెత్తి పారిపోయిందా ? ఎక్కడికి పోయింది ?

ప్రధాను : నదీనదాలు, వాగులూ వంకలూ దాటి కానలూ కోనలూ పడగొడుతూ మోటారుకారులాగు రయ్యీ రయ్యీ మంటూ పరుగెత్తిపోయింది. (అంటూ హఠాత్తుగా ఒంట్లో ఎక్కడో నొప్పిపుట్టినట్లు 'అమ్మో!' అని గుండెమీద

చెయ్యి వేసుకొని, సగం వంగి, పళ్లుకొరుకుతూ, ముఖం చిట్లిస్తూ, బాధ చూపిస్తూ ఉంటే డాక్టరూ, నర్సూ ఒకర్ని ఒకరు చూపి నవ్వుకొంటారు.)

డాక్టరు: (అపహాస్యంగా) మళ్ళావచ్చిందా బాధ?

ప్రధాను: అవును. మళ్లా వచ్చింది. ఘోరమైన బాధ. అసహ్యమైన యాతన. ఇట్టే వస్తుంది ఇట్టే పోతుంది. మండే ఎండాకాలంలో మబ్బులాగు. అట్టేవచ్చి ఇట్టే నన్ను విలువునా కప్పేసి కొంపా గోడూ పడగొట్టేసి... ....

డాక్టరు: (గద్దిస్తూ) ఆగూ!

ప్రధాను: ఆగమంటారా? నన్ను.

డాక్టరు: అవును. నీ బాధాగీధా అంతా వట్టిది. శుద్ధాబద్ధం.

ప్రధాను: అబద్ధమేనంటారా?

డాక్టరు: నీకేబాధ లేదు. అసలు నీవు బాధమాట మరిచిపో.

ప్రధాను: (చింపిరి కాగితాలు కుళ్లుగుడ్డలూ అన్నీతీసి చంకన పెట్టుకొని చేత్తో కుండతీసుకొని నిటారుగా నిల్చుని) అయితే మంచిదే నా బాధ మరిచిపోతాను. నీవూ నీ బాధ మరిచిపో అందరం అన్నీ మరిచిపోదాం (అని వెళుతుంటే డాక్టరూ నర్సూ ఆశ్చర్యంగా చూస్తుంటారు.)

(తెర వాలిపోతుంది.)

# చతుర్థాంకం — మొదటి రంగం

[పట్నంనుంచి పల్లెకు తిరిగివచ్చి నిరంజను, పాడై పోయిన తమ ఇంటిని మార్చి చేర్చి మరమ్మతు చేయించి నివాసయోగంగా చేసుకొన్నాడు. తెర ఎత్తగానే రంగ స్థలంమీద దాదాపు ఇరవై మందికిపైగా గృహస్థులైన రైతులు ఆ యింటి అవరణలో ముంగిలి నడుమ పరస్పరం మాట్లాడుకొంటూ ఆలోచించుకొంటూ కనబడతారు. జనం మూడు జట్లుగా కూర్చుంటారు. ఒక్కొక్క జట్టులో ముగ్గురు నలుగురు ఉంటారు. రంగంమీద కుడివైపున నిల్చొని మాట్లాడే వారి మాటలు వివరంగా వినబడుతాయి. ముంగిట్లో కూర్చున్నవారి మాటలు దృశ్యమేకాని శ్రవ్యంకాదు. ఇందులో విశేషమేమిటంటే వేరుగా ఒక జట్టు మాట్లాడేటప్పుడు తక్కిన రెండు జట్లల్లోనివారు కూర్చొని అభినయంద్వారా గుసగుసలలో తమ అభి ప్రాయం వెల్లడిస్తుంటారు. రంగంమీద తెర ఎత్తగానే మొదటిజట్టులోని పకీరు, సుజనం, భజను అనేవారు నిల్చొని సంభాషణ ప్రారంభిస్తారు. కుడివైపున నడుమ, ఎడంవైపున నిల్చొనిఉన్న తక్కిన రెండు జట్ల వాళ్ళు అంగికాభినయంతో అభిప్రాయం వెల్లడిస్తుంటారు. ముంగి టరుగుపై కూర్చున్న నిరంజను, దయాలు, మండలు మొదలైన వారు అంతవరకు ఏదో ఆలోచిస్తుంటారు. సఖీచరణు సంభాషణ కాగానే బరకతు సమావేశానికి అందరినీ పిలుస్తాడు.]

పకీరు : (సుజనుతో) తండ్రి అప్పు భుజానవేసుకపుడతాడు. చనిపొయ్యే టప్పుడు మళ్ళా యథాప్రకారం తన అప్పు కొడుకుభుజాన పడేసిపోతాడు. జన్మ జన్మాంతరాలనుంచి ఇది ఇట్లాగే జరుగుతూ వస్తున్నది. ఇందులో విశేషం ఏముంది?

భజను : లేదు. నీవు చెప్పింది యదార్థంమాటే.

సుజను : అదేమన్నమాట! ఎప్పటినుంచో వస్తున్నదనిచెప్పి మంచి చెడ్డలు విచారించకుండా ప్రతిదీ జరుపుతామా? అదేం ఆచారం?

ఫకీరు : అయితే ఉపాయం ఏమిటో చెప్పు!

సుజను : ఉపాయంచెప్పడం మాటలా? బాగా ఆలోచించి చూడాలి.

ఫకీరు : ఇది ఇప్పటి సమస్యకాదుగదా? మరి ఇంతకాలంనుంచి ఎందు కాలోచించలేదు?

సుజను : నీవు ఏరకంగా మాట్లాడుతున్నావో తెలుసుకోలేకపోతున్నా నేను. అసలు సమస్య ఏమిటో తెలిస్తే ఉపాయం ఆలోచించవలసిన అవసరం ఎందు కొస్తుంది? అన్నిటికంటే ముందు అసలు సమస్య ఏదో తెలుసుకోవడం అవసర మంటావా కాదంటావా? అది చెప్పు.

ఫకీరు : కాకపోవడమేమిటి?

సుజను : అట్లాగైతే కానియ్!

[మొదటిజట్టు సంభాషణ ముగుస్తుంది. రంగం మధ్య ఉన్న రెండో జట్టు సంభాషణ ప్రారంభమవుతుంది. రెండో జట్టుతో బరకతు, రకీం, గులానబీదు ఉంటారు. బరకతు తన చిన్న కూతురికి ముస్తాబుచేసి భుజంమీద కూర్చోబెట్టుకొని కూడా తీసుకువచ్చాడు.]

రహీం : పేర్లదరగాలో మొక్కుచెల్లడం ఇంతవరకూ జరగలేదు. ఏమైనా సరే అది దరగాకు తీర్చడము ముఖ్యం.

బరకతు : ఎందుకు చెల్లించాలేమిటి?

రహీం : దేవుడి మొక్కుబడిగదయ్యా?

బరకతు : అయితే వందదాకా అప్పులున్నట్లుంది నీకు?

గులాంనబీ : మొక్కుబడి అయితే తర్వాత తీర్చుకోవచ్చు. చెల్లించడం ముఖ్యంగాని కొంచెం ఆలస్యం జరిగినా దోషమేమీలేదు. అమాత్రానికే నీకు నరకం రాదు.

రహీం : అలాగననకు. మౌలానా ఏమన్నాడో తెలుసా? వెంటనే చెల్లించ కుంటే వెలివేస్తానన్నాడు. అందుకే నాకీ తొందర!

బరకతు : మౌలానా అనంగానే అవుతుందా ఏమిటి? మనుషులకు ఇబ్బం దులూ సబ్బందులూ ఉండవా? వీలుచూసుకొని దేవుడిమొక్కు తీర్చుకోవచ్చు. భగ

వంతుడికళ్లు మౌలానా పిల్లికళ్ళలాగు మరీ చిన్నవికావు. ఈ మాట మనసులో పెట్టుకో!

[దీవితో రెండోజట్టు సంభాషణ ముగుస్తుంది. వెంటనే దిగంబరు, దయాలు, సఖీచరణు మొదలైన ప్రముఖుల సంభాషణ ప్రారంభం అవుతుంది.])

దిగంబరు: అందరూ నాకు అప్పిచ్చినవాళ్ళే. అందుకోసం విచారమెందుకు? అప్పుచేసి బ్రతుకంతా ఖాళీ అయిపోయింది. ఎవరివల్లా నాకేం లభించనేలేదు.

సఖీచరణు: ఒక్కమాటు పంట తగ్గిపోతే అప్పులు పెరగడమేమిటో అప్పుడు తెలుస్తుంది.

దిగంబరు: ఆమాట నిజమే? కాని పొట్టనిండడంతోనే దయగలవాడనిపించు కోవాలని బుద్ధిపుడుతుంది. అప్పుడిక శత్రు మిత్రజ్ఞానం ఉండదు. ఈ రోగమే రైతులను చంపుతున్నది. మహారాజుల్లాగు ఆనందిస్తున్నా ఐకమత్యమేమాత్రం లేనేలేదు.

సఖీచరణు: ఇక ఇప్పుడట్లాకాదులే.

[ఇంతవరకు గుమ్మంలో వించుని మాటామంతీ సాగిస్తున్న దయాలు, మండలూ, నిరంజనూ మొదలైనవారు బరకతు పిలుపువిని సమావేశమవుతారు.]

బరకతు: మొత్తంమీద రావలసిన వారంధరూ వచ్చేశారు గనుక ఇప్పుడిక ఆలోచన సాగించవచ్చు.

దయాలు: అవును. ఆలస్యం ఎందుకు?

నిరంజను: ఆలస్యం ఏమీలేదు. ప్రారంభించవచ్చు.

బరకతు: అయితే మొదలుపెట్టు.

దిగంబరు: ఒకవిధంగా అందరూ ఒకచోట చేరడం అయింది. ఈసారి....

సఖీచరణు: ప్రారంభించుమరి. పొద్దుపోతున్నది.

బరకతు: దయాలు అన్నయ్యా! కానీ మరి (నిరంజన్ చెవిలో ఏదో చెపుతాడు.)

నిరంజను: ఔను. (అని తల ఆడిస్తూ నవ్వుతాడు.)

దయాలు: నేనే ప్రారంభించాలా? కానీ, నాకంటె మంచి....—

విరంజను : అట్లాకాదు. నీవే ప్రారంభంచేయాలి ముందు. ఆ తరువాత

బరకతు : ప్రారంభించడమేమో నీవే! ఆ తర్వాత అందరంకలిసి ఆ విష యాన్ని ... ... ....

దయాలు : అయితే సరే!

[అంతవరకు కాలిబాటన వేలితో నేల తవ్వుతున్నవాడు, తల ఎత్తి బింకంగా ముఖంపెట్టి.]

దయాలు : ఇప్పుడిక్కడ సమావేశం అయిన మన కందరికీ ప్రస్తుతసమస్య బాగా తెలుసు. ఇది సామాన్యమైన సమస్యకాదు. చాలా కష్టమైన జీవన్మరణ సమస్య. దుక్కి చెయ్యడమూ, పైరు కొయ్యడమూ, నూర్చడమూ, ధాన్యం కొలవ డమూ, అయిన తరువాత ఆ ఫలసాయాన్ని కాపాడడం ఎలాగు? అనేదే సమస్య! ఇప్పటి స్థితిగతులనుబట్టి ఎవరికి కోపంవచ్చినా సరే సత్యమయిన మాటచెపితే మనం పదిమందిమీ కలిసి కూర్చుని బాగా ఆలోచించి, తగిన ఉపాయం ఏదో నిశ్చయించా లని స్థిరపరచుకొన్నాము. ఈ సమయాన్ని వృధాచేయడం మనకేమాత్రము మంచిది కాదు.

విరంజను : అవును. చాలా బాగుంది. (తెరలో గోవిందా! గోవిందో హరి. అని కేకలు.)

దయాలు : మాటలవల్లా, ఆలోచనవల్లా, ప్రయోజనంలేదని నేను అనను. ఉన్నది. పూర్తిగా ఉంది. అవస్థనుబట్టి ఈ విషయమెంత ముఖ్యమైనదో మనం ఏమీ ఆలోచించడం. అందుచేతనే ఈ సంగతి ఎత్తవలసివచ్చింది. నిజానికి మన వ్యవహారం ఎట్లాఉందో చెప్పాలంటే, ఇప్పుడే, ఈ క్షణమే మన ఫలసాయం రక్షించుకోవడానికి ఏదో గట్టి ఏర్పాటు చేసుకోకుంటే చావడంతప్ప మనకు గత్యం తరం లేదు. ఎవరింట్లో వాళ్ల చచ్చిపోతూంటే మనకు సాయపడే వారెవ్వరు?

(అందరూ కదలిపోతూ ఒకరి చెవిలో ఒకరు ఏదో చెప్పుకోవడం తుమ్మె దల మోతలాగ వినపడుతుంది.)

దయాలు : క్లుప్తంగా అసలు సమస్య మీకు వివరించాను. ఇప్పుడిక అందరూ కలిసి ఎవరి అభిప్రాయమేమిటో, మార్గమేమిటో, ఏమిచేస్తే మన సమస్య తీరిపోతుందో తీర్మానించాలి బరకతుజీ! నీవుచెప్పు మొదట.

బరకతు : ముందుగా చెప్పవలసింది నేనా?

దయాలు : ఈ విషయంలో ఏమయినాకాని కొంచెం ఆలోచించి నీ అభి ప్రాయమేమిటో చెప్పు. అసలు సమస్య అందరికీ.............(అని హుంకా పిలుస్తాడు.)

[ తెరలో రమా రమణ గోవిందో హరి! అని కేకలు. ]

బరకతు : అది సరైన మాటకాదు.

విరంజను : నీవేది ఆలోచించావో అదే చెప్పు.

[ తెరలో గోవిందా! దేవింగా!! హరి!!! అని కేకలు. ]

విరంజను : అయ్యో! ఎవరో చచ్చిపోయినట్లుందే!!!

[ తెరలోంచి త్రిలోచన విశ్వాసు చనిపోయాడు అని వినిపిస్తుంది.]

దిగంబరు : త్రిలోచనంటే మన నారాయణ తండ్రి కదూ! అరె! ఆరోజు రోడ్డుమీద విల్చొని ఎన్నో సంగతులు మాట్లాడుకొన్నాం. పోయాడా! ఆశ్చర్యం!

సఖీచరణు : అయ్యో! ఏమయిందతడికి?

విరంజను : చావుకు కారణం ఉండాలా ఏమిటి?

బరకతు : ఈ అవస్థ మరీ ఆరాచకం అయిపోయిందే? చచ్చినవాడితో వాడి బాధ్యతలన్నీ తీరిపోతాయి. ఇప్పుడిక బ్రతికున్న వాళ్ళనుగూర్చే ఆలోచించాలి. ఒకవైపు వారి పైరుకోతకు వచ్చింది. ఈ అకాలమరణం ఏమయినా ప్రతిబంధకం అవుతుందా? అదే ఆలోచించవలసిన విషయం.

ఫకీరు : అయితే ఏమిచెబుతావో చెప్పు బరకత్?

బరకతు : నేనేం చెప్పేది.

దిగంబరు : ఏమి ఆలోచించావో అదే చెప్పు. అదే సరియైన దనేమాట ఏమీలేదు. పదిమందిమీ కలిసి బాగా ఆలోచిస్తే ఏదో మార్గం దొరకకుండా ఉంటుందా? చూద్దాం. ఊ! చెప్పుమరి!

సఖీచరణు : అందరమూ కలిసి ఆలోచించి నిశ్చయించేలోగా మళ్ళా ఈ మాటేమిటి?

బరకతు: అంటే అసలు విషయం చెప్పడం అయింది. ఆలోచించడం కాలేదు. ఇది ఒక్కమాటు తేలేదికాదు. మనకున్న యిబ్బందులు ఏవో తేల్చుకొన్నాం. అవి తొలిగేమార్గం ఇప్పటికీ నిశ్చయించలేకపోతున్నాము. వృత్తి ఆలోచనలతో పని జరుగుతుందా చెప్పు? కూడా ఉన్నవారు కొంత సాయపడితే ఏదో దారి కనపడక పోదు. కూడూ, గుడ్డా కాక రోజుకు రెండుమూడు రూపాయలు జీతమిచ్చినా, పని వాళ్లు దొరకడంలేదు. ఇప్పటి అవస్థ ఎలాఉన్నదంటే మూడు నాలుగు రోజుల్లోగా పైరు కొయ్యకపోతే ఈ పంటంతా పూర్తిగా పాడయిపోతుందని నాయకులు గట్టిగా చెపుతున్నారు. ఇదే ఇప్పుడున్న అవస్థ. ఆలోచించండని చెప్పడమేకాని, ఇంత వరకు ఏమీ ఆలోచించలేదు. ఇరవై కొడవళ్ళతో జరగవలసినపని నా ఒక్క చిన్న కొడవలితో ఎట్లా జరుగుతుంది? ఏమిచెబుతారో చెప్పండి.

దయాలు: నీవెంతచెప్పినా అసలు సమస్య అట్లాగే ఉంది.

బరకతు: అవును. మరొకలాగ ఎట్లా ఉంటుంది. రాత్రంతా ఆలోచించి, ఆలోచించి అంతేమీ కనపడక రెండు కళ్లూ మూతబడటంలేదు. దయాల్! కాళ్లూ చేతులూ కదపలేకపోతూ, పొద్దున్నేలేచి చూసుకుంటే ముఖం బొత్తిగా వాడిపోయి ఎంతో అసహ్యంగా ఉంది.

దిగంబరు: ఈ రోగమూ, రొష్టూ ఒక్కమాటుగా మనన్నుకూ ప్రాణానికీ బాధ కలిగించేస్తూంది. సాహసము, ఉత్సాహములేకున్నా ఇది చేసి తీరాలి. చావో, బ్రతుకో ఏదైనా సరే! మనిషి శాశ్వతమా?

దయాలు: తెలుసు. అంతా తెలుసు. ఎంతైనా మనిషి బ్రతకాలనే కోరుతాడు. సహాయంలేదు. సంపత్తిలేదు. మహాకరువులో కాపరాలన్నీ కాలి బూడిదై పోయాయి. అయినప్పటికీ మన సమావేశం జరిగింది. అదీ ఎక్కడ? నిరంజను ఇంట్లో! దీనికంతకూ నిరంజనే నిర్వాహకుడు. ఇందులోంచి నీవెలా తప్పుకోగలవు. మనిషి లోలోపల ఉన్నది ఇదే అని నేనంటాను. దీన్ని నువ్వు ఎట్లా అడ్డగలవు? మనిషి అందుకే బలకాలని కోరతాడు. (కొంచెంసేపు అందరూ మౌనంగాఉంటారు. నిరంజను గొంతు సవరించుకొని ఏదో చెప్పదలచుకొన్నట్టు హావభావాలు కన పరుస్తాడు.)

బరకతు: విరంజనేదో చెప్పబోతున్నట్టుంది!

దయాలు: ఏమయినా చెబుతావా? విరంజన్!

విరంజను: చెప్పాలా ఏమిటి?

దయాలు: ఊ, అయితే చెప్పు.

విరంజను: బరకతుమామా! దిగంబరు అన్నయ్యా! ఇప్పుడే రోగాలూ, రొష్టులూ, దుఃఖాలూ, కష్టాలూ అన్నిటివిగురించీ చెప్పారు. అవి మన జీవితానికి చిరకాలంనుంచీ జతగా ఉండనే ఉంటున్నాయి. ఇట్లా పదిమందిమీ రెండువిమిషాలు కూర్చొని వాటివిగురించి అనుకొన్నా, ఆలోచించినా అవి తప్పేవికావు.

దయాలు: అవును! ఆమాట నిజమే.

విరంజను: అందువల్లనే మనం ఏర్పాటు ఏదయినా చేయదల్చుకుంటే ఈ అవస్థలోఉండే విర్ణయించుకోవాలి.

దిగంబరు: ఆ సంగతి అందరికీ తెలుసునయ్యా! కాని ఆ చేయవలసిన ఏర్పాటేదో విర్ణయించుకోవడమే కష్టంగా ఉంది.

బరకతు: అసలు సంగతి అదే! సరేకాని ... ....

దయాలు: ఏం చెపుతావో చెప్పు. మొహమాటం ఎందుకు.

బరకతు: మన జమీందార్లు ఉన్నారే ఆ బాబులు గనుక కొన్నేళ్ళనుంచి మనం బకాయిఉన్న శిస్తు.... ....

దయాలు: అవసరంలేదవి మన్నిస్తే.... ...

బరకతు: అవునవును.

దయాలు: మన కష్టవిష్టురాలన్నీ ఇంతవరకు ఎందుకు మనవి చెయ్యలేదు. ఎవరు వద్దన్నారు? బకాయి శిస్తువసూళ్ళన్నీ రద్దుకావాలి. వి త్తనాలు సప్లైచెయ్యాలి. వ్యవసాయ ఋణాలు ఇవ్వాలి. ఈ విన్నపాలన్నీ మామూలుగా ఉండనే ఉన్నాయి. కానీ నేననేదేమంటే మనం మొదటి నుంచీ అన్నిటికీ పై వాళ్ళమీద ఆధారపడక మన పనులు కొన్ని మనమే చేసుకోగలగడమెట్లాగో ఆలోచించాలి.

దిగంబరు: అవును. చాతకపక్షుల్లాగా నోరు తెరుచుకొని పైకిచూస్తూ కని పెట్టుకొని ఉండడంవల్ల ఏపనీ జరగదు.

సఖీచరణు: అవును. ఆ మాట అబద్ధంకాదు.

దయాలు: అయితే ఒకపనిచేస్తే ఎట్లా ఉంటుందో ఆలోచించండి మరి? (అందరూ ఆత్రంగా చెవులొగ్గి ఉంటారు.) అందరమూకలిసి ఆ విషయం ఆలోచించాలి. ((ఆ విషయం ఏదో త్వరగా చెప్పు అని కేకలు సభలో.)

దయాలు: నాదీ నీదీ అనుకోకుండా అందరి పొలాల్లో అందరం కలిసి దుక్కి మొదలు, తూర్పారబోయడంవరకు అన్ని పనులూ మనమే చేసుకొంటే ఎట్లా ఉంటుందో ఆలోచించండి.

బరకతు: అంటే, సమిష్టిగా సేద్యం సాగించడమన్నమాట! అందరు శ్రమ పడడం అందరం సమంగా అనుభవించడం.

దయాలు: అవును. మన అమీన్పూరుగ్రామం సంగతి చూడండి. కనీసం ఏభై అరవై ఇళ్ళవాళ్ళం ఉన్నాము. ఇక్కడ పనివచ్చినప్పుడు వీళ్ళందరి సాయం మనకు ఉంటుందని చెప్పలేము. ఎవరికైనా జబ్బు చేయవచ్చు. కష్టమో నిష్ఠురమో కలగవచ్చు. దైవికంగా ఏ శోకతాపాలో రావచ్చు. కాని ఈ ఏభై కుటుంబాలజనంలో కనీసం సగంమంది అంటే పాతికమంది అయినా సాయపడగలిగితే చాలు తేలిగ్గా అన్ని పొలాల్లో అందరం కలసి శ్రమపడితే ఎవరిపొలంలోనూ పండిన పంటలో ఒక్క గింజైనాపోకుండా పని నెరవేర్చుకోవచ్చు అని నా నమ్మకం. పది చేతుల్తో సునాయాసంగా పండినపంట అంతా మన గాదెల్లోకి చేరవేయవచ్చు. (అని ఉద్దేశం తెలుసుకోవడానికి అందరి ముఖాలకేసి తేరిపార చూస్తాడు.)

దిగంబరు: అవును. అట్లా జరగవచ్చు.

సఖీచరణు: అది యదార్థంగా జరిగితే మంచిదేను.

సుజను: పొలంపనిలో మనస్ఫూర్తిగా శ్రమపడితే ఆ తర్వాత ఎట్లాగో పంట అంతా... .......

గొలామ్నబీ: అది వెనక్కుపెట్టవలసిన విషయం కాదు.

ఫకీరు: అయితే ఏ పొలంలో పంట ఆ పొలంలో ఉండిపోతుంది.

దయాలు: అదంత తక్కువ సంగతి అనుకుంటున్నావా?

ఫకీరు: అదీ సరైన పద్ధతికాదు. మన సమస్య అంతలో తీరిపోలేదు. ఆ పంటను ఎట్లా కాపాడగలవు నీవు. జమీందారు ఉన్నాడు. గుత్తవ్యాపారి ఉన్నాడు. పెట్టుబడిదారి ఉన్నాడు.

దయాలు: ఉన్నారు నిజమే. ఆ సమస్యలన్నీ తరువాత వస్తాయి.

సుజను: అవును. జమీందారు శిస్తు అంతా బకాయిపడి ఉంది. పెట్టుబడి దారుకు ఎక్కువభాగం పోతుంది. పంట రాగానే నాలుగువైపులనుంచీ పతిల్లాగ మాకియ్య అంటే మాకియ్య అని వచ్చిపడతారు.

దయాలు: ఏమైనాకానీ, వాటన్నిటినీ అడ్డుకోవాలి. పన్ను చెల్లించే గడువుకు ముందుగానే ధాన్యం అమ్మేస్తాం.

సుజను: అయితే ఆ సంగతి తెలిపేవారెవ్వరు?

దయాలు: ఎవరిమటుకు వారే తెలుసుకోవాలి. కడుపులో చల్ల కదలకుండా ఇంట్లో కూర్చుంటే పని జరుగుతుందా?

బరకతు: స్థితిగతులనుబట్టి ఒక వ్యవస్థ ఏర్పాటుచేసి నడుపుకోవాలి. ముందు రాబొయ్యేవాటికన్నిటికీ ముందుగా ఎట్లా తీర్మానం చేస్తాం?

దయాలు: అసలు విషయం పంట. దేనివల్లా దానికి నష్టంరాకుండా అన్నిటి కంటే ముందుగా ఏదో ఏర్పాటు జరిగితీరాలి.

సుజను: ఆ సంగతే వందసార్లు చెప్పాలా?

దయాలు: అయితే ఒక్కొక్కటే కానియ్యండి!

దిగంబరు: పొలాలన్నిట్లో అందరమూకలిసి శ్రమపడడం మీ కిష్టమేనా? మనస్ఫూర్తిగా చెప్పండి.

(అందరూ ఏకగ్రీవంగా 'శ్రమపడతాం, నిశ్చయంగా శ్రమపడి పనిచేస్తాం' అని కేకలు వేస్తారు.)

బరకతు: అవును. పండినపంట ముందుగా ఇంటికి చేరనియ్యండి. మన మందరమూ ఒక్కమాటగా, ఒక్కబాటగా నడిస్తే ఎన్ని యిబ్బందులైనా ఏమీ చేయలేవని నా నమ్మకం.

దయాలు : వెంటనే ఇబ్బందులన్నీ తప్పిపొయ్యేమార్గం ఒకటి వెతికి కని పెట్టగలమనే ఆశిద్దాం.

దిగంబరు : (ఆనందంతో) అసలు సంగతి తేలిందిప్పుడు. ఏమయినా సరే, అందరమూ కలిసి కళ్ళంచేసి ధాన్యం బస్తాలకెత్తగలిగితే నా పొలంలో పండిన పంటలో సగంపంట గ్రామంలో కష్టపడుతున్న సోదరుల కోసం ఇచ్చేస్తాను.

ఒకడు : (తెలివితక్కువ ముసలిరైతు) పండిన పంటంతా నే నిచ్చేస్తాను. నాలుగు భీగాల ఎకరంకంటే కొంచెం ఎక్కువపొలంతో పంట నేనేమీ తీసుకోను.

దయాల్ : (నవ్వుతూ) పంటంతా ఇచ్చేస్తే ఏమితిని బ్రతుకుతావు నీవు? పిచ్చివాడా!

ఫకీరు : ఎవరిపంట ఎవరిస్తారు ? పొలమంతా ముందుగానే అమ్ముకొని కూర్చున్నవాళ్లు ధాన్యం ఎట్లా ఇస్తారు. ధాన్యం వాళ్ళదా? అదీగాక.... ....

గొలామ్నబి : అది వెనుకటి సంగతి చెబుతున్నావు.

బరకతు : ఆ సమస్యలన్నీ ఇంకా ఉండనేఉన్నాయి. సరే! అయితే ఇప్పుడు ఇంతటితో ఆపేద్దాం. తరువాత మళ్ళీ దయాలు ఇంటిదగ్గర కలుసుకొందాం! సమయానికి మీరందరూ అక్కడికి రావాలి.

దయాలు : (లేచి నిల్చుని) అవును. ఈ సమస్యలెప్పుడూ ఉంటాయి. ఆ తర్వాత ఉంటాయి. ప్రస్తుతం నేను చెప్పేది ఏమంటే రేపు పొద్దుటనుంచే పంట కొయ్యడం ప్రారంభించాలి. ఏమాత్రం ఆలస్యంచేసినా, మరి ప్రయోజనం ఉండదు.

(అందరూ పైబట్టలు దులుపుకొని భుజంమీదవేసుకొని, లేచి నిల్చుంటారు. తరువాత ఇద్దరుముగ్గురు కలిసి కుడివైపుకు ఎడంవైపుకు మెల్లిమెల్లిగా వెళ్ళిపోతారు.)

దయాలు : (ముంగిలిదిగి బరకతు చిన్నకూతుర్ని చూసి నవ్వుతూ దగ్గరకుపోయి) ఎవరిపిల్ల ఈ అమ్మాయి?

నిరంజన్ : (నవ్వుతూ) బరకతు మామ కూతురు. చాలా సిగ్గు దానికి.

దయాలు : అవునుకమా! ఆడపిల్లకు సిగ్గుండకపోతే ఎట్లా మరి? పిల్లకూ నాకూ నికా అయినప్పుడు మరి సిగ్గు పోతుందిలే (తలమీద చేయిమోపి) అవునా?

కూతురు : పో (అని తండ్రి ఒడిలో తలదాచుకొంటుంది.)

దయాలు : సరేగాని నేను నచ్చానా నీకు? నన్ను నికాచేసుకొంటావా చెప్పు. (పిల్ల దయాలు గడ్డంపట్టుకొని గుంజాయిస్తుంది) అరే గడ్డం వదులు. విడిచి పెట్టు (అని విడిపించుకొని) అబ్బో! బలే గయ్యాళిపిల్ల! వట్టి రౌడీపిల్ల!

ఫకీరు : ఊ! సరేకాని అందరూకలసి పొలంపనిలో శ్రమపడినంతమాత్రాన సమస్యలన్నీ తీరుతాయా? ఇంతకుముందే అమ్మేసుకొన్నవాడు అందరిపొలాల్లో శ్రమచేస్తే ఏమొస్తుంది? పొలం తనఖాపెట్టి సొమ్ముతెచ్చుకొని దిగమింగేసినవాడి పొలంలో పనిచేస్తే మాకు ధాన్యం వచ్చేదెట్లా? పండిన పంట తణఖాపెట్టినవాడి ఇంటికిపోతుంది. తర్వాత ........

బరకతు : ఆహా! ఆ సమస్యలన్నీ ఉంతనేఉంటాయి. అయితే మరి ఎవ్వరూ సభలో అడగలే దెందుకు?

ఫకీరు : కలిసి పనిచేయడం అందరికీ ఇష్టమేనయ్యా! అందువల్ల మాకొచ్చే లాభమేమిటీ అని అడుగుతున్నా?

బరకతు : అట్లాగని ప్రయత్నం ఏమీ చెయ్యకుండా చేతులూ కాళ్లూ ముడుచుకుని ఇంట్లో కూర్చుంచే వ్యవహారం నడిచేదెట్లా?

ఫకీరు : అయితే మంచిదే! ప్రయత్నంచేసి చూశాం? (అని వెళ్ళిపోతారు.)

బరకతు : ఫకీరున్నాడే బొత్తిగా అదోమోస్తరు మనిషి సుమీ!

నిరంజను : (గడపమీద కూర్చొని హుక్కా తయారుచేస్తూ) అదేమిటి మామా! నిల్చునే ఉన్నావు. వచ్చి కూర్చో.

బరకతు : ఊ! కూర్చుంటాలే (అరుగుపైకివచ్చి కూర్చుంటాడు.)

నిరంజను: (హుక్కాగిన్నెలో నిప్పు ఊదుతూ) మనిషీ, మనిషి స్థితిగతులు, చాలా చిత్రంగా ఉంటాయి సుమా! మళ్ళా యింటికితిరిగివస్తాననిగాని, కొత్తగా ఇల్లు కడతాననిగాని ఎప్పుడైనా అనుకున్నానా? (అని హుక్కా అందిస్తాడు.)

బరకతు : (హుక్కా పీలుస్తూ) జీవితమంటే ఇంతే! పైకి ఎక్కడమూ, దిగజారడమూ. దిగజారడమూ పైకెక్కడమూ.

నిరంజను : అవునవును. అంతే ఒక్కొక్కప్పుడు మనస్సులో "ఈ పడవ ఇక ముందుకు సాగదు, అడ్డంగా దొంగయినక మేటవేసింది" అని అనుకొన్నాను. కాని, చూస్తూండగానే మళ్ళీ వెంటనే చరచరమని పడవ నడవడం ప్రారంభించింది. ఝరఝరమని సముద్రంనీరు ఎగపోటువచ్చి ఇసుకతిప్ప అంతా కొట్టుకుపోతుంది. ఎంత అద్భుతమో చూడు!

బరకతు : (హుక్కా పొగవదిలి) సంసారం మోస్తరు అంతే. కన్ను పొడిచిన చేత్తోనే కన్నీరు తుడుస్తాడు దేవుడు! సరేలేగాని రాత్రికావచ్చింది. నేనిక లేస్తాను. (లేస్తాడు.)

నిరంజను : (లేచి నిల్చుని) సరేకాని, రాత్రి మండలు ఇంటికి వెళతావా మరి?

బరకతు : వెళతాను. నువ్వురావా ఏమిటి? (అని ముందుకు వెళతాడు.)

నిరంజను : (వెనకనే వస్తూ) తప్పకుండా వస్తాను. (బరకతు వెళ్లిపోతాడు).

[నిరంజను తిరిగివచ్చి ముందరుగుమీద వెల్లికిలా పడుకుంటాడు. వినోదిని కిరసనాయిలు బుడ్డీ వెలిగించి ముంగిలికి ఒకవైపున పొయ్యిలో నిప్పువేసి కుండ పొయ్యిమీద పెడుతుంది. అన్నపుకుండచుట్టూ నిప్పుమంట కదులుతూ కనపడు తూంటుంది. నిరంజను పాట మొదలుపెడతాడు.]

కణకణలాడే నిప్పుల్లో పడి
కాలి కాలి, బంగారం అగునట
ఈ సంగతి మరి అబద్ధమైతే
ఆర్తులకింకే ఆశలేదురా!
దుఃఖదాహమే సుఖానమ్మను
తొల్లిటివాక్యము తథ్యమురా!
అదే నమ్ముకొని ఇదే దారిబడి
బతుకుతెరువు లేకుంటిమిరా.

[పాట అవుతుండగా కుంజ, రాధికా ప్రవేశిస్తారు.]

కుంజ : (ఇంటిముందు చీకటిలో నిల్చుని) ఇదేమిటి? మళ్ళా ఎవళ్లింటికో చేరాం. అదివరకటిల్లుకాదు. (నిట్టూర్పు విడిచి) అయ్యో! రామా!

రాధిక : (మెల్లిగా) చీకటిలో గుర్తురావడంలేదు. ఎవరిల్లో.

నిరంజను : (గభాల్నలేచి) ఎవరువారు? అక్కడ మాట్లాడుతున్నవారెవరు?

కుంజ : (తడబడుతూ) మేమే.

నిరంజను : (లేచి నిల్చొని) మేమే అంటే ఎలా తెలుస్తుంది? మీ రెవరో చెప్పరేరా ?

కుంజ : మేమేనయ్యా. సరేగాని ప్రధాన సముద్దారు ఇల్లెక్కడో చెప్పగలరా?

నిరంజను : సముద్దారు ఇల్లా? (రెండడుగులు ముందుకువేసి) ఇదే. కాని అసలు మీరెవరో చెప్పరేం?

కుంజ : మేము........(రాధికకేసి చూసి) ఆ గొంతు నిరంజనుదిలాగుందే? మన నిరంజను.

నిరంజను : ఎవరో వీళ్లు చెప్పడంలేదు. వినో, దీపం ఒకసారి తీసుకొస్తావా? (అని భార్యను కేకవేస్తాడు.)

[వినోదిని కిరసనాయిలుబుడ్డీ తీసుకుని దగ్గరకువస్తుంది. ఎర్రని దీపం వెలుగులో ఒకరి ముఖం ఒకరు చూసుకొని క్షణంసేపు నివ్వెరపడిపోతారు. వెంటనే నిరంజను ముందుకువస్తాడు.]

నిరంజను : అన్నయ్యా! అన్నయ్యా! నీవా!! (అని కౌగలించుకొంటాడు.)

కుంజ : (డగ్గుత్తికతో) అదుగో చూడు మీ మరదలు, నిరంజన్.

వినోదిని : (గభాల్నవచ్చి కిరసనాయిలు బుడ్డిని కిందపెట్టి రాధికను కౌగలించుకొంటుంది.)

కుంజ : నన్ను ఆనవాలు పట్టావా?

నిరంజను : ఆహా! గొంతు ఆనవాలే. మీరు మేము చచ్చిపోయామనే అనుకుంటున్నారుకదూ?

కుంజ: ఇక నాకేవిచారమూ లేదు.

విరంజను: అందరమూ బ్రతికున్నాం. ఇక ఏ బాధాలేదు. (ఇద్దరూ కౌగలించుకొంటారు. విరంజను తలను గుండెకు ఆవించుకొంటాడు కుంజ.)

[తెర వాలుతుంది.]

# చతుర్థాంకం - రెండో రంగం

[స్థలం కుంజ గృహాంగణం. అప్పుడే కోసిన పంటపైరుతో ముంగిలి విండిఉంటుంది. ముంగిట్లో ఒకవైపున నెత్తికి అంగవస్త్రం చుట్టుకొని చాకలి బల్లలాటి ఎత్తైన వెదురు చట్రంమీద పనలుకొట్టి ధాన్యం నూరుస్తుంటాడు విరంజను. ఎడమవైపున కింద రాలి పడిన ధాన్యం పోగుచేస్తూ రాధిక కనబడుతుంది. పోగుచేసిన ధాన్యం గంపలకెత్తి జాగ్రత్తపడుతుంటుందామె. ఆ పక్కనే కొత్త ధాన్యం పౌణక సగం కనబడుతూ ఉంటుంది ఎదుటికి. తలకు గుడ్డచుట్టుకొన్న ఒక మనిషి పైరుకుప్పలోంచి పన కట్టలు పొదుల్లతెచ్చి విరంజను చేతికందేటట్లు కుప్ప పెడుతుంటాడు. విరంజను పక్కనే నిల్చొని మరోమనిషి బల్లమీదకొట్టి ధాన్యం మారుస్తుంటాడు. వినోదిని చేటతో ధాన్యం చెరుగుతూవుంటుంది. కుంజ హుంక్కా చేత్తో పట్టుకొని అటూఇటూ పచారుచేస్తూ అన్నీ జాగ్రత్తగా కనిపెడుతూ ఉంటాడు. పగటి ఎండవెలుగులో శ్రద్ధగా పనిచేస్తున్న ఆ మనుషుల ముఖంలో, కళ్ళల్లో ఇన్నాళ్ళకు పండగవచ్చినట్లు సంతోషమూ ఉత్సాహమూ కనబడుతుంది దూరానికి. గంపకు నగం ధాన్యంనింపి రాధికచేసిన ఏదో చిలిపి చేష్టకు ధాన్యం గంపమీద పడుతుందేమో అన్నట్లు విరగబడి నవ్వుతూ కనబడుతుంది. రాధిక నిండా ధాన్యంపోసిన చేట చేతికందీయగానే నెత్తికెత్తుకొనిపోయి చెరుగుతూ ఉంటుంది వినోదిని. విరంజన కుప్పలోని పనలు చేత్తో పైకితీసి వెదురుచట్రంమీద కొట్టి ధాన్యం రాలగొట్టి వట్టి గడ్డివామమీద పడేసి వగరుస్తూ ముఖమ్మీది చెమట తుడుచుకొంటూ వినోదినికేసి చూస్తాడు.]

విరంజను : (నవ్వుతున్న వినోదినికేసి చూపించి) చూడు. ఆమె ఏంచేస్తు న్నదో అటు చూడవేం? నవ్వుతూ ముందుకు పడిపోతుందో ఏమో? అట్లా చేస్తే మరి పని అయినట్లే! ధాన్యం సరిగ్గా ఎత్తడంకాసీ. (వినోదిని మరీ గట్టిగా నవ్వుతూ అన్నట్లే ముందుకు తూలి ధాన్యం కుప్పమీద పడుతుంది. ఆ మాటలు విని గట్టిగా నవ్వడంతో రాధిక చేతుల్లోంచి చెరుగుతున్న చేట జారి పడిపోతుంది.)

విరంజను : ఏమయింది మీకు? మీరందరూ ఒకటే మోస్తరు. నవ్వంతా దుబారా చెయ్యకండి. కొంచెం ఉంచుకోండి. ముందున్నది మునళ్ళ పండగ.

వినోదిని : వేడుక చూస్తున్నా.

విరంజను : (కొన్ని కొత్తపననలుతీసి పట్టుకొని) ఆవిధంగానే తోస్తున్నది (అని ధాన్యం నూరుస్తుంటాడు.)

రాధిక : (నవ్వు ఆపుకొని వినోదినికి విందుచేట అందిస్తూ) తీసుకో! నవ్వు నాలుగందాల నష్టం. ఈ చేట తీసుకొని నీపనిచూసుకో! (విరంజనుకేసి పైగచేసి) ఎంత నవ్వు అంత దుఃఖం అని చెప్పాడు బావగారు తెలుసా?

విరంజను : అదుగో బావగారు వస్తున్నాడు. నీ నవ్వేమిటో చూస్తాడు. (రాధిక పనిలో దిగుతుంది.)

రాధిక : (ముసుగు ముఖంమీదికి లాక్కొని) నవ్వు! ఈసారి చూద్దాం! (అని వినోదినికేసి చూస్తుంది.)

కుంజ : (రాధిక దగ్గిరికివచ్చి) ఏం. పదకొండు* కాటాలదాకా అయినట్లుందే ధాన్యం! అయితే తూకం వెయ్యొచ్చు. (నవ్వుతూ) ముందుగా నా ధాన్యమే తూచాలి.

రాధిక : పదకొండు కాటాలెక్కడ? పది కాటాలే.

విరంజను : అయితే పది కాటాలేనా? దయాలు అన్నయ్యా! ఇంట్లో అను కొన్నట్లు పదకొండూ కాలేదన్నమాట.

కుంజ : తక్కువల్లా ఒక్క కాటేకదూ! నా ధాన్యంలో నుంచి ఇంకా ఎక్కువే ఇస్తానులే. మాట అన్నాంగనక పదకొండూ ఇచ్చి తీరవలసిందే.

విరంజను : అది నీకు బరువవుతుందేమో? నీ ఇష్టం? నీవిచ్చేది ధర్మధాన్యం గాదెలోకే పోతుంది.

---

* భూమి కొలత.

దయాలు : (ప్రవేశించి) ధర్మధాన్యంలోకే పోతుందంటావేమిటి? (రాధిక, వినోదిని దయాలును చూసి ముసుగు సవరించుకొంటారు.)

కుంజ : ఇదిగో మండలు వచ్చారు. ఏమీలేదు, ధాన్యంసంగతి అనుకొంటున్నాం. అన్నమాట ప్రకారం ధర్మధాన్యం గాదెకు నా వంతుధాన్యం ముందుగానే ఇచ్చేస్తున్నాను.

దయాలు : (చేత్తో బట్టతల తడుముకుంటూ) మంచిది, మంచిది. అయితే ధాన్యం అంతా ఎత్తడం అయిందా?

కుంజ : ఆ. కావచ్చింది.

దయాలు : (రాధికకేసి చూసి నవ్వుతూ) ఇప్పుడిక ఏదోరోజున కొత్త ధాన్యంతో మిఠాయిచేసి తినిపించాలమ్మా నీవు.

కుంజ : దానికేం. తప్పకుండా తినిపించచ్చు. నవాన్న ఉత్సవం వస్తుంది కదూ !

విరంజను : సరే.గాని! మండలు అన్నయ్యా! ఈ సంవత్సరం నవాన్న ఉత్సవం ఉంటుందా?

దయాలు : అదేమిటీ! ఎందుకుండదూ! తప్పక ఉంటుంది.

విరంజను : (నవ్వి) ఏటేటా జరుగుతున్నట్లే ఈ యేడుకూడా మంచి సందడిగా జరగాలి. కర్రసాముకూడా తప్పక ఉండాలిసుమా!

దయాలు : తప్పక ఉంటుంది. ఈసారి నీతో కర్రసాము చేస్తాను నేను. తయారయ్యేఉండు తెలిసిందా?

విరంజను : నాతోనా? శభాష్! మరీ మంచిది!

దయాలు : కర్రతోనేనా కొట్లాట? (అని నవ్వుతాడు.)

విరంజను : అవును. అదే.

దయాలు : మరి నేను కర్రపట్టుకొని పోట్లాడలేకపోతే?

విరంజను : పోట్లాడలేకపోతే ఒకసేరు జిలేబీ పందెం.

దయాలు : (అందరితో) వింటున్నారా మీరందరూ? నేను ఓడిపోతే నిరంజను నాచేత ఒక శేరు జిలేబీ తినిపిస్తాడుట! నిరంజన్! సరేలే. అదేమిటో నేనూ చూస్తా.

నిరంజను : శేరు జిలేబీ ఎలా తింటావో నేనూ చూస్తా! (అని నవ్వుతాడు.)

కుంజ : మండలు! పొలం వెళ్ళలేదా ఏమిటి?

దయాలు : అవును. పొలంనుంచి తిరిగివస్తున్నాను. ఇవాళ బరకతుమియా వంతుకదూ!

కుంజ : అయితే సరే! నీవు ముందు వెళ్లు. తరువాత నేనూ వస్తానులే!

నిరంజను : ఊహూ! మండలు అన్నయ్యా ధీమా ఏమిటో ఒకసారి.... ....

రాధిక : (ముసుగు తలమీదికి లాక్కొని) ముసలివాడైనా దయాలు, మంచి ఉన్నవాడులా కనపడతాడు.

వినోదిని : మండలుకు కర్రసాముకూడా బాగా తెలుసు. అందుకే అంత గట్టిగా చెప్పాడు. చివరకు పదిమందిలో ముసలివాడిచేత అవమానంపాలు గావలసి వస్తుందేమో? అలాగైతే మరి ... ....

నిరంజను : ఓహో! అలాగైతే నీవు నన్ను వదిలేస్తావా? మండలు దృఢ నిశ్చయమేమిటో చూస్తాను.

రాధిక : (వేళాకోళంగా) అయినా ఒక్క శేరు జిలేబీకదా నీకు పోయేది?

కుంజ : వేళాకోళాలకేమిటిగాని ధాన్యం ఎత్తడం పూర్తి అయిందా? అను కొన్నట్లు పదకొండు కాటాలు కాలేదుకదూ? కాదులే నవ్వుతూ వేళాకోళాలాడు కుంటూ వుంటే పని జరుగుతుందా మరి.

రాధిక : (తెచ్చిపెట్టుకొన్న కోపంతో) ధర్మగాదెకు కొలుస్తానంటే ధాన్యం బాగుచేసియ్యనా ఏమిటి? నేనేమయినా అడ్డుచెపుతున్నానా? పదకొండు కాటాలు, పదకొండు కాటాలు అని చెవులు బద్దలుకొట్టేస్తున్నావు నీవే.

నిరంజను : అయితే నేను వెళ్ళిపోతాను. ఇక ధాన్యం కొలవాలి.

రాధిక : కాటాధాన్యం లేకుండా సరిపోతుందా?

కుంజ : ధర్మగాదెకు ధాన్యము ఇవ్వడానికి మాదుముఖం పెట్టకు నువ్వు జ్ఞాపకం తెచ్చుకో. ఈ ధాన్యం ......

రాధిక : నే నెందుకు మాడుముఖం పెడతాను. ధర్మగాదె కోసం ధాన్యం ఎత్తుతాను ఇంకా. (చేతిలోని చేటకిందపెట్టి రాధిక వినోదినిదగ్గరనుంచి విందుగంప తీసుకువచ్చి కుంజకిస్తుంది.)

కుంజ : (పాణకలో ధాన్యం పోస్తూ, పెద్ద నిట్టూర్పువిడిచి) ఇది ఎవడి తాలూకు ధాన్యం! ఎవరిస్తున్నారు ఇప్పుడు? అయ్యో! ఈ పొలం అమ్మడాన్నిగూర్చి ఎంత గందరగోళం జరిగిందప్పుడు. ఏమి సంసారం! ఏమి లోకం! ఎక్కడ చచ్చి పోయాడో, ఎప్పుడు చచ్చిపోయాడో పెద్దనాన్న!! అవసానసమయంలో కళ్ళతో చూసే అదృష్టంకూడా లేకపోయింది. ప్రాణం ఉసూరుమంటున్నది. అయినా నా కర్తవ్యం నెరనేర్చక తప్పదుకదా!

రాధిక : (రెండో గంపనిండా ధాన్యంపోసితెచ్చి) ఇదుగో, తీసుకో నీతో నీవే మాట్లాడుకుంటున్నావేమిటి?

కుంజ : ఏదోలే. పెద్దనాన్న సంగతి. ఇదుగో గంప తీసుకో.

రాధిక : (కుంజ చేతిలోని ఖాళీగంప తీసుకొని వినోదిని చేతికిస్తూ) ఇదుగో వినోదా! గంప తీసుకో.

(పొడుగాటి చొక్కా వేసుకొని చేత్తో వింతావారవేస్తూ పాడుకుంటూ ఒక ఫకీరు ప్రవేశిస్తాడు. వెంట ఇద్దరు ఫకీర్లు వంత పాడుతుంటారు. పాట మాని ఏదో గొణుగుకుంటూ)

పా ట

తనకు మాలినది ధర్మంగాదను తలంపు మిద్యేనండి
అందరు హిందూ ముస్లిం రైతులు అన్యోన్యంగా ఉండండి
ఇది మినహా సదుపాయం వేరే ఏదీలేదని తెలుసుకోండి
ఇప్పటికింకా అలసడుకుంటే ఎప్పటికబ్బునో చెప్పండి
వివరంగా ఈ సత్యం తెలిసియు వేరై ఉంటే ఎవరైనా
ఆరునెలల్లో వాళ్ళందరికీ అందును మృత్యువు ఫర్మానా!!
ఖలీల్పూరున జబ్బరుమియ్యా కష్టగాధ వినలేదా

ఇరుగూపొరుగూ విరోధులౌతే ఇందుకు హేతువు కాదా!!
ఎన్నడెరుంగని మహాక్షామమున ఎందరు కర్షకసోదరులు
అక్కట! అకాలమరణమ్మందిరొ లెక్కచెప్పగల రెవరు?
ఎన్ని చచ్చినయో ఆవులు దూడలు ఎవరు లెక్కపెట్టారు?
ఎందరు చచ్చిరో స్త్రీలూ శిశువులు ఎవ్వరు రక్షించారు?
ఇంటావిడ పిచ్చెత్తి అయిబులేకెటకో లేచిపోయింది
కాదిది నీచప్రవృత్తి బ్రతుకుటకు కాంతకు బాధ్యత ఉంది
గుక్కెడు పాలకు దిక్కులేక పసికూనలు పిల్లలు మృత్యులైరి
తల్లి ప్రేతమునకయ్యో నెత్తురుధారలు రొమ్ముల దిగజారి
ఎదపై గుడ్డకు కరువైపోతే ఇంతిసిగ్గు బుగ్గవదా?
భార్య మానసంరక్షణచేసే బాధ్యత మొగుడిదికాదా?
ఇంటిపక్కనే కాపురముండిన ఇల్లాలయ్యో! ఏముంది
పాడెగుడ్డతో నా మానము కాపాడుకొంటినని ఏడ్చింది.
సజ్జనులైన గృహస్థులెందరో చచ్చిబతికినారంట
అన్నంలేకనె కాదా జనావి కకాలమరణము లింటింట
పండిన ధాన్యం మంటగలిస్తే విందును కన్నుల నీరు
గట్టిగ నాగలిపట్టి దున్నితే మట్టిని పండును బంగారం
ఈ బతుకంతా ప్రహసనమైతే ఏమున్నదిరా ఫలము
జీవించాలను కోరికఉంటే కావలె నీకు మనోబలము
ఫలసాయంతో విందిశుందడం ప్రతి యింటికి శుభలక్షణము
రైతులేకమై సహకారంతో శ్రమపడుటందుకు కారణము
క్షుద్రబుద్ధియును, స్వార్థసిద్ధియును కూడదెపుడు సంసారులకు
గుట్టు తెలుసుకో కొంచెపుపిట్టకు కూత ఘనమ్మను పలుకు.

ఫకీరు: అమ్మా! పాటపాడి దీవించే ఫకీరుకు ఏ ఇబ్బందీ రాకుండా కాపాడాలి మీరే తల్లీ!

(పల్లవి మళ్లా పాడుతాడు) తనకు మాలిన ధర్మము..........

రాధిక: (చిన్న తట్టనిండా ధాన్యంతెచ్చి ఫకీరు జోలెలో పోస్తుంది.)

(తెర వాలుతుంది.)

# చతుర్థాంకం - సూడో రంగం

[ఎండిపోయిన గంగానదిగట్టున విశాలమైన ప్రదేశం. చాలా దూరంగా పశ్చిమాకాశాన అస్తమిస్తున్న ఎఱ్ఱని కాంతి. చరాచరాలన్నీ బంగారు పూసినట్లుసంధ్యారాగంతో జిగజిగ మెరిసిపోతుంటాయి. ఈరోజు నవాన్న పండగ. ఆబాలవృద్ధం గ్రామంలోని స్త్రీ పురుషులందరూ గుంపులుకూడి ఉన్నారు. జబ్బుగా ఉన్నవాళ్ళ శరీరాల్లో గతించిన మహాక్షామంనాటి విషాదచ్ఛాయలు ఇంకా కనబడుతుంటాయి. అయినా ఈరోజున, ఈ గంగాతీరాన, ఈ సంజవెలుగులో ఈ పండుగ జరుపుకొంటున్నారు. అంతులేని జీవనవికాసంతో రైతాంగం అంతా ఒళ్లు మఱచిపోతున్నది. నాలుగో అంకంలో ఉన్న మొదటిరంగంలో ఉన్న పాత్రలందరూ వేరు వేరు వేషాలతో ఈ ఉత్సవ సమావేశంలో పాల్గొంటున్నారు. అందరూ రైతులు. మొలచుట్టూ భుజంమీద తలకూ అంగవస్త్రం తప్ప మరే దుస్తులూఎవరికీలేవు.) తెరలో నడుమ నడుమ ఎద్ల రంకెలూ, మెడకున్న గంటల మువ్వల చప్పుళ్ళూ ఉండుండి వినిపిస్తుంటాయి. మూడునాలుగు సార్లు డోళ్లు వాయించిన చప్పుళ్లుకూడా వినబడతాయి) (తెర ఎత్తగానే స్టేజీ అంతటా ఛాయాచలనం బాగా కనబడడానికి నాలుగడుగుల ఎత్తున్న గోడకుముందు రైతుపడుచులు జట్లుజట్లుగా కాళ్లు చాచుక కూర్చొని పాడుతూ వక్కాకు నములుతూ ఉంటారు. ఎక్కువ నూనె రాసుకోవడంవల్ల వాళ్ళ తలలన్నీ నిగనిగ మెరుస్తూ ఉంటాయి. కలకల నవ్వులతో ఆ ప్రదేశమంతా చాలా సందడిగాఉంటుంది (తలకూ మొలకూ అంగవస్త్రం తప్ప మరేదుస్తులూ లేని శరీరాలతో సేద్యగాళ్లు పందెపు కోళ్ళను సందిట పట్టుకొని కూర్చుంటారు. (ఆ పుంజుల కాళ్ళకు దారం కట్టడంవల్ల అవి ఎగరబోతూ రెక్కలు రెపరెపకొట్టుకుంటున్న చప్పుడు అప్పుడప్పుడు వినవస్తుంటుంది) కోళ్ల పోరు చూసేవాళ్ళందరూ ఎదురుగా గుంపుకూడి నిలబడతారు. రెండేసి కోళ్ళకు పందెం జరుగుతుంది. చివర పందెం నెగ్గినవాటికి ఒక తుండు గుడ్డ ఒక కొత్త కొడవలి బహూకరించడం జరుగుతుంది) కోళ్ళ పందెం కాగానే రైతులు పాట పాడతారు. పాట ముగియగానే ఎద్ల పరుగుల పోటీ జరుగుతుంది. అంకటు ముందునుంచి తెరలో ఎద్ల పరుగులూ గిట్టల చప్పుడూ వినవస్తుంటుంది. ఈ దృశ్యమంతా (Shadow play) ఛాయా చలనంగా చూపించాలి. ఒక అట్టమీద ఎద్లబొమ్మ చూపించ వచ్చు. ఆ సమ

యంలో ఎడ్ల మెడగంటా మువ్వలూ అన్నీ ఒక్క మాటుగా ఘణంగ్ ఘణంగ్ అని ఘల్లుఘల్లు అని తెరలో మోగుతుండాలి.(పందెం ముగియగానే ఎవరెద్దు గెలిచిందో వారికి ఒక కొత్త ధోవతి, ఒక కొత్త *గావంచా, ఒక కొత్త నాగలి, ఇచ్చి బహూకరించడం జరుగుతుంది. మూడోది క్రరవోరు జరుగుతుండగా ప్రధాను వచ్చి హాజరవుతాడు. కర్షక రమణుల పాట.)

పాట

బంగారు పండించు గంగమ్మతల్లీ! మళ్ళీరావమ్మా మా పల్లెపట్టులకు
కూటికీ, గుడ్డకూ లోటొాదవకుండా, గొడ్డుకూ గోదకూ కొాదవరాకుండా
పేదకూ సాదకూ పీడలేకుండా కరుణించవమ్మా! మా గంగమ్మతల్లి॥ బం॥

(కోడిపందెగాళ్లు ఎనమండుగురూ పుంజాలను సంచిటపట్టుకొని తమ తమ పుంజాలను పొగుడుకుంటూ జుట్టు దువ్వుతూ నలుగురు నలుగురు చొప్పున రెండు జట్లుగా కూర్చుంటారు. కోళ్ల కాలికికట్టిన దారం ఎడమచేతి చూపుడుచేతికి చుట్టి కట్టడంవల్ల ఆపుంజాలు ఎగరాలన్నా ఎగరలేవు. కర్షక రమణుల పాట ముగియగానే సంభాషణ ప్రారంభమవుతుంది.]

1 వ జట్టులోని 1 వ వ్యక్తి : (పుంజా ఎగరడానికి యత్నిస్తుంటే పట్టుకొని) అబ్బో! పందెంగెలవాలని తొందరపడుతున్నావే!

2 వ జట్టులోని 4 వ వ్యక్తి : (పుంజా రెక్కలు కొట్టుకుంటూంటే) అరె! ఏమిటా తొందర! బాబుమాట వినిపించగానే తల వేడెక్కిపోయినట్లుంది. అదుగో! అప్పుడే కళ్లు ఎరుపెక్కాయి పోట్లాడుతావా? ఆగూ కొంచెంసేపు!

2 వ జట్టులోని 3 వ వ్యక్తి : (పుంజాను రొమ్ముకెత్తుకొని) ఇంట్లో దీన్ని పట్టుకోవడమే కష్టమయిపోయింది, హఠాత్తుగా పట్టుకోబోతే ఎగిరిపోయి చెట్లలో దూరింది. దగ్గర్లోనే దొరికిందిలే! వదలకుండా పట్టి తీసుకువచ్చాను. ఇది అంత బలమయిందికాదు. అయినా పోట్లాట బాగాతెలుసు. ఎదురుదెబ్బకు లెక్కచెయ్యదు. ఇంటిదాకా తీసుకురావడానికే భయం వేసింది.

---

* బెంగాలులో స్వయంగా నేసిన తుండుగుడ్డ బహూకరించడం అలవాటు.

2 వ జట్టులో 1 వ వ్యక్తి: (1 వ జట్టులో 2 వ వ్యక్తితో) అయితే ఇది యింకా చిన్న పిల్లలాగుందే! దీన్ని ఎందుకు తీసుకువచ్చావయ్యా! పుంజాలన్నీ పందేనికి అలవాటుపడ్డాయి. ఒక్క పందానికికూడా ఆగలేదు ఇది.

1 వ జట్టులో 2 వ వ్యక్తి: (నవ్వుతూ) దేనిమాట నువ్వంటున్నది?

2 వ జట్టులో 1 వ వ్యక్తి: ఈ పుంజానుగూర్చే అడుగుతున్నాను. తెచ్చే టప్పుడు బాగాచూసి పందానికి అలవాటుపడ్డదాన్ని తేవడం మంచిదికదూ!

1 వ జట్టులో 2 వ వ్యక్తి: (నిర్లక్ష్యంగా నవ్వి) సరే! చూస్తావు కదూ!

1 వ జట్టులో 3 వ వ్యక్తి: వట్టినే గప్పాలు కొట్టకు. ఆ పుంజు ఎక్కడిదో తెలుసా?

2 వ జట్టులో 1 వ వ్యక్తి: (కంగారుపడి, ఎక్కడిదేమిటి?

1 వ జట్టులో 2 వ వ్యక్తి: (1 వ వరసలో 3 వ వ్యక్తితో) మాట్లాడకు. వెళ్ళు. చెవులుంటే విను. పో.

1 వ జట్టులో 2 వ వ్యక్తి: ఊహూ. తిరుగుడుపుంజా. చూడడానికి చిన్నది కాని మొత్తంమీద పోట్లాటలో తేలు!

1 వ జట్టులో 2 వ వ్యక్తి: పెద్ద పెద్ద పందాలలో మూడు దూకుళ్ళతో ఎదట పుంజాను భూమ్మీద పడేసింది! దీనికి భయమంటే ఏమిటో తెలీదు! చిన్నపిల్ల అని నువ్వు అనుకుంటున్నావు.

1 వ జట్టులో 3 వ వ్యక్తి: (1 వ జట్టులోని 2 వ వ్యక్తితో పుంజా ముక్కులో చేయిపెట్టి) ముక్కే కనపడడంలేదు. ఎట్లా గట్టిగా పొడుస్తుందో, కాలి కత్తి కదపకుండా ముక్కుతోనే పొడుస్తుందేమో!

(చేత్తో నొక్కగానే పుంజా కూస్తుంది.)

2 వ జట్టులో 1 వ వ్యక్తి: నావంతు అయిపోయింది. పందెంలేదు గిందెం లేదు (అని విరాళతో విట్టూరుస్తాడు).

1 వ జట్టులో 2 వ వ్యక్తి: నే నది మొదటే కనిపెట్టాదు. మరి చెప్పే దేమిటి? ఇంటికెళ్ళి కడుపునిండా భోంచెయ్యి.

2వ జట్టులో 1వ వ్యక్తి: అదే మంచిపని. (1వ జట్టులో 2వ వ్యక్తి పెదముఖం పెడతాడు. ఇంతట్లో దయాలు వస్తాడు.)

దయాలు: పుంజుల్ని సందిట్లో పెట్టుకొని ఇంకా కూర్చున్నారేమిటి? ఊఁ! మొదలుపెట్టండి.

1వ జట్టులో 1వ వ్యక్తి: మేమంతా సిద్ధమే. జడ్జీలు వస్తే మొదలు పెట్టవచ్చు.

దయాలు: జడ్జీలంతా వచ్చే ఉన్నారు. ఓయ్, కుంజా! బరకతును వెంట బెట్టుకొని ఇటురా!

కానియ్యండి పుంజుల పోట్లాట. పందెగాళ్ళందరూ వెంటనే రండి! (అని కేకవేసి) ఈమాటు మాంచి, మాంచి పుంజులు వచ్చినట్టున్నాయి! అయితే పందెం చూడవలసిందే!

[నలుగురు, నలుగురు చొప్పున రెండుజట్ల పందెగాళ్లు, వాళ్ళవెనుక జడ్జీలు, జనం, గుంపుగా నిల్చుంటారు. నడమ జతకూ, జతకూ పోట్లాట ప్రారంభమవుతుంది. పోట్లాట చూస్తున్న వాళ్ళందరూ "అబ్బో! "హహ్హ"! "కొట్టు"! "తిరిగి కొట్టు"! "రెక్కలతో కొట్టు"! "భేష్"! భేష్!" అని పొగుడుతారు. నేపథ్యంలో మెడకూ కాళ్ళకూ కట్టుకొన్న గజ్జెల మోతతో రమణుల పాట మళ్ళా వినపడుతుంది. ఆ వెంటనే పోట్లాట ముగుస్తుంది. 2వ జట్టులోని 4వ వ్యక్తి పందెం గెలుస్తాడు. వెంటనే అందరూ కలిసి అతణ్ణి పైకెత్తి పట్టుకొని ఎదుటకి తీసుకొస్తారు.]

కుంజ: (నవ్వుతూ వచ్చి) షేక్ సాహెబు పందెం గెలుచుకొన్నాడు. (అతడికి బహుమానంగా ఒక గావంచా, ఒక కొడవలి ఇచ్చి సన్మానం జరుగుతుంది. షేక్ నవ్వుతూ వచ్చి బహుమానం అందుకుంటాడు. జనమంతా పెద్దగా చప్పట్లు కొడుతూ అతన్ని అందరి ఎదుటా పైకెత్తి పట్టుకొంటారు.)

షేక్ మియా: అర్రే! అరెరె! ఏమిటిది! పడిపోతాను.

పందెం కట్టి గెల్చిందోహో షేక్ సాహెబు కోడి
గర్వంతో విప్పారిందోహో షేక్ సాహెబు దాఢి

[అని పాడుతూ జనం గంతులేస్తారు. రెండు మూడు సార్లు పాడిన తర్వాత వెనకవైపుకు పరిగెత్తుతారు జనం. అప్పుడే నేపథ్యంలో పరిగెత్తుతున్న ఎడ్ల గిట్టల చప్పుడు, టంగ్ టంగ్, ఘల్లు, ఘల్లు, గణ్ గణ్ అని గంటల చప్పుళ్లువినపడతాయి. Shadow Play వెనకున్న తెల్ల తెరమీద నాలు గయిదు ఎడ్లరూపాలు తోకలెత్తి పరుగెత్తుతున్నట్లు చూపించవచ్చు. అప్పుడే నేపథ్యంలో రంకెలు, పరుగులూ, కేకలు, చప్పట్లు గోలగా వినవస్తుంటాయి. కొంచెంసేపటికి ఒక రైతును భుజాలమీద కెక్కించుకొని హర్షధ్వనులు చేస్తూ లోపలికొచ్చి 'రహీమ్‌తులా పందెం గెలిచాడు'' అని కేకలు వేస్తారు.]

కుంజ: (ఆ గందరగోళం జరుగుతున్నా బాగా గొంతెత్తి) ప్రతి సంవత్సరము ఈ పండక్కు ఏరకంగా పశువులు వచ్చాయో ఆరకంగా ఈఏడు మొత్తంమీద రాలేదనే చెప్పొచ్చు. కారణం ఏమిటంటే మనకున్న పశువులు చాలా భాగం చచ్చిపోయాయి. మిగిలినవి ఏవైనా ఉంటే ఈ మధ్య వచ్చిన పెద్ద తుఫానుతో జబ్బుచేసి అవన్నీ బాగా దీలాపడిపోయాయి. మొదట ఈయేడు ఎడ్లపందాలు మానివేయాలనే అనుకొన్నాము. కాని దయాలు, మండలు "మన ఈ ఉత్సవానికి ప్రాణం నిజంగా పశువులే! అవి లేకుంటే మరి ఉత్సవం ఏమిటి! జబ్బుపడనీ, మరేమైనా కానీ ఎడ్ల పరుగుపోటీలు ఉండవలసిందే'' అని గట్టిగా చెప్పడంవల్ల పెట్టక తప్పలేదు. పశువులు బలహీనంగా ఉండడమువల్ల పశువులపోటీ అంత సంతృప్తిగా జరగలేదనుకొంటాను. మునపటివ్ని రాకపోయినా ఈమాటు వచ్చిన పశువుల సంఖ్య కూడా అంత నిరుత్సాహంగా మాత్రం లేదు. ఈ పండగకు పోటీకి వచ్చిన వాటిలో రహీంతుల్లాభాయి ఎద్దు పందెం గెల్చింది. అందుకు ఒక కొత్త ధోవతీ, ఒక కొత్తనాగలి ఇచ్చి మన దయాలుమండలు అన్నయ్య మన రహీంతుల్లాభాయీని బహూకరిస్తాడు.

[వెనకాలున్న రహీంతుల్లాను జనం హర్షధ్వనులతో పైకెత్తుకొని ముందుకు తీసుకొచ్చి దింపుతారు. దయామండలు బహూమతులను అతడిచేతికిస్తూ]

దయాలు: వచ్చేఏడు మంచి ఎద్దును తీసుకరావాలి తెలిసిందా?

[ రహీంతుల్లా నవ్వుతూ బహుమతులు తీసుకొని జనంవైపు తిరిగి సలాం చేస్తాడు. జనం మళ్ళా హర్షధ్వానాలు చేస్తారు. ]

కుంజ : ఈమాటు దుక్కి జోరుగా సాగించాలి భాయీ !

[ వెంటనే నేపథ్యంలో డోలువాద్యాలూ కంచుఘంటలూ మోగుతాయి. ఆ మోతను అనుసరించి లయతప్పకుండా అడుగులువేస్తున్న చప్పుడూ లాఠీదెబ్బల చప్పుడూ వినవస్తుంది. సాముచేసేవాళ్లు ఎర్రలంగోటాలు కట్టుకొని కుడిచేతితో లాఠీ, ఎడమ వేగుడాలూ పట్టుకొని ఎదుటివాడి లాఠీ దెబ్బ తగలకుండా డాలుతో ఆపుకొంటూ, అడుగులువేస్తూ, లాఠీలు విసురుతూ పోట్లాడుతుంటారు. మొదటిరౌండు ముగుస్తుంది. అది సూచిస్తూ డోళ్ళమీద ముక్తాయింపుగా మూడుదెబ్బలు మోగిస్తారు రెండోరౌండు సాగుతుంది. తర్వాత మళ్ళా డోళ్ళ ముక్తాయింపు వినవస్తుంది. మూడో రౌండుకు ఇద్దరు వృద్ధులు రంగంమీదికి వస్తారు. అంతకు ముందే అడుగులు వేసుకొంటూ ప్రధాను గుంపులో జొరబడతాడు. ( నేపథ్యంలో ఉరుముల చప్పుడవుతుంది. "ఉత్తరాన మబ్బులురుముతున్నాయి. పోట్లాట వెంటనే కానియ్యండి" అని ప్రేక్షకు డొకడు కేకవేస్తాడు. ప్రేక్షకుల్లో ఇద్దరు ముగ్గురు ప్రధానును చూస్తారుగాని గుర్తుపట్టరు. ఏదో గొణుక్కొంటూ ప్రధాను ముందుకు వస్తాడు. ప్రేక్షకులు కొందరు గుర్తుపట్టి "నాయకుడు ప్రధాన సమాద్దారు! మన నాయకుడు వచ్చాడు!!" అని కేకలేస్తారు. చింకిరి గుడ్డల మూట చంకన పెట్టుకొని తలూపుతూ, ఎర్రలంగోటాతో ప్రధాను ముందుకు వస్తుంటే జనం పక్కకు తప్పుకొని దారి ఇస్తారు. అందరిదృష్టి అతనిమీద పడుతుంది. ]

ప్రధాను : అవును. వచ్చా నేను. ఎక్కడనుంచో ఊడిపడ్డాను. ప్రధాన్నే నేను.

[ ఎన్నడూ లేని ఆనందంతో ప్రధాను కళ్లూ మొఖమూ మిలమిల మెరిసిపోతుంటాయి. కాని నోరు విప్పలేదు కుంజా, నిరంజనూ నిశ్చేష్టులైపోతారు. ]

ప్రధాను : వచ్చేశాను నేను. నేనే ప్రధాన్ను - వచ్చేశాను.

దయాలు : (నమ్మకంలేనట్లు మెల్లిగా) ప్రధాను వచ్చావా? ప్రధానేనా?

[ ఉత్సవం పైన ఒక నల్లమబ్బు కమ్ముతుంది. ]

కుంజ : (కేకవేసి తెలివి తప్పుతూ ముందుకు వచ్చి ప్రధానును గట్టిగా పట్టుకొని) పెద్దనాన్నా ! ఓ పెద్దనాన్నా !! మా పెద్దనాన్నా !!!

ప్రధాను : ఆహా! ఓహో! (రెండు చేతులతో కుంజముఖం పట్టుకొని) కుంజా! నా కుంజా! అబ్బా! చావలేదు. బతికున్నానురా నేను.

దయాలు : ప్రధాన్! ఈ ముసలివాణ్ణి గుర్తుపట్టావా? ఇదిగో! ఇటుచూడు గుర్తుపట్టగలిగావా? నే నెవరో చెప్పు ?

ప్రధాను : (వేలెత్తి చూపుతూ) నీవు! బాబూ నీవు! కృపానాధువుకాదూ! నీ వెవరు?! ఆఁ! నీ వెవరో గుర్తొచ్చింది. దయాల్! దయాలువు కాదూ?!! దయాల్!

దయాలు : అయితే జ్ఞాపకం వచ్చానన్నమాట.

ప్రధాను : నిన్ను మర్చిపోతానా !? మర్చిపోగలనా?? నా దయాలువు. నిజంగా నీవు దయాళువు. (అని కన్నీరు తుడుచుకుంటాడు. పైన పెళ పెళ మని ఉరుము చప్పుడు వినవస్తుంది.)

దయాలు : ఈరోజు నవాన్న పండుగ. ప్రధాన్! మనకు నిజంగా పండగ.

ప్రధాను : అవును! నవాన్న పండుగ. మంచి రోజులొచ్చాయి మనకు. చెడు రోజులు విరగడైపోయాయి. ఆ రోజులు ఇంకెప్పుడూ రావు.

దయాలు : మళ్ళావచ్చినా మనకు భయం లేదు.

ప్రధాను : అవును! మనకు ఇక దుఃఖమన్నా భయంలేదు. కష్టమన్నా భయంలేదు. భేష్! భేష్! మంచిదయ్యా దయాల్, మంచిది.

దయాలు : భయంలేకపోలేదు ప్రధాన్! మహాక్షామం తాకిడి అంతా మన తలమీదుగానే నడిచిపోయింది. అయినా మనమంతా చచ్చిపోలేదు. బ్రతికే ఉన్నాం. మన కుంజ అదుగో! అదుగో మన నిరంజను! అదుగో మన బరకతుమియా!

అదుగో సఖీచరణు! వీళ్ళందరినీ గుర్తుపట్టావా నీవు? ఎందుకు మనమంతా చచ్చిపోలేదో చెప్పు.

ప్రధాను : చావలేదు. మనమంతా మహాకరువులో చచ్చిపోలేదు. సరేకాని ఆ మహాకరువు మళ్లావస్తేనో??

[ ఉరుముల చప్పుడు, కారు మబ్బు ఒకటి లేచి ఉత్సవ ప్రదేశంలో నాల్గోవంతుమీద నల్లని నీడ కప్పివేస్తుంది. ]

ప్రధాను : (మబ్బుకేసి చూపిస్తూ) అదుగో చూడు. కింద ఉత్సవం, ఎంత సంతోషం. ఎంత మహానందం. మళ్ళా ఆ చోటనే దానిపైనే ఏదో ఒక పెద్ద దుమారం కొట్టి పాడుచేసి పోతుందేమో? పెద్ద అల్లరి ఏదో వచ్చి పడుతుందేమో? ఎంతో పెద్దది. ఏదో.... .... ....

దయాలు : తెలుసు! తెలుసు ప్రధాన్! నీ భయం ఉత్తది కాదు! చెపుతున్నాను ఈ మాట మరిచిపోకు. మునుపటిలాగే ఈమాటు అనుకోకుండా హఠాత్తుగా కరువు వచ్చి నా కళ్ళముందు నా పరివారాన్నే, నా స్వజనాన్నే, (జనాన్ని చూపిస్తూ) చూడు. అదుగో నా ఆత్మీయులనే చిన్నాభిన్నంచేసెయ్యలేదు. ఏమాత్రం చెయ్యలేదు. వీళ్ళను తీసుకుపోవాలనుకుంటే ముందు నన్ను తీసుకుపోవాలి. నన్ను దెబ్బగొట్టదలుచుకొంటే ఇప్పటి ఏర్పాటును తలకిందులుచేసి పారెయ్యాలనొస్తుంది. కానీ అట్లా చేయదల్చుకుంటే ఈమారు గట్టిగా ఎదుర్కొంటాం. శక్తివంచన లేకుండా అడ్డుకోగలం ప్రధాన్! అడ్డుకొని తీరుతాం.

ప్రధాన్ : (గట్టిగా అరిచి పడిపోబోతూ దయాలును గట్టిగా కౌగలించుకొని) దయాల్! నా దయాల్! నీ పేరు సార్థకం దయాళూ !!

[ ముందు తెర వాలిపోతుంది. ]